

# ప్రజల మేధావి ఆర్. ఎస్. రావు స్మృతి

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 7 హైదరాబాద్ 120 జూలై 2011 పేజీలు : 68 రు. 15

- మాధవ స్వామి, నటరాజ రామకృష్ణ, ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు ఆర్. ఎస్. రావు, కె. జయశంకర్‌ల సంస్మరణలు
- మరో సింగూరు కానున్న ప్రాణహిత
- బాబా రాందేవ్ దీక్ష
- మానుకోట నుంచి మిలియన్ మార్చ్ దాకా
- ఉత్తరాంధ్ర అభివృద్ధి నమూనా
- 'ప్రజలపై యుద్ధం' రెండో దశ








(22 అక్టోబర్ 1937 - 17 జూన్ 2011)

అభివృద్ధి వెలుగు నీడలు చూడడం నేర్పిన ఉపాధ్యాయుడు
అర్ధ భూస్వామ్య సూత్రీకరణను శాస్త్రీయంగా నిరూపించిన శాస్త్రవేత్త
మార్క్సిస్టు రాజకీయార్థిక, తాత్విక దృక్పథాన్ని అతి సరళంగా చెప్పిన వక్త
నిత్య చలనాన్ని చెపుతూనే ప్రజా సంఘటిత నిర్మాణాల అవసరాన్ని గుర్తించిన ద్రష్ట
నూతన ప్రజాస్వామ్యాన్ని కలగన్న ఆలోచనాపరుడు
స్నేహశీలి, నిరాడంబరుడు, హాస్యప్రియుడు
పూలనూ పిల్లలనూ సంగీతాన్నీ ప్రేమించిన మంచిమనిషి
వీక్షణం, సి.డి.ఆర్.సి. ల పెద్దదిక్కు

## ప్రొ. ఆర్ ఎస్ రావు కు

## కన్నీటి వీడ్కోలు

120

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

జూలై 2011
సంపుటి : 9
సంచిక : 7

| గౌరవ సంపాదకులు : | సంపాదకులు : | సహాయ సంపాదకులు : |
|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | డి.వి.రామకృష్ణారావు |
| కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ : | డి.టి.పి. / పేజ్‌మేకప్ | ఆఫీస్ అసిస్టెంట్ : |
| వై. రామచంద్రం | సి. రాజశేఖర్ | ఎస్. వెంకటేష్ |

## లోపలి పేజీల్లో...



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రూ. 15 | రూ. 15 | రూ. 15 |
| సంవత్సరం | రూ. 180 | రూ. 150 | రూ. 120 |
| మూడు సంవత్సరాలు | రూ. 500 | రూ. 400 | రూ. 350 |
| ఐదు సంవత్సరాలు | రూ. 800 | రూ. 650 | – |
| పది సంవత్సరాలు | రూ. 1500 | రూ. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

## పరిశోధక విద్యార్థులకూ, రచయితలకూ, అధ్యాపకులకూ శుభవార్త

ఈ నెల నుంచి వీక్షణంకు ఇంటర్నేషనల్ స్టాండర్డ్ సీరియల్ నంబర్ (ఐ.ఎస్.ఎస్.ఎన్.) వచ్చింది. ISSN 2231-6892 అనే ఈ నంబర్‌ను పరిశోధక విద్యార్థులూ, రచయితలూ, అధ్యాపకులూ వీక్షణంలో అచ్చయిన తమ రచనలతో ఉదహరించడం వారి విద్యాపరమైన అవకాశాలను ఇనుమడిస్తుంది. ఈ నంబర్ ప్రపంచవ్యాప్తంగా ప్రతిష్ఠాత్మకమైన పరిశోధక పత్రికలకు ఇచ్చేదిగా ఎక్కడైనా గుర్తింపు పొందుతుంది. ప్రత్యేకించి 2009లో చట్టంగా రూపొందిన యు.జి.సి. రెగ్యులేషన్స్ ఆన్ మినిమమ్ క్వాలిఫికేషన్స్ ఫర్ అపాయింట్మెంట్ ఆఫ్ టీచర్స్ అండ్ అదర్ అకడమిక్ స్టాఫ్ ఇన్ యూనివర్సిటీస్ అండ్ కాలేజస్ అండ్ మెజర్స్ ఫర్ ద మెయింటెనెన్స్ ఆఫ్ స్టాండర్డ్స్ ఇన్ హయ్యర్ ఎడ్యుకేషన్ ప్రకారం ఐ.ఎస్.ఎస్.ఎన్. ఉన్న పత్రికలలో వ్యాసం అచ్చయితే అభ్యర్థికి ఉన్నత విద్యలో కానీ, పదవులలో కానీ, పదోన్నతులలో కానీ వేరు వేరు స్థాయిలలో పది మార్కుల నుంచి ఇరవై ఐదు మార్కుల వరకు వస్తాయి. ఈ సౌకర్యాన్ని పరిశోధకులూ, అధ్యాపకులూ విరివిగా ఉపయోగించుకోవలసిందిగా కోరుతున్నాం. – సం.

వీక్షణం జూన్ 2011 సంచికలో ఫోకస్‌గా విద్యారంగాన్ని ఎంచుకోవడం బాగుంది. పాఠశాల విద్యారంగం నేటి స్థితిగతుల గురించి వచ్చిన వ్యాసాలు ఉపయోగకరంగా ఉన్నాయి. కానీ విద్యారంగంలో నేడు ఉన్న పరిస్థితులు, విద్యార్థుల మనోగతం, వారి భవిష్యత్తుకు తోడ్పడే మార్గాలు, ఉపాధ్యాయులకు మార్గసూచికలు నిర్దేశించేవిగా ఉంటే ఇంకా ఉపయోగకరంగా ఉండేది. ప్రభుత్వ పాఠశాలల్లో ఉన్న పరిస్థితుల గురించి, వాటిని మెరుగుపరుచుకోవాల్సిన అంశాల గురించి ప్రస్తావన ఉంది. పట్టణ ప్రాంతాల్లో ఉన్న ప్రైవేట్ పాఠశాల స్థితిగతులను ఎత్తిపడితే బాగుంటుంది. ప్రైవేట్ పాఠశాల యాజమాన్యాల ఇష్టారాజ్యంగా నడుస్తున్న నేటి కాలంలో విద్య ఒక సరుకుగా మారిపోయింది. ప్రైవేట్ పాఠశాలల్లో పనిచేస్తున్న ఉపాధ్యాయుల బోధనా పద్ధతులు, ప్రమాణాలపైనా విశ్లేషణ చేయాలి.

**– టి. రాములు**
*హైదరాబాద్*

నేను గత అయిదు సంవత్సరాలుగా వీక్షణం పాఠకురాలును. వీక్షణంలో అచ్చవుతున్న రచనలు మన చుట్టూ జరుగుతున్న సమకాలీన అంశాలు తెలుసుకోవడానికి చాలా ఉపయోగకరంగా ఉంది. సామాజిక అవగాహనను పెంపొందించుకోవడానికి, అట్లాగే వీక్షణం కొత్త రచయితలు కాదలచుకున్న వారికి రచనా పద్ధతులపై కూడా సమాచారం అందిస్తుండడం ప్రోత్సాహకరంగా ఉంది. ఇది మంచి ప్రయత్నం. ఇటువంటి ప్రయత్నాన్ని కొనసాగిస్తున్నందుకు వీక్షణం బృందానికి కృతజ్ఞతలు.

**– ఎల్. సంతోష**
*శనిగరం, కరీంనగర్*

వీక్షణం జూన్ సంచికను పాఠశాల విద్యారంగం-సమస్యలు, సవాళ్లు అన్న అంశంతో విస్తారంగా, వివరంగా విద్యారంగంలో ఉన్న సమస్యలపై పలు వ్యాసాలను అందించారు. అభినందనలు.

**– పి. నర్సింగరావు**
*మిర్యాలగూడ, నల్లగొండ*

వీక్షణం జూన్ సంచికలో వచ్చిన 'బస్తర్‌ను ముంచెత్తనున్న బోధ్‌ఘాట్ ప్రాజెక్ట్' వ్యాసంలో బి.డి. దమయంతి పాలకుల అభివృద్ధి నమూనాను అక్కడి ప్రజలకు పొంచివున్న ప్రమాదాలను విశ్లేషణాత్మకంగా వివరించారు.

**– జి. అప్పారావు**
*పలాస, శ్రీకాకుళం*

మల్కన్‌గిరి కలెక్టర్ ఆర్. వినీల్ కృష్ణ, జూనియర్ ఇంజనీర్ పబిత్ర మోహన్ మజిల కిడ్నాప్ సందర్భంగా పధ్నాలుగు డిమాండ్లపై చర్చలు జరగగా 2వ డిమాండ్ మాత్రమే సుప్రీం కోర్టులో పెండింగ్‌లో ఉంది. వీక్షణం జూన్ సంచికలో రచయిత భాస్కర్ పేర్కొన్నట్లు మిగిలిన డిమాండ్లు చాలా సంవత్సరాలుగా ప్రజలు ఉద్యమిస్తున్నవే. 6వ డిమాండ్ అనారోగ్యంతో బాధపడుతున్న షీలాదీదీ, పద్మ విడుదలకు సంబంధించి జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వాలతో సంప్రదింపులు జరిగాయా? ప్రస్తుత పరిస్థితి తెలియదు. 7, 8 డిమాండ్లకు సంబంధించి, మాలి, దిమాలి, విశాఖ జిల్లాలలోని బాక్సైట్, ఇతర ఖనిజాల తవ్వకాల లీజు అనుమతులు రద్దు. కాని మన రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరగలేదు. విశాఖ ఏజెన్సీలో బాక్సైట్ తవ్వకాల కొరకు పునరావాస కమిటీని ఏర్పాటు చేస్తూ కిందటి నెలలో మన రాష్ట్ర ప్రభుత్వం జి.ఒ. విడుదల చేసింది. 3వ డిమాండ్ కోరాపుట్, మల్కన్‌గిరి, నారాయణపట్నం, విశాఖపట్నం జిల్లాలోని గిరిజనులకు చెందిన భూములు ఇతరులు ఆక్రమించుకొన్నారు. వాటిని తిరిగి గిరిజనులకు అందచేసి పట్టాలు ఇవ్వాలి. కాని ఈ అంశంపై నేటికీ సర్వే జరగలేదు. 5వ డిమాండ్ కోరాపుట్ జైలులో చిత్ర హింసల వలన తాడంగి గంగాబి, రత్ను సిరికె చనిపోయారు. వారి కుటుంబాలకు నష్టపరిహారం చెల్లించాలి. కాని నేటికీ అమలు కాలేదు. 11వ డిమాండ్ నాల్కో దామన్‌జోడి ప్రాజెక్ట్ నిర్వాసితులకు న్యాయం చేయాలి. నిర్వాసితుల విజ్ఞాపన పత్రాలు జిల్లా కలెక్టర్ దగ్గరున్నాయి. చర్యలు లేవు. 13వ డిమాండ్ కోరాపుట్, మల్కనగిరి జైళ్లలో ఉన్న ఛాసీ మూలియా ఆదివాసీ సంఘ్ కార్యకర్తలు సుమారు ఏడు వందల మంది విడుదలకు సంబంధించి కె. సుధాకర్ పట్నాయక్, ప్రొ. రాధామోహన్ ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడం, సమావేశాలకు వెళ్లడం జరిగింది. ఖైదీలు విడుదల కాలేదు. 14వ డిమాండ్ సెంట్రల్ కమిటీ మెంబర్ అశుతోష్ సేన్, శ్రీరాముల శ్రీనివాస్, గణనాయక్, జీవన్ బోస్, గంటి ప్రసాదం, శిరీష, ఈశ్వరి, సరితల విడుదల. వీరిపై సిమిలిగూడ పోలీస్ స్టేషన్‌లో కేసు నెం. 78, 13 నవంబర్ 2010 ఉంది. ఇప్పటివరకు వీరు విడుదల కాలేదు.

**– తుంపాల శ్రీరామమూర్తి**
*గాజువాక, విశాఖపట్నం*

వీక్షణం జూన్ సంచికలో ఐదు రాష్ట్రాల ఎన్నికల ఫలితాల గురించి లోతయిన విశ్లేషణ ఉంటుందని ఆశించాం. భరణి వ్యాసం మామూలు దినపత్రికల వ్యాసాల లాగానే పైపైన తడిమింది గానీ, సరైన విశ్లేషణ జరగలేదని అనిపించింది.

**– కె. వెంకటేశ్వర్లు**
*కర్నూలు*

వీక్షణం జూన్ సంచికలోని ఎన్. యాకయ్య వ్యాసంలో కొన్ని ముఖ్యమైన విస్మరణల గురించి ఈ ఉత్తరం. 'సృజన' మాసపత్రికకు 1974 నుంచి 1992 వరకు పి. హేమలత సంపాదకులుగా ఉన్నారు. పైగా తెలుగు పత్రికల చరిత్రలో పత్రిక సంపాదకత్వం వల్ల పోలీసు కేసుకు గురై జైలు శిక్ష కూడా పడిన ఏకైక సంపాదకురాలు ఆమె కావచ్చు. పరిశోధకులు తమ పరిశోధనాంశాలను సంపూర్ణంగా అధ్యయనం చేయడం అవసరం.

**– శ్రీనివాసరెడ్డి**
*వరంగల్*

**సవరణ:** జూన్ సంచికలో 'స్త్రీ విముక్తి – మరోకోణం' పుస్తక సమీక్షలో ప్రస్తావించిన మనోరంజన్ మహంతి పుస్తకం శీర్షికను 'క్లాస్, కాస్ట్, జెండర్' – అని సరిచూసుకోగలరు. అలాగే రచయిత ఆశాలత పరిచయంలో కూడా పొరపాటు దొర్లింది. ఆశాలత పనిచేసే 'ఆంత్ర' పశుగణ ఆరోగ్యం, వ్యవసాయంలపై పనిచేస్తుంది. ఆశాలత సామాజిక కార్యకర్త. 'యక్షి' అనే సంస్థ ఆదివాసుల సమస్యలపై పనిచేస్తుంది. – సం.

వీక్షణం

# ప్రజల పట్ల శ్రద్ధలేని పాలకులు

తమను తాము ప్రజాస్వామిక అవతారాలమని, అత్యధిక వోట్లు తెచ్చుకున్న ప్రజాప్రతినిధులమని, తమ పనులకన్నిటికీ ప్రజామోదం ఉన్నట్టేనని చెప్పుకుంటున్న పాలకులకు ప్రజల పట్ల కనీస శ్రద్ధ లేదని రోజురోజూ రుజువవుతున్నది. ప్రత్యేకించి రాష్ట్రం సమస్యల సుడిగుండంలో నానాటికీ దిగజారిపోతుండగా, ఈ అగ్నిపర్వతం ఎప్పుడు పేలిపోతుందోననిపించే స్థితి ఉండగా పాలకులకు మాత్రం చీమకుట్టినట్టయినా లేదు. ఏ ఒక్క ప్రజాసమస్యనైనా పరిష్కరిద్దామనే ఆలోచనే పాలకుల దరిజేరడం లేదు. పాత సమస్యలను, ప్రజలు లేవనెత్తుతున్న సమస్యలను పరిష్కరించకపోవడం మాత్రమే కాదు, ప్రజలకు కొత్త సమస్యలను పాలకులే సృష్టిస్తున్నారు. మరొకవైపు ప్రజలకు ఎంతమాత్రం సంబంధంలేని పనికిమాలిన వ్యవహారాలలో, విలాసాలలో, పక్కదారి పట్టించే, ప్రజలకోసమేనని మభ్యపెట్టే కార్యక్రమాలలో మునిగి తేలుతున్నారు. ఇవాళ రాష్ట్రంలో ఏ ఒక్క ప్రాంతమూ ఏ ఒక్క ప్రజాసమూహమూ సమస్యలు లేని స్థితిలో లేదు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు గురించి సాగుతున్న ఆందోళన, అనిశ్చితి, ఆ ఉద్యమంలో పాల్గొంటున్న ప్రజలమీద నిర్బంధం ఏడాదిన్నరకు పైగా యథాతథంగా ఉన్నాయి. వర్షాకాలం ప్రారంభమైన మూడు వారాలుగా రాష్ట్ర వ్యాప్తంగా రైతాంగ సమస్యలు మొదలయ్యాయి. మరొకవారంలో విద్యాసంవత్సరం మొదలై విద్యార్థుల సమస్యలు మొదలయ్యాయి. విద్యార్థుల సమస్యలలో భాగంగానే వెనుకబడిన వర్గాల విద్యార్థుల ఉపకార వేతనాల, బోధనా ఫీజుల రియింబర్స్ మెంట్ సమస్యలు మొదలయ్యాయి. పుట్టపర్తి సత్యసాయిబాబా ప్రశాంతి నిలయంలో జరిగిన అశాంతి, అక్రమ కార్యకలాపాలు ఒక్కటొక్కటిగా బయటికి వస్తున్నాయి. సోంపేట థర్మల్ పవర్ ప్రాజెక్టుకు విలువైన బీల భూమి అప్పగిస్తూ జారీ అయిన ప్రభుత్వ ఉత్తర్వులు చెల్లవని రాష్ట్ర హైకోర్టు కొట్టివేసింది. స్థానిక స్వపరిపాలనా సంస్థల పదవీకాలం ముగిసిపోయి సంవత్సరం గడిచిపోయినా, మళ్లీ ఎన్నికలు జరిపితే గెలిచే ఆశలేని పాలకపార్టీ ఆ ఎన్నికలను ఎగ్గొట్టడానికి అనేక కుటిల యత్నాలు పన్నుతోంది. నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్నంటుతున్నాయనే మాట కూడ చిన్నదైపోయేంతగా పెరిగిపోతున్నాయి. ఈ నేపథ్యంలో సమావేశమైన రాష్ట్ర శాసనసభ ప్రజాసమస్యలను చర్చించలేదు సరిగదా, ఆ చర్చకు అవకాశం ఇచ్చే అవిశ్వాస తీర్మానాన్ని కూడ చేపట్టకుండా పదవుల పందేరంతో ముగిసిపోయింది. ఒక్కమాటలో చెప్పాలంటే రాష్ట్ర ప్రజానీకం యావత్తూ తక్షణ పరిష్కారం కోరుతూ డజన్లకొద్దీ చిన్నా పెద్దా సమస్యలు ముందుకు తెచ్చి వాటిపై ఏదో ఒక రూపంలో ఆందోళన చేస్తుండగా పాలకులు మాత్రం వాటిని పట్టించుకునే స్థితిలో లేరు. ఆ ఆందోళనలకు నాయకత్వం వహిస్తున్నామని చెప్పుకుంటున్న రాజకీయపక్షాలకు చిత్తశుద్ధి లేకపోవచ్చు. అవి నిజమైన ప్రజా నాయకత్వం కింద జరుగుతుండకపోవచ్చు. సంఘటిత నిర్మాణ రూపం ధరించలేక పోవచ్చు. ప్రస్తుతం తెలుగు సమాజానికి అలవాటయిపోయిన రాజకీయ, కుల, మత, ప్రాంత విభజనల కింద చీలిపోయి ఉండవచ్చు. కాని సమస్యల ఉనికి, అవి పరిష్కారం కావాలనే ప్రజల ఆకాంక్ష రెండూ కూడ "ఎందెందు వెదకి చూచిన అందందే" అన్నట్టు వాస్తవంగా ఉన్నాయి. కాని వినగల దానవాగ్రణి లేడు. ఈ సమస్యలేవీ పట్టని పాలకులు రాజకీయ పదవుల పంపకాలలో, ఆస్తి ఇబ్బడి ముబ్బడిగా పెంచుకోవడంలో, ప్రత్యర్థులను బుజ్జగించడంలో, బెదిరించడంలో, ఆత్మస్తుతి – పరనిందలలో కాలం గడుపుతున్నారు. ప్రతి ప్రజాస్వామిక ఆకాంక్షనూ శాంతి భద్రతల సమస్యగా చూసి, చూపి దమనకాండను అమలు చేయడం, ఆ ప్రజాస్వామిక ఆకాంక్షను వ్యక్తం చేసే వారికి ఒక గడ్డిబొమ్మ ప్రతినిధిని తయారుచేసి, ఆ ప్రతినిధికి పదవుల ఎరచూపి కొనివేయడం, ఒక సమస్యను మించి మరొక సమస్యను సృష్టించి ప్రజల దృష్టి మళ్లించడం ఈ దేశ పాలకులకు అలవాటయిన విద్యలు. రాష్ట్రంలో వర్షాలు మొదలై, దుక్కులు కూడ ప్రారంభమైన తర్వాత కూడ ప్రభుత్వం వైపు నుంచి విత్తనాల సరఫరా క్రమబద్ధం కాలేదు. మృగశిరకు ముందే తగిన ఏర్పాట్లు, ముందుజాగ్రత్త చర్యలు తీసుకుని, విత్తన వ్యాపారుల అక్రమ నిలువల మీద, అధికధరల మీద నిఘా పెట్టవలసిన ప్రభుత్వాధికారులు, ప్రభుత్వ అధీనంలోని విత్తన డిపోలలో తగిన మోతాదులో విత్తనాలు నిలువ ఉంచవలసిన ప్రభుత్వాధికారులు మొత్తం ప్రైవేటు వ్యాపారస్తులకు దళారులుగా మారిపోయారు. చాల చోట్ల అవసరమైన విత్తనాల పరిమాణంలో పావు వంతు కూడ అందుబాటులో లేక, లాటరీ చీట్లు తీసి రైతులకు విత్తనాలు ఇచ్చారంటే పరిస్థితి ఎంత తీవ్రంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. గిరాకీ గురించి ప్రభుత్వానికి తగిన సమాచారం లేకపోవడం, అందువల్ల సరఫరా కాస్త తక్కువ పడడం ఎప్పుడైనా జరగవచ్చు. కాని ఈ సారి జరిగినది మాత్రం తలకిందులు. ఎక్కడా అవసరమైనదానిలో పావు వంతు కన్న ఎక్కువ ప్రభుత్వం సరఫరా చేయలేకపోయింది, ప్రైవేటు వ్యాపారులు చేసేలా నియంత్రించ లేకపోయింది. విత్తనాల కోసం రైతులు గంటలకొద్దీ బారులు తీరి పడిగాపులు పడడం, లాటరీలు, విత్తనాలు అందలేదని నిరసన వ్యక్తం చేసిన రైతుల మీద లాఠీచార్జిలు, ఘర్షణలు, రాజకీయ ఆశ్రితులకే సహాయం అందుతున్నదనే ఆరోపణలు, మంత్రుల ఘెరావ్ లు, చివరికి రైతులు ఈ సంవత్సరం పంటలు పండించబోమని, క్రాప్ హాలిడే ప్రకటించడం మన పాలకుల అలసత్వానికి, నిర్లక్ష్యానికి, ప్రజలతో సంబంధం లేకపోవడానికి అద్దంపడుతున్నాయి. సరిగ్గా రైతులకు విత్తనాల విషయంలో జరిగినట్టే పాఠశాల విద్యార్థుల పుస్తకాల విషయంలో జరిగింది. అది సమసిపోకముందే వెనుకబడిన వర్గాల విద్యార్థులకు ఆర్థిక సహాయం విషయంలో ప్రభుత్వం కొత్త సమస్యలు సృష్టించడం మొదలుపెట్టింది. ఇంకొకవైపు పుట్టపర్తి ఆశ్రమంలో తవ్వినకొద్దీ అక్రమాలు బయటపడుతుంటే, కనీస చట్టబద్ధమైన చర్యలు తీసుకోవడానికి కూడ ప్రభుత్వం సిద్ధపడడం లేదు. ఈ లోగా భూములను సంపన్నవర్గాలకు కట్టబెట్టడంలో ఎపిఐఐసి అవకతవకలు బయటపడుతూనే ఉన్నాయి. సోంపేట భూముల గురించి ప్రభుత్వ ఉత్తర్వును హైకోర్టు తప్పుపట్టింది. ఇన్ని సమస్యలు ఉండగా, వీటిని పరిష్కరించడానికి ఇసుమంత ప్రయత్నమయినా చేయని ప్రభుత్వం తెలంగాణను బుజ్జగించడానికి ఒక తెలంగాణ వ్యక్తికి ఉపముఖ్యమంత్రి పదవి, ఒక సామాజిక వర్గాన్ని ఆకట్టుకోవడానికి ఆ వర్గానికి చెందిన వ్యక్తికి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవి లాంటి తూతూ మంత్రపు చర్యలతో ఆయా ప్రాంతాల, వర్గాల అసంతృప్తులను చల్లార్చగలనని కలలు కంటున్నది. పాలకులు ప్రజలకు ఇంతగా దూరమైతే అంతిమ పర్యవసానం ఎంత విస్ఫోటకంగా ఉంటుందో చరిత్ర ఎన్నోసార్లు చెప్పింది. ఇవాళ కాకపోతే రేపయినా మననేలమీద ఆ చరిత్ర పునరావృతం కాకతప్పదు. వీ

## అసలు సమస్యలను మసకబార్చే 'అవినీతి వ్యతిరేకత'

'ద్వంద్వాలుగా కనబడేవన్నీ, ద్వంద్వాలుగా చూపబడేవన్నీ ద్వంద్వాలు కావు. ఎదురెదురుగా ఉన్నట్టు, తీవ్రమైన ఘర్షణ పడుతున్నట్టు కనబడుతున్నవన్నీ నిజంగా ప్రత్యర్థి శక్తులు కావు. పాలకవర్గ ముఠాల మధ్య కూడ తమ స్వార్థ ప్రయోజనాల కోసం భీకరమైన ఘర్షణలే జరుగుతాయి. అన్నా హజారే – కపిల్ సిబాల్, బాబా రాందేవ్ – ప్రభుత్వం, యుపిఎ – బిజెపి, అవినీతి – అవినీతి రాహిత్యం అనే ద్వంద్వాలను ఇవాళ పాలకవర్గాలలోని వివిధ ముఠాలు, ఆ ముఠాలకు ప్రాతినిధ్యం వహించే ప్రచారసాధనాలు నిజంగా ఎదురుబొదురుగా నిలబడిన ద్వంద్వాలన్నట్టుగా ప్రచారం చేస్తున్నాయి. ఆయా వ్యక్తులలో ఎవరో ఒకరు నిజాయితీపరులు కూడ కావచ్చు. తాము నమ్మిన విశ్వాసానికి తగినట్టు పనిచేస్తుండవచ్చు. కాని ఇది వ్యక్తుల సమస్య కాదు. ఒక చారిత్రక ఘట్టంలో ఒకే పాలకవర్గంలోని వివిధ ముఠాల ప్రయోజనాల మధ్య బయటపడుతున్న ఘర్షణ కొందరు వ్యక్తుల, కొన్ని నినాదాల రూపం తీసుకుంటున్నది. ఆ ఘట్టమే అదా ఇదా, అటుంటావా ఇటుంటావా అని ఒక కుహనా సవాల్ విసురుతున్నది. ఇద్దరూ దొంగలే అయినచోట ఒక దొంగ పక్షం వహించకతప్పని నిర్బంధ స్వేచ్ఛను ప్రజలకు ఇస్తున్నది. ఈ కనబడే నాటకమంతా నిజమని భ్రమపడే మధ్య తరగతి ఈ ద్వంద్వాల్లో ఒకదానికి, తాము సరైనదనుకునేదానికి మద్దతు ఇస్తూ వీధుల్లోకి వస్తోంది. రూపానికీ సారానికీ తేడా లేకపోతే శాస్త్రం అవసరమే ఉండదన్నాడు మార్క్స్. ఇవాళ దేశంలో ఘర్షణ రూపంలో సాగుతున్న ఈ ప్రహసనపు సారాంశాన్ని అర్థం చేసుకోవలసి ఉంది. అన్నా హజారే నుంచి బాబా రాందేవ్ దాకా, భారతీయ జనతా పార్టీ నుంచి లోక్ సత్తా దాకా ఇవాళ అవినీతి గురించి మాట్లాడుతున్న వారెవరూ రోగలక్షణం గురించే మాట్లాడుతున్నారు తప్ప రోగం గురించీ, రోగ కారణాల గురించీ మాట్లాడడం లేదు. రోగలక్షణాలను తొలగించే పని ఎంత నిజాయితీగా జరిగినా రోగం లేకుండాపోదు. ఈ వ్యవస్థ ఇప్పుడున్న స్థితిలో కొనసాగడమే అవినీతికి మూలం. ఈ పాలనను, ఈ రాజ్యాంగ వ్యవస్థను, ఇవాళ్టి రాజకీయార్థిక, సామాజిక, సాంస్కృతిక ధర్మాన్ని కూలదోయకుండా, ఇవి ఇలాగే ఉంచి, అవినీతిని రద్దు చేస్తామని అనడం తెలిసి చేసినా తెలియక చేసినా అర్థరహితం. అవినీతి మహమ్మారి లాగ విస్తరించింది గనుక, ప్రతి జీవన రంగాన్నీ అతలాకుతలం చేస్తున్నది గనుక, అవినీతిని నిర్మూలించాలి అనే నినాదానికి ప్రజల నుంచి మద్దతు వచ్చే మాట నిజమే. ఆ మద్దతు ఒకరకంగా యథాస్థితి పట్ల ప్రజల వ్యతిరేకతకు చిహ్నం. ఆ వ్యతిరేకతను సరైన దారిలో నడిపించాలంటే అవినీతి మూలాలను వివరించి, నిర్మూలన ఎలా సాధ్యమో చెప్పాలి. అవినీతిని నిర్మూలించాలంటే వ్యవస్థను మార్చాల్సి ఉంటుందనే అవగాహన ఇవ్వాలి. కాని ఇవాళ ఈ 'అవినీతి నిర్మూలన' ఉద్యమాన్ని నడుపుతున్నవి పాలకవర్గ ముఠాలే గనుక ఆ మౌలిక అంశాల జోలికి పోకుండా ప్రజల అసంతృప్తిని చల్లార్చడానికి ప్రయత్నిస్తున్నాయి. చట్టంలో మార్పులు తెస్తే, నిజాయితీపరులైన అధికారులు ఉంటే, చట్టాలను సరిగా అమలు చేస్తే అవినీతి రద్దయిపోతుందనే భ్రమలు కలిగిస్తున్నాయి. నిజమైన పరిష్కారాలవైపు, అర్థవంతమైన ప్రత్యామ్నాయాలవైపు ప్రజలు వెళ్లకుండా అడ్డుకోవడాన్ని మించి ఈ ఆందోళనలు సాధించగలిగినదేమీ లేదు. పాలకవర్గాలలోని ప్రతిపక్ష ముఠాలు ఈ నాటకం ఆడుతుండగా, పాలకముఠా ఈ మాత్రం నటన కూడ అవసరం లేదనే మొరటుతనాన్ని ప్రదర్శిస్తున్నది. ఇప్పటిదాకా మౌనంగానో, స్వల్పస్థాయి ఆందోళనతోనో కూచున్న ప్రేక్షకులు లేచి నిలిచి రంగస్థలం మీదికి దండయాత్ర జరిపేదాకా ఈ నాటకాలు సాగుతూనే ఉంటాయి. వీ

## ఎప్పటికైనా రాజపక్షను శిక్షిస్తారా?

శ్రీలంకలో స్వతంత్ర ఈలం స్థాపించుకోవాలనే తమిళ జాతి ఆకాంక్ష సాయుధపోరాట రూపం తీసుకుని ప్రపంచం దృష్టిని ఆకర్షించి ఇరవై సంవత్సరాలు నిరాఘాటంగా కొనసాగి, అతి భయంకరమైన అణచివేతకు గురై ఓడిపోయి రెండు సంవత్సరాలయింది. 2009 మేలో శ్రీలంక ప్రభుత్వం, భారత ప్రభుత్వ సహాయంతో అతి దుర్మార్గమైన దాడులు జరిపి అత్యంత కిరాతకంగా వేలాది మంది ఎల్ టి టి ఇ సైనికులను, సాధారణ తమిళ ప్రజలను చంపివేసింది. హతుల సంఖ్య నలభై వేల నుంచి లక్ష దాకా ఉండవచ్చని అంచనా. శ్రీలంక సైనికులు వేలాది మంది స్త్రీలపై అత్యాచారాలు చేశారు. పిల్లలను ఊచకోత కోశారు. లిబరేషన్ టైగర్స్‌తో ఏ సంబంధమూ లేనివారిని, చివరికి శరణార్థి శిబిరాలలో చేరినవారిని కూడ తమిళులైతే చాలు అన్నట్టుగా జాతిహననకాండ జరిపారు. ఆఖరి యుద్ధం జరిగిన ముల్లైతీవు ప్రాంతంలో ప్రభుత్వమే 'కాల్పులు జరపని ప్రాంతం' అని కొన్ని ప్రాంతాలను నిర్దేశించి, సాధారణ ప్రజానీకాన్ని అక్కడ సమీకరించి వారిని ఊచకోత కోశారని బయటపడింది. అంతర్జాతీయ రెడ్ క్రాస్ సహాయంతో యుద్ధ ప్రాంతంలో ఆస్పత్రులు ఏర్పాటు చేసి, వాటి మీద బాంబులు వేయకుండా ఉండడానికి పైకప్పుల మీద కనబడేట్టుగా రెడ్ క్రాస్ చిత్రించాలని ఆదేశం ఇచ్చి, ఆ గుర్తు ఉన్న భవనాల మీదనే బాంబుదాడులు జరిపారు. తాజాగా బిబిసి ఛానల్ 4 లో ప్రదర్శించిన 'శ్రీలంకాస్ కిల్లింగ్ ఫీల్డ్స్' లో లిబరేషన్ టైగర్లను నగ్నంగా చేసి ఎదురుగా నిలబెట్టి ఎలా కాల్చిచంపారో, లిబరేషన్ టైగర్స్ కు చెందిన మహిళల మీద ఎలా అత్యాచారాలు జరిపారో దారుణమైన వీడియోలు బయటపడ్డాయి. ఈ దుర్మార్గానికి భారత ప్రభుత్వం ఆర్థిక, సైనిక, ఆయుధ, నైతిక సహకారం అందించగా, సభ్యసమాజం అనబడేది మౌనసాక్షిలా నిలిచిపోయింది. ఐక్యరాజ్యసమితి, ప్రపంచంలో మానవతను, ప్రజాస్వామ్యాన్ని కాపాడడానికే తాము కంకణం కట్టుకున్నామని బూటకపు ప్రవచనాలతో ఇరాక్, అఫ్ఘనిస్తాన్‌లలో నరమేధం సాగించిన అమెరికన్, యూరపియన్ ప్రభుత్వాలు రాజపక్ష రక్తపిపాసపై పల్లెత్తుమాట అనలేదు. రెండు సంవత్సరాలుగా ప్రగతిశీల మేధావులు, తమిళ శరణార్థులు సాగించిన ప్రయత్నాల ఫలితంగా చిట్టచివరికి ఐక్యరాజ్యసమితి నియమించిన పరిశీలక బృందం శ్రీలంక ప్రభుత్వపు దుర్మార్గాల చిట్టాను బయటపెట్టింది. ఏప్రిల్‌లో ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శికి అందిన ఈ నివేదిక శ్రీలంక ప్రభుత్వం సాగించిన ఐదు దుర్మార్గాలను స్పష్టంగా ప్రకటించింది. కాల్పులు జరగగూడని ప్రాంతాలలో సాధారణ పౌరుల మీద జరిగిన కాల్పులు; ఆస్పత్రులమీద, మానవ ఆవాసాల మీద బాంబు దాడులు; ఆహారం, ఔషధాలు వంటి మానవతా సహాయం అందకుండా అడ్డుకోవడం; శరణార్థులమీద, టైగర్ల మీద యుద్ధానంతరం జరుగుతున్న కక్ష సాధింపు, మానవహక్కుల ఉల్లంఘనలు; మొత్తంగా దేశంలోనే ప్రచార సాధనాల మీద, విమర్శకుల మీద జరుగుతున్న దాడులు. ఈ నివేదిక ఎల్ టి టి ఇ మీద కొన్ని విమర్శలు చేసింది గాని ఇప్పుడు అవి అప్రస్తుతం. ఈ నివేదిక వెలువడి రెండు నెలలు గడిచినా, ప్రపంచ దేశాలలో ఏఒక్కటీ ఈ నివేదిక ఆధారంగా శ్రీలంక ప్రభుత్వం మీద చర్య తీసుకోవాలని కోరలేదు. కనీసం ఆ నివేదికలో సూచించినట్టు అంతర్జాతీయ న్యాయవిచారణ జరపడానికి ప్రయత్నించడం లేదు. మన కళ్ల ముందర ఒక జాతి స్వయం నిర్ణయాధికార ఆకాంక్షను ఇంత బీభత్సంగా, దుర్మార్గంగా చిదిమివేస్తే మాట్లాడకుండా, ప్రశ్నించకుండా, ప్రతిఘటించకుండా కూచున్న మహాఘనత వహించిన ప్రజాస్వామిక ప్రభుత్వాలను ఏమనాలి? ఇరవయ్యొకటో శతాబ్దపు హిట్లర్ గా తనను తాను రుజువు చేసుకున్న మహింద రాజపక్ష యుద్ధ నేరాలకు ఎప్పటికైనా శిక్ష పడుతుందా? వీ







- **కులాంకలీ** – కులం మూలం – మూల్యం – డా. ఎం.ఎఫ్. గోపీనాథ్ ఎం.డి., డి.ఎం., ఇంటర్వెన్షనల్ కార్డియాలజిస్ట్; డా. పి. రాధారుక్మిణి ఎం.ఎ., ఎం.ఫిల్. – ఫూలే-అంబేద్కర్ నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్ ప్రచురణ – 180 పేజీలు, 1/8 డెమీ, రు : 90, ప్రతులకు: రచయితలు స్పందన హాస్పిటల్స్, వైరా రోడ్, ఖమ్మం; ప్రముఖ పుస్తక షాపుల్లో
- **సాయుధ పోరులో సుంకిశాల** – గుర్రం బుచ్చిరెడ్డి – 128 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు: గుర్రం బుచ్చిరెడ్డి, ఇ.నెం. 3-10-26/35/3, ఆర్.టి.సి. కాలనీ, రామంతాపూర్, హైదరాబాద్ – 500 013; ప్రముఖ పుస్తక షాపుల్లో
- **ఛత్తీస్‌ఘడ్‌లో ఏమి జరుగుతోంది?** – ఛత్తీస్‌ఘడ్‌లో జరుగుతున్న మారణహోమంపై ఒక నివేదిక – ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (ఎపిసిఎల్‌సి) ప్రచురణ – 64 పేజీలు, 1/8 డెమీ, రు. 20
- **విధ్వంసకర అభివృద్ధిని వ్యతిరేకిద్దాం! జీవనోపాధిని – జీవించే హక్కును కాపాడుకుందాం!** – ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం (ఎపిసిఎల్‌సి) ప్రచురణ – 66 పేజీలు, 1/8 డెమీ, రు. 10

పై రెండు ప్రతులకు : ప్రొ. ఎస్. శేషయ్య, ప్లాట్ నెం. 49, విద్యుత్‌నగర్, అనంతపురం

- **ఎడారి మంటలు** – రెక్కవిప్పిన జాస్మిన్ రెవల్యూషన్స్ – సంపాదకులు: జూలూరు గౌరీశంకర్ – రామయ్య విద్యాపీఠం ప్రచురణ – 260 పేజీలు, 1/8 డెమీ, రు : 150
- **8వ అబద్ధం** – శ్రీకృష్ణ లీలలు – సంపాదకులు: జూలూరు గౌరీశంకర్ – తెలంగాణ రచయితల వేదిక – 158 పేజీలు, 1/8 డెమీ, రు. 80

పై రెండు ప్రతులకు: జూలూరు గౌరీశంకర్, ఇ.నెం. 1-8-702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో

- **ఫర్ ఎ బెటర్ స్టేట్** – సిర్గాపూర్ విద్యాసాగర్ రెడ్డి – 138 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : నవోదయ బుక్ హౌస్, 3-3-865, ఆర్యసమాజ్ గుడి ఎదురుగా, కాచిగూడ, హైదరాబాద్ – 500 027; ఫోన్ : 24652387
- **మహమ్మారి మద్యం** – రాజకీయాల అవినీతితో చెట్ట పట్టాల్ – సంకలనం: గడ్డిపాటి కోటేశ్వరరావు – నవయుగ ప్రచురణలు – 134 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు : నవయుగ ప్రచురణలు, గడ్డిపాటి కళ్యాణ మండపం, రైల్వే ఓవర్ బ్రిడ్జి దగ్గర, మంగళగిరి రోడ్డు, గుంటూరు; ప్రజాశక్తి బుక్‌హౌస్, ఇతర ప్రధాన పుస్తక విక్రేతలు
- **యుగకవి శ్రీశ్రీ** – టి.ఎల్. కాంతారావు – శ్రీశ్రీ సాహిత్య నిధి, 55 పేజీలు, 1/8 డెమీ, రు.30
- **స్వేచ్ఛా విహంగం శ్రీశ్రీ** – కె.వి. రమణారెడ్డి – శ్రీశ్రీ సాహిత్య నిధి, 40 పేజీలు, 1/8 డెమీ, రు.20

పై రెండు ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య స్ట్రీట్, మారుతినగర్, విజయవాడ – 520004; ఫోన్ : 0866-6617375, ఫ్యాక్స్ : 0866-6697375, సెల్ : 9848504649, 9246277375; ఇ-మెయిల్ : srisri_sahityanidhi@yahoo.com











## పదవ తరగతి ఫలితాలు

మే 21న రాష్ట్ర మాధ్యమిక విద్యాశాఖ మంత్రి కె. పార్థసారథి పదో తరగతి పరీక్షా ఫలితాలను వెల్లడించారు. మొత్తం హాజరయిన విద్యార్థుల్లో 83.1 శాతం విద్యార్థులు ఉత్తీర్ణులయ్యారు. వారిలో బాలురు 82.71 శాతం, బాలికలు 83.51 శాతం ఉత్తీర్ణులయ్యారు. రాష్ట్ర వ్యాప్తంగా మొత్తం 12,87,211 మంది విద్యార్థులు పరీక్షలకు హాజరయ్యారు. వీరిలో 10,49,695 మంది రెగ్యులర్, 2,37,516 మంది ప్రైవేట్ విద్యార్థులున్నారు.

## వికలాంగుల రిజర్వేషన్లు మరో పదేళ్లు

రాష్ట్రంలో వికలాంగులకు అమలవుతున్న రిజర్వేషన్లను మరో పదేళ్లు పొడిగించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఉద్యోగాలకు వికలాంగులకు ఉన్న వయోపరిమితి సడలింపు కూడా కొనసాగుతుంది. ఈ రిజర్వేషన్లు 31 మే 2021 వరకు అమలవుతాయి.

## సింగరేణి కార్మికుల సమ్మె

సింగరేణి కాలరీస్‌లో తొలగించిన కార్మికులను వెంటనే విధుల్లోకి తీసుకోవాలని డిమాండ్ చేస్తూ తెలంగాణ ప్రజా ఫ్రంట్, సింగరేణి డిస్మిస్డ్ కార్మికుల సంఘంల ఆధ్వర్యంలో ఇందిరాపార్క్ దగ్గర 24 మే 2011న మహాధర్నా జరిగింది. వారికి సంఘీభావంగా వివిధ సంఘాల నాయకులు ధర్నాలో పాల్గొని కార్మికులంతా ఐక్యంగా ఉద్యమించాలని పిలుపునిచ్చారు.

## పత్తి విత్తనాలు ఏవీ?

రాష్ట్రాన్ని బీటీ పత్తి విత్తనాల సంక్షోభం వెంటాడుతూనే ఉంది. విత్తన కంపెనీల ఒత్తిడికి తలొగ్గి రాష్ట్ర ప్రభుత్వం బీటీ విత్తనాల ధర పెంచి పది రోజులయినా కంపెనీలు మాత్రం అవసరమైనన్ని విత్తనాలు మార్కెట్‌లోకి విడుదల చేయడం లేదు. విత్తనాలు లభ్యం కాకపోవడంతో రైతుల్లో తీవ్ర ఆందోళన వ్యక్తమవుతోంది. విత్తనాలు సరిపడా దొరక్క రైతులు బ్లాక్ మార్కెట్లో ప్యాకెట్ విత్తనాలు రు. 1200 దాకా చెల్లించి కొనుక్కోవాల్సి వస్తోంది.

## శాసన సభాపతుల ఎన్నిక

2005 నుండి ప్యానల్ స్పీకర్‌గా కొనసాగిన నాదెండ్ల మనోహర్ (కాంగ్రెస్ పార్టీ) జూన్ 4న శాసన సభాపతిగా ఎన్నికయ్యారు. డిప్యూటి స్పీకర్‌గా మల్లు భట్టి విక్రమార్క, మండలి చైర్మన్‌గా చక్రపాణి, డిప్యూటీ చైర్మన్‌గా నేతి విద్యాసాగర్‌లు ఎన్నికయ్యారు. స్పీకర్‌కు జరిగిన ఓటింగ్‌లో మనోహర్‌కు అనుకూలంగా 158, డిప్యూటి స్పీకర్‌కు అనుకూలంగా 164 వచ్చిన ఓట్లతో ఎన్నికయ్యారు. పిసిసి అధ్యక్షుడిగా విజయనగరం జిల్లాకు చెందిన బొత్స సత్యనారాయణను కాంగ్రెస్ అధిష్ఠానం నియమించింది.

## గురవా రెడ్డి ఇకలేరు

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట నాయకుడు, మాజీ ఎం.ఎల్.ఎ. ఎ. గురవారెడ్డి (99) అనారోగ్యంతో జూన్ 13న నిమ్స్ ఆస్పత్రిలో మరణించారు. మెదక్ జిల్లా చిన్నకోదూరు మండలం రామంచ గ్రామానికి చెందిన ఎ. గురువారెడ్డి 1952-57 మధ్య సి.పి.ఐ. పార్టీ తరఫున సిద్ధిపేట శాసనసభ్యులుగా, 1958లో ఎం.ఎల్.సి.గా ఎన్నికయ్యారు. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో పలు మార్లు జైలు నిర్బంధాన్ని అనుభవించారు. స్వాతంత్ర్య సమరయోధులుగా తనకు వచ్చే పెన్షన్‌ను సిద్ధిపేట ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఉత్తమ ప్రతిభ కనబరిచిన విద్యార్థులకు స్కాలర్‌షిప్‌గా ఇచ్చేవారు.

## మనుషులపై ఔషధ ప్రయోగాలు

కొత్తగా తయారు చేసే మందుల పనితనాన్ని తెలుసుకునేందుకు ముందుగా ప్రయోగశాలలో గినియా పిగ్స్, ఎలుకల మీద ప్రయోగిస్తారు. ఇది ప్రపంచ వ్యాప్తంగా ప్రక్రియ. కానీ మన రాష్ట్రంలోని ఫార్మా కంపెనీలు ప్రయోగాల కోసం మనుషులనే లక్ష్యం చేసుకున్నాయి. గుంటూరు జిల్లా పిడుగురాళ్ల కేంద్రంగా ఫార్మా కంపెనీలు ఈ పనికి పూనుకున్నాయి. హైదరాబాదుకు చెందిన కొన్ని ఫార్మా కంపెనీలు గుంటూరులోని పేదలపై కన్నేసి తాము తయారు చేసిన మందులను మింగితే వేల కొద్ది డబ్బులిస్తామని వాటి వల్ల ఎటువంటి హాని కలుగదని బ్రోకర్లతో ప్రచారం చేయించారు. ఈ ప్రయోగాల క్రమంలో బాధితులు తీవ్ర అనారోగ్యానికి లోను కావడంతో విషయాలు బయటికి వచ్చాయి.

## పోలవరం వ్యతిరేక పోరు

పోలవరం ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఢిల్లీలో ఉద్యమం నిర్మించాలని 'పోలవరం ప్రాజెక్టు వ్యతిరేక వేదిక' నిర్ణయించింది. జూన్ 15న వేదిక ఆధ్వర్యంలో సుందరయ్య భవన్‌లో రౌండ్‌టేబుల్ సమావేశం జరిగింది. వేదిక కన్వీనర్ పట్టం నారాయణ దొర, కో కన్వీనర్ కణితి లక్ష్మణ్ రావుల ఆధ్వర్యంలో ఈ సమావేశం జరిగింది. వివిధ ప్రజా సంఘాల నాయకులు పాల్గొన్నారు. ప్రాజెక్టు నిర్మాణంలో అటవీ, 1/70, పర్యావరణ చట్టాలతో పాటు రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్‌ను ఉల్లంఘించారని సమావేశం విమర్శించింది.

## వర్గీకరణకోసం పాదయాత్రలు

కాంగ్రెస్ పార్టీ ఎస్.సి వర్గీకరణ అంశాన్ని తమ ఎన్నికల మెనిఫెస్టోలో పెట్టిందని, మాదిగ ఎం.పిలు ఈ విషయం పై ప్రభుత్వం పై ఒత్తిడి తెచ్చి వర్షాకాల సమావేశాల్లో పార్లమెంట్‌లో వర్గీకరణ బిల్లు పెట్టాలని అలా జరగని పక్షంలో వర్గీకరణ కోసమే రాజీనామ చేయాలని మంద కృష్ణ మాదిగ అన్నారు. రాజీనామాలు తెలంగాణ కోసం వద్దన్నారు. జూన్ 15న మహబూబ్‌నగర్ జిల్లా హన్వాడ మండలం చిన్న దర్పల్లిలో అంబేద్కర్ విగ్రహావిష్కరణ సందర్భంలో అన్నారు. జూలై 1న నుంచి 20 వరకు రాష్ట్ర వ్యాప్తంగా అన్ని గ్రామాలలో పాదయాత్ర నిర్వహించి మాదిగలను చైతన్యం చేస్తామని ప్రకటించారు.

## తెలంగాణ కోసం వంటా వార్పు!

ప్రత్యేక తెలంగాణ సెగ కేంద్ర ప్రభుత్వానికి తాకాలంటూ రాజకీయ జెఎసి పిలుపు మేరకు జూన్ 19న హైదరాబాద్‌లో జరిగిన 'పట్నం రోడ్లపై పొయ్యి పెడదాం' కార్యక్రమం విజయవంతమైంది. పెద్ద ఎత్తున వివిధ పార్టీల నాయకులు, ప్రజా సంఘాల నాయకులు, కార్యకర్తలు, విద్యార్థులు, వివిధ వర్గాల ప్రజలు రోడ్లపైకి వచ్చి వంటా వార్పులో కార్యక్రమంలో పెద్ద ఎత్తున పాల్గొన్నారు. వీ

*ఆర్. ఎస్. రావు ఆలోచనలను భావి తరాలకు అందించడం, ఆ దిశగా ఆచరణను కొనసాగించడం ఆయనకు ఇవ్వగలిగే నిజమైన నివాళి అంటున్నారు* **వై. రామచంద్రం**

# మనిషి కేంద్రంగా ఆలోచించిన మనిషి

**ఆర్.** ఎస్. రావు గురించి గతంలో విని, చదివి ఉన్నాను కాని 2005 నుండి సిడిఆర్‌సి, వీక్షణంలో పనిచేసే క్రమంలో దగ్గరగా తెలుసుకునే అవకాశం ఏర్పడింది. తెలుగు సమాజంలోని మేధావులలో అరుదైన మార్క్సిస్టు ఆలోచనాపరుడు. నిత్యం ఆలోచిస్తూ, ఆలోచింపజేసేవారు. ఆర్ ఎస్ రావు మరణం సమాజ మార్పు కోరే ఆలోచనా పరులకు లోటుగా చెప్పవచ్చు. నేను ఈ నాలుగు విషయాలు రాసే ప్రయత్నం చేస్తున్నానంటె దీని వెనుక ఆర్.ఎస్. రావు కృషి కూడా ఉంది. ప్రతి మనిషి చదవగలడు, రాయగలడు, మాట్లాడగలడు అనే ధైర్యాన్ని ఇచ్చి ప్రోత్సహించారు. ఎదుటి వ్యక్తి చైతన్య స్థాయికి దిగి చర్చించేవారు.

ప్రభుత్వాలు తెస్తున్న ప్రాజెక్టులు, పథకాలు ప్రజల జీవితాల్లో ఎటువంటి మార్పును తెచ్చాయో, తెస్తున్నాయో, తేబోతున్నాయో అనే విషయాలపై ఆర్ ఎస్. రావు ఉపన్యాసాలు, వ్యాసాలు, చర్చల ద్వారా చేసిన కృషి అంతటిలో మనిషిని, మనిషి శ్రమను కేంద్రంగా చేసుకొని సాగిన విధానం ఉంది. మన సమాజాన్ని అర్ధ వలస అర్ధ భూస్వామ్య సమాజంగా అటు ప్రత్యామ్నాయ ఉద్యమాలు, ఇటు కొద్ది మంది మేధావులు విశ్లేషించారు. ఆ మేధావుల్లో ఆర్ ఎస్. రావు ఒకరు.

అభివృద్ధి పేరుతో వచ్చిన ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులయిన ప్రజలు ఎలా జీవిస్తున్నారు. ప్రాజెక్టుల వల్ల వాళ్లకు ఏమైనా మేలు జరిగిందా? ఈ మార్పుల గురించి నిర్వాసితులైన ప్రజలు ఏమనుకుంటున్నారు అనే విషయాలను ప్రత్యక్షంగా వెళ్లి పరిశీలించారు. అందుకు ఒరిస్సాలో నిర్మించిన హిరాకుడ్ డ్యాం నిర్మాణం వల్ల నిర్వాసితులైన ప్రజల గురించి తెలుసుకొని వారి జీవితాలను 'అభివృద్ధి వెలుగు నీడలు' అనే పుస్తకంలో వివరించారు. విశాఖలో వచ్చిన స్టీల్ ప్లాంట్ వల్ల తొలగించ బడిన ప్రజలు కావచ్చు, దేశ వ్యాప్తంగా పుట్టగొడుగుల్లా వస్తున్న సెజ్‌లు, థర్మల్ విద్యుత్, అణువిద్యుత్ ప్లాంట్ల బాధితులు కావచ్చు. అభివృద్ధి పేరుతో వస్తున్నవన్నీ కూడా స్థానిక ప్రజల ప్రమేయంతో వస్తున్నాయా? వాళ్లను కలుపుకొని సాగుతున్నయా? లేదా ఇతర దేశాల అవసరాల కోసం, ఇతర దేశాల సాంకేతిక పరిజ్ఞానంతో వస్తున్నయా? వీటంతటిలో స్థానికంగా ఉండే మనిషికి ఏం జరిగింది అనే విషయాన్ని కేంద్రంగా చేసుకొని ఆలోచించారు. అంతిమంగా అది స్థానిక ప్రజల ప్రమేయంతో జరగాలని, దాని ఫలితాలు స్థానిక ప్రజలకు చేరాలని అలా సాగనంత కాలం ఇతర దేశాల ప్రయోజనాలకోసం అట్టడుగు వర్గాల కాలికింద నేలను తాకే హక్కు లేదని అన్నారు. ప్రకృతి వనరులను పరిరక్షిస్తూ ప్రకృతి ఒడిలో జీవిస్తున్న ఆదివాసులను అడవి నుంచి దూరం చేయడానికి సాగుతున్న ప్రయత్నాలను ఖండిస్తూ మాట్లాడారు, రాసారు. సమాజమంతా మనిషి కేంద్రంగా చేసుకొని మనిషిని కాపాడుకునే వైపు, మనిషికి అర్థవంతమైన జీవితాన్ని కల్పించే వైపు ఆలోచించాలని కోరుకున్నారు.

దేశంలోకి వస్తున్న పెట్టుబడులు, దేశ ప్రజల నుండి కొల్లగొట్టిన మిగులు అంతా సేవా రంగంలోనే వెచ్చిస్తున్నారు. సేవా రంగంలో మౌలిక ఉత్పత్తి అనేది జరగదని, ఇది ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పుకు దోహదం చేయదన్నారు. దీనికి భవిష్యత్తు లేదని మనది వ్యవసాయిక దేశం కాబట్టి వ్యవసాయ ఆధారిత పరిశ్రమలు స్థాపించాలన్నారు. మన దేశానికి పెట్టుబడి వచ్చింది కాని పెట్టుబడిదారీ విధానం రాలేదని సూత్రీకరించారు. ఇలా ఎన్నో రకాల సూత్రీకరణలు చేశారు. జీవితమంతా మార్క్సిస్టు సైద్ధాంతిక అవగాహనతో సమాజ మార్పు కోరుతూ ఆలోచనా రంగంలో విస్తృతమైన కృషిచేశారు. ఆర్ ఎస్ రావును అర్థం చేసుకోవాలంటే ఆయన రచనలు చదవడంవల్ల కొంత మేరకు సాధ్యమవుతుంది.

గ్రామాల్లో ప్రజల జీవన స్థితిగతులు ఎలా ఉన్నాయి. ప్రభుత్వాలు ప్రవేశపెడుతున్న పథకాలు ప్రజల జీవితాల్లో ఎటువంటి ప్రభావాన్ని చూపుతున్నాయి అనే విషయాల గురించి పత్రికలమీద ఆధారపడకుండా గ్రామాలకు వెళ్లి పరిశీలన చేయాలని చెప్పారు. ప్రజల జీవితాన్ని దగ్గర నుండి చూడాలనే ఉద్దేశ్యంతో ముదునూరి భారతి, ఆర్ ఎస్. రావు గార్లు కలిసి ఇటువంటి పరిశోధనలు చేసి వాటిని అక్షరీకరించి సమాజానికి అందించారు. ఆర్ ఎస్ రావు ఆలోచనలను అక్షర బద్ధం చేయడంలో భారతిగారి శ్రమ ఉంది. అటు సామాన్య ప్రజల వైపునుంచి భారతిగారు లేవనెత్తే ప్రశ్నలకు మార్క్సిస్టు దృష్టికోణం నుంచి వాటిని ఎట్లా అర్థం చేసుకోవచ్చో వివరించేవారు. ఆర్ ఎస్ రావు గత మార్చ్ చివరి వారంలో కూడా గ్రామానికి వెళ్లి పరిశీలించాడానికి సంసిద్ధుడయ్యారు. అనారోగ్యంతో ఉన్న కారణంగా వద్దని చెప్పి ఒప్పించాల్సి వచ్చింది. ఆర్ ఎస్ రావు ప్రయత్నంలో భాగంగానే వీక్షణం తరపున గ్రామాలకు వెళ్లి అక్కడి ప్రజల జీవన స్థితిగతులను, గ్రామాల్లో వచ్చిన మార్పులను పరిశీలించే పనిని కొనసాగిస్తున్నాం.

మన జ్ఞానేంద్రియాలకు అందుబాటులో ఉన్న పదార్థం కావచ్చు, విషయాలు కావచ్చు, సమాజం కావచ్చు. ఇది ఇట్లే ఎందుకుంది వేరేలా ఉండే అవకాశం లేదా? దీని గురించి ఇట్లే ఎందుకు ఆలోచించాలి

*అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజ స్వభావాన్ని అర్థం చేసుకుని, విశ్లేషించి, నూతన ప్రజాస్వామిక విప్లవ విజయం కోసం ఆలోచనలు చేసిన ఆర్. ఎస్. రావు గురించి వివరిస్తున్నారు* **డి.వి. రామకృష్ణారావు**

# ఆర్.ఎస్.రావును స్మరించుకోవడమంటే..

రేగులగడ్డ సోమేశ్వర రావు (ఆర్. ఎస్. రావు)ను తెలుగునేలకు నేను పరిచయం చేయనక్కరలేదు. గత నాలుగు దశాబ్దాలుగా తెలుగు నేలకే కాకుండా దేశ వ్యాప్తంగా ప్రత్యామ్నాయ ఆలోచనా స్రవంతికి చెందిన ఆలోచనాపరుడిగా, విశ్లేషకుడిగా, మేధావిగా అందరికీ ఆయన పరిచయమే. ఆయన 17 జూన్ 2011న మధ్యాహ్నం ఢిల్లీలోని గంగారాం ఆస్పత్రిలో కన్నుమూసారు. గుండెపోటుతో అప్పటికి మూడు వారాల క్రితం ఆస్పత్రిలో చేరి చికిత్స పొందుతూ చనిపోయారు. చివరి క్షణాల్లో పలుకరింపులకు ఆయనలో స్పందన కనబడింది. ఆయన మెదడు అలర్ట్‌నెస్‌కు సూచికగానే ఆ స్పందన ఉంది. ఆయన కళ్లను అవసరమైన వారికి దానమిచ్చారు. ఆయన లేరు కాని ఆయన ఆలోచనలు, ఆయన ఇచ్చిన దృష్టి మనతోనే మిగిలాయి. ఆ దృష్టి కొనసాగుతోంది.

నేను 1990ల చివరి నుంచి ఆర్. ఎస్. రావును వింటున్నా, చదువుతున్నా, 2005 నుంచి సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రీసెర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సిడిఆర్‌సి)–వీక్షణంలలో పనిచేయడం మొదలుపెట్టాక ఆయనతో సన్నిహితంగా సంభాషించే అవకాశం కలిగింది. సిడిఆర్‌సికి ఆయన తొలి చైర్మన్‌గా వ్యవహరించారు. సిడిఆర్‌సి బోర్డులో ఆర్ ఎస్ రావు, ముదునూరి భారతి గారు ఉన్నారు. ఆ క్రమంలో వారితో ఆలోచనలు పంచుకోవడానికి చర్చించడానికి నాకు అవకాశం కలిగింది. సిడిఆర్‌సితో కలిసి పనిచేసే క్రమంలో పక్కకు తొలగినప్పటికీ తమ ఆలోచనలు పంచి ఇవ్వడం, చర్చించడం, రచనలు అందివ్వడం కొనసాగిస్తూనే ఉన్నారు.

ఆర్ ఎస్ రావు 22 అక్టోబర్ 1937న జన్మించారు. ఆయన స్వస్థలం విశాఖపట్నం జిల్లాలోని చోడవరం. ఆయన ఆంధ్ర విశ్వ విద్యాలయం నుంచి అర్థశాస్త్రంలో ఎంఎస్‌సి చేశారు. తొలి ఉద్యోగం గోఖలే ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పాలిటిక్స్ అండ్ ఎకనామిక్స్, పూనాలో పనిచేశారు. 1967-69 మధ్య ఇండియన్ స్టాటిస్టికల్ ఇన్‌స్టిట్యూట్ కలకత్తాలో పనిచేశారు. ఆ కాలం రెండు దశాబ్దాల దేశ స్వాతంత్ర్యాన్ని ప్రశ్నిస్తూ ఉవ్వెత్తున ఎగిసి పడిన పీడిత ప్రజల చారిత్రక నక్సల్బరీ పోరాటం ప్రారంభమైన కాలం. దేశవ్యాప్తంగా మేధావులు గొప్ప కుదుపుకు గురైన కాలం. ఆర్ ఎస్ రావు ఆ వెల్లువకు అతీతం కాదు. 1969లో మళ్లీ ఆయన పూనాకు వచ్చారు. దేశవ్యాప్తంగా నక్సల్బరీ వెలుగులో జరుగుతున్న చర్చల్లో ఆయన చురుకుగా పాల్గొన్నారు. కలకత్తాలో పనిచేస్తున్నప్పుడు అర్థగణాంక వేత్తగా అనతి కాలంలోనే చాలా పేరు తెచ్చుకున్నారు. నక్సల్‌బరీ ప్రభావంతో అదే కాలంలో మార్క్స్ రాసిన అదనపు విలువ, క్యాపిటల్ సంపుటాలు చదివి బాగా

వేరే విధంగా ఆలోచించలేమా? అని ఆలోచిస్తూ, ఆలోచింపజేస్తూ, ప్రతిదాన్ని ప్రశ్నించి, చర్చించి అవగాహనను పెంచుకోవాలని ప్రోత్సహించేవారు. సమాజంలో వస్తున్న మార్పులను అర్థం చేసుకొని వాటిని ఎదుర్కొవడానికి అవసరమయిన చైతన్యాన్ని పెంచడానికి భవిష్యత్ తరాలపై రైతులాంటి సహనంతో కృషి చేశారు. ఒక మార్క్సిస్టుగా తన ఆలోచనలకు జీవించే విధానానికి మధ్య దూరం లేకుండా జీవించారు. ఒక రకంగా చెప్పాలంటే ఆర్ ఎస్ రావు గారి ఇల్లు ప్రత్యామ్నాయ ఆలోచనాపరులకు కమ్మరి కొలిమిలా మారిందనడంలో సందేహంలేదు. ఈ కొలిమిని రాజేయడానికి ఇంటివారందరి సహకారం, శ్రమ ఉన్నాయి.

దేశంలో వేగవంతంగా ప్రజల జీవితాలను అతలాకుతలం చేస్తున్న మార్పులపై తన వైఖరిని ఎప్పటికప్పుడు ప్రకటిస్తుండేవారు. సమాజంలోని మార్పుల పట్ల ఆలోచనాపరులను ఎప్పటికప్పుడు జాగరుకులను చేస్తుండేవారు. తెలుగు సమాజంలోని మేధావులు స్పందించాల్సినంతగా స్పందించడం లేదని ఆవేదన వ్యక్తంచేసేవారు. తెలుగు సమాజం ఆయన నుంచి తెలుసుకోవాల్సిన విషయాలను తెలుసుకోవడంలో కొంత వెనుకబడిందనిపిస్తుంది.

ఆర్ ఎస్ రావు ప్రత్యామ్నాయ ఉద్యమ నిర్మాణాలలో లేకున్నా ఎంతో అంకిత భావంతో పనిచేశారు. తీవ్ర అనారోగ్యంతో హాస్పిటల్ నుండి వచ్చిన రెండు రోజులకే ఆదివాసి ప్రజలను, ప్రజా సంఘాల కార్యకర్తలను, తమ పార్టీ నాయకులు, కార్యకర్తలను విడిపించుకోవడానికి కలెక్టర్ వినీల్ క్రిష్ణను కిడ్నాప్ చేసి ఆ విషయంలో మధ్యవర్తిగా వ్యవహరించాలని మావోయిస్టు పార్టీ కోరితే ఆమేరకు మధ్యవర్తిగా వ్యవహరించారు. ఒడిశా ప్రభుత్వంతో చర్చల్లో పాల్గొని తన వంతు పాత్రను పోషించారు.

ప్రభుత్వాలు తెస్తున్న 'అభివృద్ధి' దీపపు సెమ్మె కింది చీకట్లో ఎంతో మంది జీవితాలు చెల్లాచెదరైపోతున్నాయి. ఆ దీపపు వెలుగులు కొద్ది మందికే దక్కుతున్నాయి. శ్రామికుల జీవితాల్లోకి వెలుగును నింపే, కాంతిని పంచే ప్రయత్నాన్ని కొనసాగించడమే ఆర్ ఎస్ రావు ఆలోచనా ధారకు కొనసాగింపు నిజమైన నివాళి అవుతుంది.

*(రచయిత వీక్షణం సర్క్యులేషన్ మేనేజర్)* వీ

ప్రభావితమైనారు. మార్క్సిస్టు సూత్రీకరణలు, మార్క్సిస్టు సంవిధానం ఆయన ఆలోచనా ఆవరణను ఆక్రమించాయి. ఆ క్రమంలో స్టాటిస్టిక్స్, క్వాంటమ్ మెకానిక్స్, తత్వశాస్త్రం ఇలా అనేక శాస్త్రాలు ఆయన అధ్యయనం చేశారు. తనదైన ముద్రతో తెలుగు సమాజాన్ని, దేశవ్యాప్తంగా చోటు చేసుకుంటున్న పరిణామాలను, ప్రజా పోరాటాలను, ఉద్యమాలను, పాలకుల విధానాలను పరిశీలించి తన బలమైన, చాలా పదునైన, నిశితమైన పరిశీలనలతో తన రచనల ద్వారా, సంభాషణల ద్వారా, ఉపన్యాసాల ద్వారా లోతైన విశ్లేషణలను అందించారు. ఆ తరువాత కాలంలో ఆర్థిక శాస్త్రం, చరిత్ర, సాహిత్యం, సంస్కృతి, తత్వశాస్త్రం, రాజకీయాలు ఇలా అనేక రంగాలపై తనదైన విశ్లేషణలను అందించారు. ఆయన వ్యాసాలలో చాలా వైవిధ్యం ఉంటుంది. కొత్త చూపు ఉంటుంది. ఆయన తడమని అంశంలేదు. ఫలానా విషయంపై ఆర్ ఎస్ రావు ఏమంటారో అని ఆలోచించేంతగా ఆయన ప్రభావం ఉంది. చాలా ధైర్యంగా, నిర్మొహమాటంగా తన ఆలోచనా చట్రాన్ని పంచుకునేవారు.

ఆయన ప్రత్యామ్నాయ ఉద్యమాలకు సంబంధించిన ఏ నిర్మాణంలోనూ ప్రత్యక్షంగా లేకున్నా నిర్మాణం విలువ, అవసరం లోతుగా గుర్తెరిగిన మనిషి. తనకు ఎన్ని అసంతృప్తులున్నా, ప్రశ్నలున్నా చెప్పవలసిన వాళ్లకు చెప్పడం, చర్చించవలసిన వాళ్లతో చర్చించడం ఆయన ఒక పద్ధతిగా ఆచరించేవారు. తన రచనలు కూడా ఇవ్వవలసిన వాళ్లకు మాత్రమే ఇచ్చేవారు. మీడియాకు తన రచనలు ఇవ్వడానికి ఎప్పుడూ ఆసక్తి చూపలేదు. 'పెట్టుబడికి కట్టు కథకు పుట్టిన విషపుత్రికలు మన పత్రికలు' అన్న శ్రీశ్రీ నానుడిని ఆయన తన ఆచరణలోకి తీసుకున్నారు. బయట జరుగుతున్న పరిణామాలపై, పత్రికల్లో వస్తున్న విషయాలపై చాలామంది కంగారు పడుతుంటే తాను మాత్రం అలా పత్రికలన్నీ చదివేసి బుర్రపాడు చేసుకోనని, సృజన, అరుణతార, ఉద్యమాలు అందించే కరపత్రాలు, డాక్యుమెంట్స్ మాత్రమే చదువుతానని, అందుకే గందరగోళ పడకుండా ఉంటానని చెప్పేవారు. ఆయన ఒక అరుదైన మార్క్సిస్టు మేధావి. కాలం సంధించిన ప్రశ్నలకు ఎప్పటికప్పుడు నిత్య నూతనంగా మార్క్స్-లెనిన్-మావోల తాత్విక పరికరాలతో సమాజాన్ని విశ్లేషించారు.

తెలుగు నేలపై ఆర్ ఎస్ రావు లాగా మార్క్సిస్టు తాత్విక దృక్పథాన్ని చాలా స్థిరంగా, గందరగోళ పడకుండా, తత్వాన్ని ఇంకించుకుని నిలబడిన మేధావులు చాలా కొద్ది మంది ఉన్నారు. అటువంటి విలువైన మేధా వారసత్వంలో ఆర్ ఎస్ రావు ముందు భాగాన ఉంటారు. భారత సమాజాన్ని విప్లవోద్యమం అర్ధ వలస, అర్ధ భూస్వామ్య సమాజంగా విశ్లేషించింది. ఆయన ఆ చట్రాన్ని విశదీకరించడంలో, బలపరచడంలో నాలుగు దశాబ్దాల పాటు కృషిచేశారు.

ఆయన ఇంగ్లీష్ వ్యాసాల సంకలనం 'టువార్డ్స్ అండర్ స్టాండింగ్ సెమీ ఫ్యూడల్ సెమీ కలోనియల్ సొసైటీ' పర్‌స్పెక్టివ్ ప్రచురణగా జనవరి 1995లో వచ్చింది. ఆయన రాసిన తెలుగు వ్యాసాలు సృజన, అరుణతార, ఉద్యోగక్రాంతి, వీక్షణం, చర్చ, వార్త పత్రికలలో వచ్చాయి. ఆ వ్యాసాలు, కొన్ని పుస్తకాలకు రాసిన ముందుమాటలు, ప్రసంగ పాఠాలు కలిపి 'కొత్తచూపు' వీక్షణం పబ్లికేషన్స్‌గా అక్టోబర్ 2010న వెలువడింది.

పూనాలో ఉన్నప్పుడు మేధావులు, విద్యావేత్తలు, పరిశోధకులు, కార్మికులు, విద్యార్థులతో కూడిన సమూహం తత్వశాస్త్రంపై చర్చలు చేసేది. 'స్పర్క్‌గ్రూప్' పేరిట ద్విభాషా పత్రికను ఆ బృందం నడిపింది. మార్క్సిస్టు-లెనినిస్టు-మావోయిస్టు ఆలోచనా వేదికగా చర్చలు కొనసాగాయి. చిన్న స్థాయిలో విద్యార్థి ఉద్యమం, కార్మిక సమస్యలపై కార్యక్రమాలు చేపట్టారు. ఆర్ ఎస్ రావుకు పూనా విద్యార్థులు, పాట్నా, కలకత్తా, నాగ్‌పూర్, ఢిల్లీ, ఒడిశా, ఆంధ్రప్రదేశ్‌లలో, ఇంకా దేశవ్యాప్తంగా ఎంతో మంది స్నేహితులు ఉన్నారు. ఆయన తన ప్రతి మాటలోనూ అంతర్జాతీయ శ్రామిక స్పృహను, స్ఫూర్తిని వ్యక్తం చేసేవారు. మాట మాత్రంగానైనా వర్గ దృక్పథానికి భిన్నంగా ఆలోచించే వారు కాదు.

పూనా తరువాత 1974లో ఆర్ ఎస్ రావు సంబల్‌పూర్ యూనివర్సిటీ అర్థశాస్త్ర విభాగంలో అధ్యాపకునిగా చేరారు. 1997లో రిటైర్ అయ్యేదాక అక్కడే పనిచేశారు. ఆయనకు విద్యార్థులు, ప్రజా సంఘాల కార్యకర్తలు, మేధావుల నుంచి మొదలు పెట్టి ప్రత్యామ్నాయ ఉద్యమ కార్యకర్తల దాకా అనేక పరిచయాలు, స్నేహ సంబంధాలు ఉండేవి. ఆయన జీవితం మొత్తం ప్రజలు, ప్రత్యామ్నాయ ఉద్యమాల ఆలోచనలకు సంబంధించిన సంఘర్షణగానే ఉంది.

శ్రామిక జన విముక్తి కోసం ఆయన తన తాత్విక ప్రాపంచిక దృక్పథంతో అవిశ్రాంత కృషి చేశారు. ఆయన దృక్పథ స్పష్టత ఎంతటిదంటే ఎలాంటి పరిస్థితుల్లోనూ ఆందోళన చెందకుండా కొత్తగా ఇంకా ఏమైనా ఆలోచించగలమా అని అనేవారు.

సిడిఆర్‌సి చేపట్టాలనుకున్న సామాజిక పరిశోధనలకు ఆర్ ఎస్ రావు, ముదునూరి భారతి ఎంతో తోడ్పాటును అందించారు. ఆర్ ఎస్ రావు ఆ సామాజిక పరిశోధనా చర్చల్లో పాల్గొని - ఏమి చూడాలి, ఎలా చూడాలి, ఎలా చూద్దాం, ఏమి చదవాలి వంటి విషయాల్లో ఎన్నో ఆలోచనలను అందించారు. ఆయన వేసిన కొన్ని ప్రశ్నలు, ఆయా సందర్భాలలో వ్యక్తం చేసిన అభిప్రాయాలు కొన్ని మీతో పంచుకుంటాను.

నిజంగానే ప్రజోపకరమైన రీసెర్చ్ జరుగుతోందా అంటూ మౌలిక విషయాలపై పరిశోధనలు జరగడంలేదన్నారు. చెంచులు ఎందుకు మారలేదు? కుల వృత్తులు ఎందుకు అంతరించిపోతున్నాయి? వ్యవసాయంలో వచ్చిన మార్పులు ఏమిటి? ఎటువంటి పరిశ్రమలు వచ్చాయి? వచ్చిన పరిశ్రమల్లో కార్మికుల స్థితిగతులు ఏమిటి? వంటి ప్రశ్నలు వేశారు. మనం చేయాలనుకున్న పరిశోధన ఈ మొత్తంలో ఒక చిన్న భాగం. ఆ భాగం నుంచి మొత్తాన్ని చూసే ప్రయత్నం చేద్దాం. యూనివర్సిటీలు 'ఎలా ఉంది' అనే అంశాన్ని మాత్రమే చెబుతాయి. 'ఎలా మారుతోందో' మనం చెప్పాలన్నారు. ప్రత్యక్షంగా గ్రామాలకు వెళ్లి ఏం జరుగుతుందో చూడాలి. ఏదైనా సరే కాంక్రీట్‌కు పోయి చూడాలని చెప్పేవారు. జ్ఞానం సంపాదించడంలో రెండు పద్ధతులు ఉన్నాయంటూ ఒకటి జ్ఞానం నుంచి వాస్తవ పరిస్థితిని చూడడమైతే రెండు, వాస్తవ స్థితి నుంచి జ్ఞానాన్ని పొందడం... మనం రెండవ పద్ధతిని అనుసరించాలన్నారు. ఏ పద్ధతి పరిశోధనకైనా మొట్టమొదట ఒక నిర్దిష్టతను పట్టుకొని చదవాలన్నారు. సమాజం తెలుసుకొని రాయడం, రాయడం కోసం తెలుసుకోవడం ఉంటాయన్నారు. సమాజాన్ని స్థూలంగా మూడు రకాలుగా చూడవచ్చునంటూ ఒక చట్రాన్ని మనకు అందిస్తారు. చూస్తున్న సమాజం శ్రమ కేంద్రంగా ఉందా? భూమి కేంద్రంగా ఉందా?

డబ్బు కేంద్రంగా ఉందా చూడమని అంటారు. ఆదివాసుల సమాజం శారీరక శ్రమ కేంద్రంగా ఉందని, యజ్ఞం కథలోని సమస్యకు భూమి కేంద్రమని చెబుతారు. అభివృద్ధి అంటే ఏమిటి? ప్రాజెక్టుల నిర్వాసితులకు ఏం జరిగింది. ఎలా ఉన్నారు? ఏం అయ్యారో వివరిస్తారు. శ్రమ కేంద్రంగానో, భూమి కేంద్రంగానో, డబ్బు కేంద్రంగానో ఉన్న సమాజం అంతిమంగా మనిషి కేంద్రంగా ఆలోచనలు చేయాల్సి ఉంటుందని అంటారు.

ఎప్పుడూ ప్రశ్నల్లా ఎలా ఉందో చూస్తారా? ఎలా మారుతుందో చూస్తారా? అని మనల్ని అలర్ట్ చేస్తారు. రైతుల ఆత్మహత్యల గురించి సందర్భం ఏంటి? పరిణామాలేంటి? సామాజిక సంబంధాలు ఎలా ఉన్నాయి? ఏమైన మారాయా? భూమి సంబంధాలు ఎలా ఉన్నాయి? ఎటువంటి సంబంధాల మార్పుల్లో ఆత్మహత్యలు జరుగుతున్నాయో పరిశీలించాలంటారు. సమాజానికి చాలా రోగ లక్షణాలు ఉన్నాయి, మనం అధ్యయనం చేసేటప్పుడు నిర్దిష్టంగా కొన్ని విషయాలు చూడాలి. 'ప్రజల దగ్గర చాలా జ్ఞానం ఉంది... ఆ జ్ఞానం మనం పట్టుకోవాలి' అని చెప్పేవారు. కార్మికులైనా, రైతులైనా ఎలా బతుకుతున్నారు? జీవన స్థితిగతులేంటి? ఎందుకు వలస వెళ్లిపోతున్నారు? ఇలా ఏ సమస్యను అధ్యయనం చేసినా బాధితుల వైపునుంచి, శ్రామికుల వైపునుంచి, అట్టడుగు మనుషుల వైపునుంచి సమాజాన్ని చూడాలని చెప్పేవారు. కమ్యూనిస్టు సమాజం మనిషిని ఉత్పత్తి శక్తిగా చూస్తుంది. పెట్టుబడిదారీ సమాజం మనిషిని కేవలం కార్మికునిగా చూస్తుంది. కార్మికుడు మన దేశంలో స్వేచ్ఛా జీవేనా? గ్రామంతో ఉన్న సంబంధ బాంధవ్యాలేమిటి? ఆయనకి గ్రామంతో ఎటువంటి మూలాలున్నాయి? ఊళ్లో పొలం ఉందా? ఆర్థిక పరమైన ఇచ్చిపుచ్చుకునే అవసరాలేమైనా ఉన్నాయా చూడాలనేవారు. భారత కార్మికవర్గం ఎలా ఏర్పడింది – అనే విషయంపై మనకు సరైన పుస్తకం లేదన్నారు. కార్మికులు పెళ్లిళ్లు ఎలా చేసుకుంటున్నారు? తమ ఇష్టం ఉన్నట్లు చేసుకుంటున్నారా? తమ గ్రామానికి పోయి కులంలోనే వెతుక్కుని చేసుకుంటారా? కార్మికులను తన్నడం, కొట్టడం ఉన్నాయా? బానిసత్వం ఎలా ఉంది? అధ్యయనం చేయమన్నారు. భూస్వామ్య వ్యవస్థ నుంచి వర్కింగ్ క్లాస్ ఎలా వస్తోందో అధ్యయనం చేయాలన్నారు. ప్రజల నుండి పుస్తకాలను చూడాలి, పుస్తకాల నుండి ప్రజలను కాదు అని గట్టిగా చెప్పేవారు.

ఆదివాసులను నిర్వాసితులను గావిస్తూ వస్తున్న పథకాలను ఉద్దేశించి ఆ పథకం వాళ్ల జీవితాలను అభివృద్ధి పరుస్తుందా? పథకంవల్ల వాళ్ల జీవితాలు ఎలా మారాయి? సమాజం అభివృద్ధి ఎలా ఉంది? వ్యక్తి అభివృద్ధి ఎలా ఉంది? చూడమని చెబుతూ ఆదివాసులు తమ శ్రమను దాచుకోలేరు కాబట్టి ఏదీ దాచుకోలేరంటారు. ఇంటికి తలుపులుండవు, నిప్పు ఉండదు అని తన పరిశీలనలు పంచుకుంటారు.

గ్రామ అధ్యయనం విషయంలో రాజకీయ అధికారం ఎక్కడ ఉంది? ఆర్థిక అధికారం ఎక్కడ ఉంది? ఎటువంటి నాయకత్వం రాజకీయాల్లోకి వస్తోంది చూడమంటారు. శ్రమ నుంచి ఉత్పత్తిని విడదీయడం ఉద్దేశంగా కార్యక్రమాలు వస్తున్నాయన్నారు. భూమిలేని కుటుంబాల ఉపాధి ఎలా ఉంది? దేని మీద బతుకుతున్నారు చూడమంటారు. ఫైనాన్స్ క్యాపిటల్‌తో వచ్చిన నాయకత్వం పథకాలు లేకుండా నిలువలేదంటారు. సామాజిక పునాది లేకుండా సామ్రాజ్య వాదానికి కష్టం అందువల్ల కొన్ని కార్యక్రమాలు చేపడుతుందంటారు. మన సమాజంలో వదంతులు, పుకార్లే జ్ఞానంగానూ, శాస్త్రంగానూ చలామణీ అవుతున్నాయంటారు. వదంతులు, పుకార్లు కూడా ఒక అర్ధ భూస్వామ్య లక్షణం అంటారు.

మొత్తంగా ఆర్ ఎస్ రావు సమాజాన్ని వస్తుగతంగా చూడాలని, దగ్గరికిపోయి పరిశీలించి వాస్తవాలను వెలికితీయాలని చెప్పేవారు. మార్క్సిస్టు సూత్రీకరణలు, గణాంకాల ఆధారంగా కాకుండా ప్రజల వాస్తవ జీవన స్థితిగతుల నుంచి వాస్తవాలను అర్థం చేసుకోవాలని చెప్పేవారు. కొత్తగా చదువుకునే వాళ్లు మార్క్స్ కన్నా ముందు మావో రచనలు చదవడం మంచిదని, అప్పుడు మార్క్స్‌ను అర్థం చేసుకోవడం సులభం అవుతుందని చెప్పేవారు. కమ్యూనిస్టు మ్యానిఫెస్టో చదివారా? లెనిన్ సామ్రాజ్యవాదం చదివారా? మావో నూతన ప్రజాస్వామికం చదివారా? అలాగే కారా మాష్టారి యజ్ఞం కథ, భూషణం కొండగాలి నవల, సాధన రాగో నవల, గురజాడ కన్యాశుల్కం చదివారా? అంటూ ఇలా తప్పక చదవాల్సిన పుస్తకాల గురించి చెబుతుండేవారు. మేధావులు భయం వదిలిపెట్టాలని, కొద్దిగా కష్టపడాలని అంటుండేవారు. ఆంధ్రప్రదేశ్‌లో 'ఎందువల్ల' అనే ప్రశ్న రాదు. 'ఎలా' అనే ప్రశ్న లేదు అని ఒక సందర్భంలో వ్యాఖ్యానించారు. తెలిసిన సమాధానం ఇస్తాం, తెలియనిది ఆలోచించం అనే ధోరణి మనలో ఎక్కువగా ఉందనేవారు. సామ్రాజ్యవాద నేపథ్యంలో వస్తున్న అస్తిత్వ ఆకాంక్షలు, మొత్తం సామాజిక స్థితిపై వర్గ విశ్లేషణలు చివరిదాకా చేస్తూ, చర్చిస్తూ అర్ధాంతరంగా ఆర్ ఎస్ రావు గారు మన నుంచి వెళ్లిపోయారు. గత ఏడాది నవంబర్‌లో ఆర్ ఎస్ రావు, ముదునూరి భారతి గార్ల పుస్తకాలను హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో ఆవిష్కరించుకున్నాం. ముదునూరి భారతి గారి ఐదు ఇంగ్లిషు పుస్తకాలకు (ఒక పుస్తకానికి సహ రచయిత) రాసిన ముందు మాటలలో ఆర్ ఎస్ రావు గారి ఇటీవలి విశ్లేషణలను, అంచనాలను చూడవచ్చు. ఆయన భౌతికంగా మన మధ్య లేకపోవచ్చు కాని ఆయన ఇచ్చిన చూపు మనతో ఉంది. ఆయన కన్న స్వప్నాల కోసం, పరితపించిన సామాజిక మార్పుకోసం పనిచేయడమే ఆర్. ఎస్. రావుకు మనమివ్వగలిగే నివాళి. వీ

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)*

*ఆర్. ఎస్. రావు అందించిన ఆలోచనా విధాన చట్రాన్ని పరిచయం చేస్తూ ఆయన ఆశావహ దృష్టికోణాన్ని ఆవిష్కరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# అదృశ్యమైన ధృవతార ఆర్.ఎస్. రావు

**మ**నకాలపు మహామేధావి, సునిశితమైన మార్క్సిస్టు విశ్లేషకుడు ఆర్ ఎస్ రావు కన్నుమూశారు. ముప్పై సంవత్సరాలుగా ఆయనతో సాగిన అనుబంధంలో కలిసి చేసిన ఆలోచనలు, పనులు, ప్రయాణాలు, కలిసి కన్న కలలు, పొందిన విజయాలు, వైఫల్యాలు అన్నీ ముగింపుకు వచ్చినట్టు గుండె పగిలే మౌనం. మహానిశ్శబ్దం. "చలనం మాత్రమే ఉంది. విశ్రాంతి, విరామం లేవు, విశ్రాంతి, విరామాల గురించి ఉన్న తాత్విక ప్రత్యయం కేవలం మన ఆలోచనా సౌలభ్యానికే తప్ప, సాపేక్షికంగానే తప్ప ప్రకృతిలో, సమాజంలో, మానవ మేధలో దానికి అవకాశమే లేదు" అని ఎప్పుడూ చెపుతుండే ఆయన మేధ విరామానికి చేరింది. బహుశా అది ఆ ఆలోచనలకు విరామం కాదేమో. ఆ చలనం కొనసాగుతూనే ఉంటుందేమో.

నిజంగా ఆయనతో మాట్లాడడం అంటే ఒక చలనం, ఒక చైతన్యం, ఒక వెలుగు. అప్పటిదాకా మనకు తట్టని ప్రశ్నను మన మెదడులో ప్రవేశపెట్టి అల్లకల్లోలం చేసేవారాయన. ఇక ఇది అంతిమ నిర్ణయం, ఆలోచించవలసిందేమీ లేదు అనుకున్న దాని మీద కందిరీగల తుట్టెను రేపేవారాయన. అప్పటిదాకా ఎన్నో వైపుల ఆలోచించిన విషయానికే మరొక కొత్త కోణాన్ని చూపెట్టేవారాయన. గ్రామీణ వ్యవసాయ సమాజంలో చీకటి రాత్రి దిక్కు చూపడానికి ప్రతి మనిషీ వాడుకునే ధృవనక్షత్రం లాంటి వారాయన. ముసిముసి చీకటి తొలగిపోకముందే వెలుగుదారి పరిచే వేగుచుక్క ఆయన. తెలుగు సమాజమూ, భారత విప్లవోద్యమమూ అతి కీలక దశలో ఉన్నప్పుడు, ఎన్నెన్నో కొత్త, సంక్లిష్ట సమస్యలకు జవాబులు వెతకవలసిన తరుణంలో ఆ ధృవతార అదృశ్యమయింది.

ఎప్పుడో 1990లో పర్ స్పెక్టివ్స్ ప్రచురణగా చిన్నపుస్తకంగా వచ్చిన 'అభివృద్ధి – వెలుగు నీడలు' వ్యాసం మినహా ఈ ఇరవై ఏళ్ళలో ఆయన రచనలు పుస్తకరూపంలో రాలేదు. అంతకు ముందూ ఆ తర్వాతా కలిపి అరవై దాకా వ్యాసాలు రాశారు. దాదాపు అన్ని ప్రజాసంఘాల సభలలో, సమావేశాలలో వందకు పైగా ఉపన్యాసాలు ఇచ్చారు. ఆ కృషినంతా ఎప్పటికైనా ఒక్కచోటికి తీసుకురావాలనే కలలో భాగంగా వీక్షణం ప్రచురణల తరఫున ఆర్ ఎస్ రావు తెలుగు రచనల సమగ్ర సంపుటం 'కొత్తచూపు' 2010 అక్టోబర్‌లో వెలువరించాం. దానికి రాసిన ముందుమాటలో ఆయనతో వ్యక్తిగత సాన్నిహిత్యం ఎక్కువ రాశానని, ఆయన మీద నా భక్తిని బహిరంగంగా వ్యక్తీకరించానని నాకే అనుమానం వచ్చింది. ప్రచురణకు కొద్దిరోజుల ముందు ఆ ముందు మాట ఆయన చేతికిస్తూ బెరుకుగా 'సబ్జెక్టివ్ గా వచ్చినట్టుంది' అన్నాను. 'నువ్వు సబ్జెక్టివ్ అనుకునేది మరొకరికి ఆబ్జెక్టివ్ కావచ్చు. మరొకరికి సబ్జెక్టివ్ అనిపించినది నీకు ఆబ్జెక్టివ్ కావచ్చు. అది రిలేటివ్. అసలింతకీ ఆబ్జెక్టివ్ లేని సబ్జెక్టివ్ ఉండదు, సబ్జెక్టివ్ లేని ఆబ్జెక్టివ్ ఉండదు. వాటిమధ్య విభజన రేఖ మనం గీసిందే. చాలసార్లు అనవసరమైనదే' అన్నారు ఆయనకు సహజమైన ఒక కొంటె చిరునవ్వుతో. ఆయనతో చర్చలలో వందలసార్లు ఈ సాపేక్షికత గురించీ, అందులోని గతితార్కికత గురించీ ప్రస్తావన వచ్చింది. భారత కమ్యూనిస్టు సంప్రదాయంలో అలవాటయిన తప్పుడు వాదనాపద్ధతుల గురించి మాట్లాడేటప్పుడు చాల సందర్భాలలో ఆయన ముఖం మీద ఇటువంటి కొంటె చిరునవ్వు విరిసేది.

ముప్పై ఏళ్లుగా చూస్తున్న ఆ చిరునవ్వు ఢిల్లీలోని సర్ గంగారాం ఆస్పత్రిలో జూన్ 17 మధ్యాహ్నం చెరిగిపోయింది. నిజం చెప్పాలంటే మరణం తర్వాత ఆ స్ఫటికం లాంటి స్పష్టమైన, కత్తి అంచులాంటి నిశితమైన వాదన ఆగిపోయింది గాని ఆయన ముఖం మీద ఆ పెదాల ముడి అట్లాగే కొంటె చిరునవ్వుగా నిలిచిపోయే ఉంది. మరణానికి కొద్ది గంటల ముందు ఇంటెన్సివ్ కేర్ యూనిట్ లో వెంటిలేటర్ మీద, ముఖం మీద గాజు మాస్కు తో, వళ్లంతా గొట్టాలతో, యంత్ర పరికరాలతో ఉన్న ఆయన చెయ్యి పట్టుకుని 'సార్, సార్' అని పిలిస్తే మూసిన కనురెప్పలు విప్పి చూశారు. చాల రోజులుగా మాట లేదు గాని, గాజు మాస్కు కింది నుంచి పెదవి కదల్చడానికి ప్రయత్నించారు. అప్పటికి ఇరవై రోజులుగా ఊపిరితిత్తులు పని చేయడం లేదు, గుండె పని చేయడం లేదు. మూడు రోజులుగా మూత్ర పిండాలు పని చేయడం లేదు. కాని ఆ సునిశితమైన మేధ ఇంకా సున్నితంగా ప్రతిస్పందిస్తూనే ఉంది.

నలభై సంవత్సరాలుగా మార్క్సిస్టు రాజకీయార్థిక, తాత్విక దృక్పథాన్ని అత్యంత ప్రతిభావంతంగా, సృజనాత్మకంగా అన్వయిస్తూ, వివరిస్తూ, విశ్లేషిస్తూ ఆయన సాగించిన అనితరసాధ్యమైన కృషిని ఒక వ్యాసంలో, అదీ సంస్మరణ సందర్భంలో రాయడం సాధ్యం కాదు. కాని స్థూలంగానైనా ఆయన అనుసరించిన సంవిధానపు విశిష్టతలు ఏమిటో, ఆయన నుంచి నేర్చుకోవలసినదేమిటో తెలుసుకోవలసి ఉంది.

విశాఖపట్నం జిల్లా చోడవరంకు చెందిన ఆచార పరాయణులైన బ్రాహ్మణ కుటుంబంలో పుట్టిన రేగులగడ్డ సోమేశ్వరరావు అర్థశాస్త్రం, గణాంకశాస్త్రం చదువుకుని, సంగీతం మీద, పూలమీద, నాటకాల మీద ఆసక్తితో జీవితం ప్రారంభించి, మార్క్సిజం అధ్యయనంతో మార్క్సియన్ ఆలోచనాపరుడిగా మారి, మొత్తంగా భారత సమాజంలోని, ప్రత్యేకంగా

ఒరియా, తెలుగు సమాజాలలోని అట్టడుగు ప్రజలను అధ్యయనం చేసి, నక్సల్బరీ విప్లవోద్యమంతో సన్నిహితంగా నడిచి మనకాలపు గొప్ప మార్క్సిస్టు విశ్లేషకుడిగా మారిన పరిణామ క్రమం, ఆయన మిగిల్చి పోయిన తార్కిక, తాత్విక చింతన అత్యద్భుతమైనవి. వాటినుంచి అర్థం చేసుకోవలసినదీ, నేర్చుకోవలసినదీ, ఆచరించవలసినదీ ఎంతో ఉంది.

మార్క్సు నూ మావో నూ ఆయన తన ఆలోచనల్లో, ప్రవర్తనలో జీర్ణం చేసుకున్నారు. ముఖ్యంగా మార్క్సు తన ఆదర్శాలుగా ప్రకటించిన రెండు మాటలు ('ప్రతిదాన్నీ ప్రశ్నించు', 'మానవీయమైనదేదీ నాకు పరాయిది కాదు') ఆర్ ఎస్ రావు గారికి కూడ ఆదర్శాలుగా ఉన్నాయి. దేన్నీ ప్రశ్నించకుండా, ఆలోచించకుండా, పరిశోధించకుండా, సొంత వాదనతో విశ్వాసం కుదుర్చుకోకుండా విశ్వసించగూడదు అనేదే ఆయన నేర్పిన పాఠం. ఇలా ప్రతిదాన్నీ ప్రశ్నించి, తర్కించి, పరిశోధించి, తనకు తానుగా నిర్ధారించుకున్న తర్వాతనే నమ్మారు గనుకనే ఆయనకు తాను చెప్పే విషయాలపట్ల అసాధారణమైన స్పష్టత ఉండేది. అపారమైన ఆత్మవిశ్వాసం ఉండేది. ఆ లక్షణం వల్లనే ఆయన కొత్త ప్రశ్నలు లేవదీసేవారు. కొత్త జవాబులు అన్వేషించేవారు. కొత్త ఆలోచనలు చేయడానికి ప్రోత్సహించేవారు. 'గాలిపటాలు ఎగరేయాలి' అనే అలంకారంతో ఆయన ఆలోచనలను గాలిపటాలుగా చూశారు. ఎటువంటి గాలిలోనైనా, ఎంత ఎదురుగాలిలోనైనా గాలిపటాన్ని ఎగరేయాలి. దాన్ని గాలిలో స్వేచ్ఛగా తిరగనివ్వాలి. కొత్త గాలి తెమ్మెరలను ఆస్వాదించనివ్వాలి. కొత్త రంగాలలోకి ప్రవేశించనివ్వాలి. అయితే ఆ గాలిపటం ఎంత దూరం వెళ్లినా విశృంఖలంగా, గాలివాటుగా, నేలతో, మనిషితో సంబంధం వదిలి కాదు. ఎగరేయడం చేసేది మనిషి మాత్రమే. ఆ గాలిపటాన్ని స్వేచ్ఛగా వదిలేలా సూత్రం పట్టుకున్న మనిషి, నేల మీద స్థిరంగా నిలబడ్డ మనిషి మాత్రమే. ఆ స్వేచ్ఛ, ఈ స్థిరత్వం రెండూ అవసరమే. సరిగ్గా అట్లాగే గత నలభై సంవత్సరాలలో ఆయన చేసిన కృషిలో మార్క్సిజం పట్ల అచంచల విశ్వాసం అనే స్థిరత్వమూ ఉంది, దేన్నయినా పరిశీలించాలి, ఎక్కడికైనా వెళ్ళాలి, ఎన్ని ప్రశ్నలైనా ఎదుర్కోవాలి అనే స్వేచ్ఛా ఉంది.

మళ్లీ "మానవీయమైనదేదీ నాకు పరాయిది కాదు" అని మార్క్సు ఉటంకించిన సూక్తినీ ఆర్ ఎస్ రావు గారు ఆలోచించిన, రచించిన, వ్యాఖ్యానించిన విషయాల విస్తృతినీ చూస్తే ఇక్కడ కూడ ఆయన మార్క్సు అడుగుజాడల్లో నడిచారని అర్థమవుతుంది. భారత సామాజిక సంబంధాలు, భూస్వామ్యం, సామ్రాజ్యవాదం, భారత ఆర్థిక వ్యవస్థ చరిత్ర, ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానం, పాలనా విధానాలు, భూసంస్కరణలు, ప్రజా సాంకేతిక పరిజ్ఞానం, మార్కెట్ భావజాలం, అభివృద్ధి, విస్థాపన, పర్యావరణం, చరిత్ర నిర్మాణంలో ప్రజల పాత్ర, భారత సామాజిక ఆర్థిక వ్యవస్థల సంక్షోభం, నక్సల్బరీ వెలుగులో భారత విప్లవోద్యమం నిర్మిస్తున్న చరిత్ర, సామ్యవాద ప్రయోగాలు, ప్రత్యామ్నాయ సంస్కృతి, పౌరహక్కుల ఉద్యమం, సామ్రాజ్యవాద ప్రభావానికీ కుల, మత వాదాలకూ సంబంధం, స్త్రీవాదం, తెలుగు సాహిత్యం వంటి అనేక విషయాల మీద ఆయన అద్భుతమైన రచనలెన్నో చేశారు.

అప్పటికే మార్క్సిజం చదువుకుని, విశ్వసిస్తున్న ఆర్ ఎస్ రావు నక్సల్బరీ ఉద్యమ ప్రజ్వలనంతో క్రియాశీల మార్క్సిస్టు మేధావిగా మారారు. నక్సల్బరీ పంథా దేశాన్ని అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజంగా అభివర్ణించినప్పుడు, ఆ సూత్రీకరణ ఎంత వాస్తవికమైనదో చూపడానికి 1970లో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ లో ఒక చిన్న ప్రశ్నావ్యాసంతో ప్రవేశించిన ఆర్ ఎస్ రావు చనిపోయే సమయానికి ఆక్స్ ఫర్డ్ విశ్వవిద్యాలయంలో అర్ధవలస అర్ధ భూస్వామ్య సూత్రీకరణను సమర్థించే పత్రం తయారుచేసే పనిలో ఉన్నారు.

1970లోనే ఆయన వేసిన రెండు ప్రశ్నలు ఆయన దృష్టి నైశిత్యానికీ, ప్రజల పట్ల ప్రేమకూ, విప్లవోద్యమ నిబద్ధతకూ అద్దం పడతాయి. భారత వ్యవసాయంలోకి పెట్టుబడిదారీ విధానం ప్రవేశించిందని సిపిఐ, సిపిఎంలకు చెందిన సిద్ధాంతవేత్తలు, స్వతంత్ర అర్థశాస్త్రవేత్తలు సిద్ధాంతాలు చేస్తున్నప్పుడు ఆయన 'పెట్టుబడిదారీ రైతును వెతుకుతూ...' అని ఆ వాదనలను ఖండించే చిన్న వ్యాసం రాశారు. వ్యవసాయంలోకి 'ఆధునిక' పరికరాలు రావడమే పెట్టుబడిదారీ విధానానికి నిదర్శనమనే వాదనకు జవాబు చెపుతూ 'ఆధునిక అనేది సాపేక్షిక పదం. కర్రనాగలి కన్న ఇనుపనాగలి ఆధునికం. ట్రాక్టర్ ఇంకా ఆధునికం. ఒకానొక సమయంలో మూడూ సహజీవనం చేస్తూ ఉండవచ్చు కూడ. సాధనం పాతదా, కొత్తదా అని కాదు, పెట్టుబడి సంచయనం అంతకంతకూ ఎక్కువగా జరుగుతూ ఉండడమే పెట్టుబడిదారీ విధానాన్ని నిర్ణయిస్తుంది' అని మౌలిక ప్రశ్న సంధించారు. ఈ వ్యాసంలోనే 'చూడవలసింది ఏది ఉన్నది అని కాదు, అది ఎలా మారుతున్నది అని' అని సూత్రీకరించారు. చలనంలో ఉన్న వస్తువును అధ్యయనం చేయడం, చలనాన్ని అధ్యయనం చేయడం అనే మౌలిక భావనలకు ఆయన అప్పటినుంచీ నలభై సంవత్సరాలపాటు స్థిరంగా అంటిపెట్టుకుని ఉన్నారు.

అలాగే 1969-70లలో ఇందిరా గాంధీ ప్రవేశపెట్టిన బ్యాంకుల జాతీయకరణ ప్రగతిశీల విధానమని పార్లమెంటరీ కమ్యూనిస్టు నాయకులు, అర్థశాస్త్రవేత్తలు పొగుడుతున్నప్పుడు, నాగపూర్ లో ఒక సదస్సులో 'బ్యాంకుల జాతీయకరణ సరే, పాలన జాతీయకరణ ఎప్పుడు' అనే మౌలిక ప్రశ్న వేసి ఆయన కందిరీగల తుట్టెను కదల్చారు.

లోలోపల ఆలోచన, మిత్రులతో చర్చలో, సంభాషణలో ఆలోచన, గాలిపటాలు ఎగరేయడం వల్ల ఆయన చేయవలసినంత రచన చేయలేదని, ఆయన అద్భుత అన్వేషణలన్నీ మౌఖిక సంప్రదాయం లోనే మిగిలిపోయాయని అనిపిస్తుంది. అత్యవసరమనుకుంటే తప్ప, ఎవరైనా అడిగితే తప్ప ఆయన రాయలేదు. సభలకు, సమావేశాలకు పిలిస్తే తప్పనిసరిగా లిఖిత పత్రంతోనో, నోట్స్ తోనో వచ్చేవారు.

తెలుగులో వార్త దినపత్రికకు తప్ప ప్రధానస్రవంతి పత్రికలలో ఆయన దాదాపుగా ఎప్పుడూ రాయలేదు. టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక తన 150 ఏళ్ల సందర్భంగా 1990లో ఆయనతో ఒక వ్యాసం రాయించుకుని దాన్ని అచ్చువేయలేదు. ఆ సందర్భంగా ఆయన రాసిన అద్భుతమైన వ్యాసం అచారిత్రక ప్రజల చరిత్ర రచన. ప్రజలు, ప్రజల శ్రమ, ప్రజల ఆకాంక్షలు, ప్రజల సాంకేతిక పరిజ్ఞానం, ప్రజల సంస్కృతి – ఈ అంశాలు ఆయనకు అన్నిటికన్న ముఖ్యమైనవి. ఏ చర్చనైనా ఆయన ఈ మౌలిక అంశాలవైపు మళ్లించేవారు. టైమ్స్ ఆఫ్ ఇండియా కోసం రాసిన వ్యాసానికి కూడ ఈ ఆలోచనలే పునాది.

ప్రజల గురించి ఇంత లోతుగా ఆలోచించే క్రమంలోనే ఆయన ప్రజల అభివృద్ధి ఆకాంక్షలకూ పాలకుల అభివృద్ధి భావజాలానికీ మధ్య అంతరం గురించి చెప్పడం ప్రారంభించారు. అసలు పాలకులు అభివృద్ధిగా భ్రమలు కల్పిస్తున్నది అభివృద్ధి కానేకాదని, అభివృద్ధి పథకాలనే అభివృద్ధిగా పాలకులు ప్రచారం చేస్తున్నారని, మధ్యతరగతి

# మాధవస్వామి

హోమియో వైద్యుడు, విప్లవ రచయిత, పౌరహక్కుల కార్యకర్త, కర్నూలు జిల్లాలో ప్రజా ఉద్యమాల పెద్ద దిక్కు మాధవస్వామి మే 31 రాత్రి గుండెపోటుతో మరణించారు. కర్నూలు జిల్లా నందికొట్కూరు దగ్గర వీపనగండ్లలోని బహుజన కులంలో పుట్టిన మాధవస్వామి హోమియో వైద్యం చదవడానికి హైదరాబాద్ వచ్చారు. విద్యార్థిగా ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘంలో కార్యకర్త అయి, ఆ రాజకీయ విశ్వాసాలతోనే విప్లవ రచయితల సంఘం సభ్యుడయ్యారు. 1980ల తొలి రోజుల్లో కవిత్వ రచనతో ప్రారంభమైన ఆయన సాహిత్య ఆసక్తులు మరణించేంత వరకు అదే విధంగా కొనసాగాయి. విస్తరించాయి. ఇటీవల కర్నూలు జిల్లాలో ఉద్యోగుల సమస్యల పై ఆందోళనలలోనూ, రాయలసీమ విద్యావంతుల వేదిక నాయకుడి గానూ ఆయన మళ్లీ విరివిగా రచన ప్రారంభించారు. వీక్షణంలో కొన్ని వ్యాసాలు రాశారు. అనువాదాలు చేశారు. హైదరాబాద్‌లో హోమియో వైద్య విద్య చదవడం అయిపోయిన తరువాత కర్నూలుకు వెళ్లి కొన్ని సంవత్సరాలు ప్రైవేట్ ప్రాక్టీసు చేశారు. కర్నూలు పరిస్థితులను బట్టి అక్కడ పౌరహక్కుల సంఘం కార్యకర్తగా క్రియాశీలంగా పనిచేశారు. మద్దూరు, రేగడ గూడురు లాంటి చోట్ల భూ పోరాటాలలో పాలు పంచుకున్నారు. మార్క్సిస్ట్ రాజకీయ విశ్వాసాలను వదులుకోకుండానే, ఈ దేశంలో కుల సమస్యను ఇంకా లోతుగా అధ్యయనం చేయాలని ఆలోచించారు. అంబేద్కర్‌ను అధ్యయనం చేయడంలోనూ, దళిత, బహుజన, మైనారిటీ ఐక్య వేదికలను నిర్మించడంలోనూ అగ్రభాగాన నిలిచారు. ఆ ప్రయోగాలలో విజయం సాధించలేకపోయాననే నిరాశతో రెండు మూడు సంవత్సరాలు మౌనంగా ఉండిపోయినప్పటికీ, మళ్లీ తేరుకుని గత మూడు నాలుగు సంవత్సరాలుగా ఉద్యోగ క్రాంతి బాధ్యతలలోనూ, రాయలసీమ విద్యావంతుల వేదికలోనూ క్రియాశీలంగా పని చేస్తున్నారు. మే 29న హైదరాబాద్‌లో ఉద్యోగ క్రాంతి సభలో పాల్గొని, 30న హైదరాబాద్‌లోనే సంస్థాగత సమావేశంలో కూడా పాల్గొని 31 ఉదయం కర్నూలు చేరి ఆ రాత్రే గుండె పోటుతో మరణించారు. మరణించే సమయానికి కర్నూలులో జిందాల్ కర్మాగారం వల్ల వస్తున్న పర్యావరణ నష్టాల గురించి వీక్షణం కోసం వ్యాసం రాస్తున్నారు. మాధవస్వామి మృతికి వీక్షణం సంతాపం ప్రకటిస్తోంది.



ఆ ప్రచారానికి లొంగిపోతున్నదని ఆయన విస్తారంగా రాశారు.

ఈ విశ్లేషణ వల్లనే ఆయన నక్సల్బరీ వెలుగులో నడుస్తున్న భారత విప్లవోద్యమాన్ని ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాగా చూశారు. దాదాపు గత ఇరవై సంవత్సరాలుగా ఆయన రచనలు, ఉపన్యాసాలు అన్నిటిలోనూ, ఇతర అంశాలకన్న ఎక్కువగా ఈ ప్రజా, ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా విశిష్టత గురించి వివరించడానికి, దాన్ని విస్తరించడానికి ప్రయత్నించారు. 'నక్సలైట్లు ఇంకా విజయం సాధించి ఉండకపోవచ్చు. కాని భారత ఆర్థిక వ్యవస్థలో పేదరైతులకూ, వ్యవసాయ కూలీలలకూ ప్రధాన స్థానం ఉంటుందని వాళ్ళు లేవనెత్తిన అంశాలు, పేదరికం గురించీ, మార్కెట్ సమస్య గురించీ లేవనెత్తిన అంశాలు ఒకవైపు, విదేశీ సాంకేతిక పరిజ్ఞానం మీద, సహాయం మీద ఆధారపడడం గురించిన ప్రశ్నలు మరొకవైపు ఒక చట్రాన్ని ప్రతిపాదించే ఇతివృత్తాలవుతాయి. ఆ చట్రం పకడ్బందీ చట్రం కాకపోయినప్పటికీ, భారత వాస్తవికతను అర్థం చేసుకునే చట్రం ఇదే' అని 1984లో ఒక సదస్సులో ఆయన అన్నారు. ఈ దేశంలో ప్రజా ఉద్యమాలలో నక్సల్బరీ ప్రవేశపెట్టిన ఆ చట్రాన్ని అర్థం చేసుకోవడం, వివరించడం, విశ్లేషించడం, విస్తరించడం, ఇంకా పకడ్బందీగా మార్చడానికి ప్రయత్నించడం, ఈ చట్రం వైపు ఇతర ఆలోచనాపరులను ఆకర్షించడం ఆర్ ఎస్ రావు గత నలభై సంవత్సరాలు నిరంతరంగా చేసిన పని. ఆ పనిని కొనసాగించడమే ఆయనకు నివాళి.

ఆయన నుంచి అన్నిటికన్న ఎక్కువగా నేర్చుకోవలసినది ఆశావాదం. ప్రకృతి, సమాజం, మానవమేధలలో నిరంతరం సాగే చలనాన్ని విశ్లేషించే వ్యక్తిగా ఆయన 'ఇవాళ తెలియకపోతే రేపు తెలుసుకుంటాం. ఇవాళ తప్పు చేస్తే రేపు సరి చేయడానికి ప్రయత్నిస్తాం. ఎప్పటికైనా మనిషే సాధించగలడు' అనేవారు. అపజయాలు, వైఫల్యాలు, తప్పులు, అనుకున్న పనులు కాకపోవడం ఎన్ని జరిగినా ఆయన ఆ తాత్విక దృక్పథం వల్లనే కుంగిపోలేదు, బెంబేలు పడలేదు. గత ఎనిమిది సంవత్సరాలుగా వీక్షణంతో, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ తో ఆయన సంబంధంలో, మార్గదర్శకత్వంలో కూడ పదే పదే ఈ ఆశావహ దృక్పథమే వ్యక్తమయింది. దాదాపు ఇరవై సంవత్సరాలుగా ఆలోచిస్తున్న పరిశోధనా కేంద్రం ఆరు సంవత్సరాల కింద వాస్తవరూపం ధరించి, ఇబ్బందులను ఎదుర్కొన్నప్పుడు విమర్శనాత్మకంగానైనా సెంటర్ తో కొనసాగారు. ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ లో అనేక రచనలతో ఏకీభావం లేకపోయినా, పని జరగాలని వెన్నుతట్టారు. భువనేశ్వర్ లో మరొక పరిశోధనా కేంద్రం ప్రారంభమై పనిచేస్తుందనే ఆశతో అక్కడికి వెళ్లి, అక్కడా అనుకున్న పని జరగక వెనక్కి తిరిగి వచ్చి, 'నేనూ భారతి గారూ ఏమి రాసినా, ఏమి చేసినా వీక్షణం, సి డి ఆర్ సి ప్రచురణలుగానే రావాలి' అని వీక్షణం – సి డి ఆర్ సి బృందంపై తన విశ్వాసాన్ని ప్రకటించారు. వ్యక్తిగతంగా నాకు గీటురాయిగా నిలిచారు. రాంకినీ, రామునూ ఆలోచన, రచన, వ్యక్తీకరణల వైపు ప్రోత్సహించారు. సారు మా మీద పెట్టుకున్న నమ్మకాన్ని ఎటువంటి పరిస్థితిలోనయినా వమ్ము చేయబోమని ఆయన చివరి క్షణాలలో హామీ ఇచ్చాను. నేత్రదానం వల్ల ఇంకా జీవిస్తున్న ఆయన కళ్లు మమ్మల్ని చూస్తూనే ఉంటాయి. ఆయన వదిలివెళ్లిన అసంపూర్ణ కర్తవ్యాలు మమ్మల్ని నడుపుతూనే ఉంటాయి.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

*ఆంధ్రప్రదేశ్ రాడికల్ విద్యార్థి సంఘం 5వ రాష్ట్ర మహాసభ (తిరుపతి 12 ఫిబ్రవరి 1983) లను ప్రారంభిస్తూ* **ప్రొఫెసర్ ఆర్.ఎస్.రావు** *'ఇన్ యాన్ అటెంప్ట్ టు కమ్యూనికేట్' అనే ప్రసంగవ్యాసం చదివారు. రాష్ట్రంలో ఆయన చేసిన తొలి ప్రసంగాలలో అది ఒకటి. అదే ఆ తరువాత 1995లో పర్స్పెక్టివ్స్ ప్రచురణ 'టువార్డ్స్ అండర్‌స్టాండింగ్ సెమీ ఫ్యూడల్, సెమీ కలోనియల్ సొసైటీ'లో అచ్చయింది. తెలుగులోకి మొదటిసారిగా అనువదించి ప్రచురిస్తున్నాం. – సం.*

# సంభాషించే ప్రయత్నంలో...

ఒక విద్యావేత్తకు తోటి విద్యావేత్తలతో తప్ప ఇతరులతో సంభాషించే బాధ్యత ఏమీ ఉండదు. చుట్టూ ఉన్న భూస్వామ్య నేపథ్యం వల్ల, సరిగ్గా బ్రాహ్మణ వ్యవహారంలాగ, ఆ విద్యావేత్త సాగించే కృషికి నిగూఢమైన అర్థాలెన్నో ఉంటాయి. ఆయన ఏది చెపితే అది సత్యం. దానికి దైవ వచనాల మద్దతు కూడ ఉంటుంది. మరొకపక్క సామ్రాజ్యవాద నేపథ్యం వల్ల ఆయన కృషి విస్తరించే దిశలోకి వెళ్లకుండా ఒకేరకమైన పునరుత్పత్తికి కుదించబడుతుంది. ఆ కృషికి అంతర్జాతీయ గుర్తింపు కూడ అవసరమవుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ప్రజారాశులకు సంబంధించినంతవరకు ఆ కృషికి మొదటి అర్థంలో మారకపు విలువా లేదు, రెండో అర్థంలో ఉపయోగపు విలువా లేదు. అందువల్లనే ప్రజలతో సంభాషించాలనే, ప్రజలకు అర్థం కావాలనే బాధ్యత ఆయనకేమీ ఉండదు. నేను కూడ విద్యావేత్తనే గనుక ఆ పరిమితిని దాటడానికి ఇక్కడ ఒక చిన్న ప్రయత్నం చేస్తున్నాను. సామాజిక సంబంధాల మార్పే సామాజిక ఉద్యమానికి పరిణతిని సంతరింపజేస్తుందనే ముఖ్యమైన కోణాన్ని మీకు చూపడానికి ప్రయత్నిస్తున్నాను. మార్క్సిజాన్ని సిద్ధాంత స్థాయి నుంచి భౌతిక స్థాయికి తీసుకువచ్చే ప్రక్రియకు సంబంధించిన కోణం అది. ఆ ప్రక్రియ ఇవాళ సమకాలీన భారత సమాజంలో మన కళ్లముందర సాగుతున్నది.

1960ల చివరిరోజులలో నక్సల్బరీతో ప్రారంభించి అనేక రైతాంగ పోరాటాలు సాగాయి. ఆ పోరాటాలలో పెల్లుబికిన శక్తి అన్ని వ్యవస్థలనూ తుపానులా ముంచెత్తింది. విద్యావేత్తలు కూడ కదిలారు. పెట్టుబడిదారీ రైతు ఎక్కడున్నాడా అని వెతకడం మొదలుపెట్టిన రాజకీయార్థిక శాస్త్రవేత్తలు, రైతాంగ పోరాటాలను అధ్యయనం చేసిన సామాజిక శాస్త్రవేత్తలు, స్వాతంత్ర్యోద్యమంలో జాతి స్వభావాన్ని వెతికిన చరిత్రకారులు... ఇలా ఎన్నెన్నో అధ్యయనాలు జరిగాయి. దానితోపాటే మితిమీరిన ప్రత్యేక అధ్యయనాలూ, దానికి సంబంధించిన శ్రమవిభజన సాగాయనేది వేరేకథ. 1970ల మొదట్లో కలకత్తాలో వ్యవసాయ రంగపు రాజకీయార్థిక శాస్త్రం మీద జరిగిన సదస్సుతో మొదలుపెట్టి, దేశవ్యాప్తంగా ఆర్థిక వ్యవస్థలోని విడివిడి రంగాలమీద, ప్రాంతాల మీద రాజకీయార్థిక శాస్త్ర సదస్సులు జరిగాయి. ఈ సదస్సులలో చాల భాగం భారత సమాజపు వాస్తవికతను అర్థం చేసుకునే ప్రయత్నాలే అయినప్పటికీ, అవి మార్క్సిస్టు పరిశోధనా పరికరాల మీద చర్చగా ముగిసిపోయాయి.

ఇక్కడ ఒక ఉదాహరణ చూడండి: "వ్యవసాయరంగంలో పెట్టుబడిదారీవిధాన అభివృద్ధి – ఆంధ్రప్రదేశ్ అధ్యయనం" అనే యాభై పేజీల సుదీర్ఘమైన పత్రం ఒకటి ఉంది. 'ధనిక రైతులు, పెట్టుబడిదారీ రైతులు ఏకకాలంలో వ్యాపారాన్నీ, వడ్డీ వ్యాపారాన్నీ కొనసాగిస్తున్నారు. అలాగే వారు సట్టా వ్యాపారం కూడ చేస్తున్నారు. అందువల్ల ఈ తరహా పెట్టుబడిదారీ విధానాన్ని అర్థ–భూస్వామ్య పెట్టుబడిదారీ విధానం అనడం సమంజసం' అని ఆ రచయిత అంటారు. మరికాస్త ముందుకు వెళితే 'వ్యాపారంలో, వడ్డీవ్యాపారంలో, సట్టా కార్యకలాపాలలో ప్రతిఫలం రేటు ఎక్కువ ఉన్నంతవరకూ వ్యవసాయం నుంచి ఎక్కువ పెట్టుబడి అటు తరలిపోతుంది. ద్రవ్యచలామణీ రంగం నుంచి వ్యాపార, వడ్డీవ్యాపార పెట్టుబడిని తరిమివేసే బలమైన చర్యలు తీసుకోకపోతే, అది వ్యవసాయం నుంచి పెట్టుబడి మదుపును కొల్లగొడుతూనే ఉంటుంది. ప్రస్తుతం అనుత్పాదక, సాంఘిక, మత, తదితర ఆచారాల మీద చాల హెచ్చు మొత్తం ఖర్చవుతోంది. వాటిని అరికట్టి ఆ ధనాన్ని ఉత్పాదక రంగాల వైపు మళ్లించేందుకు చర్యలు తీసుకోవాలి' అని కూడ ఆయన అంటారు.

ఒక రంగం నుంచి మరో రంగానికి పెట్టుబడి తరలివెళ్లడానికి ప్రతిఫలం రేటే కారణమనే తప్పుడు వాదనను పక్కనపెడదాం. ఒకరంగం నుంచి మరోరంగానికి పెట్టుబడి తరలివెళ్లాలంటే రెండూ పెట్టుబడిదారీ రంగాలు అయి ఉండాలనే వాదననూ పక్కనపెడదాం. కాని, ఇక్కడ గుర్తించవలసిన ముఖ్యమైన విషయమేమంటే పెట్టుబడిదారీ సంబంధాలు నింపాదిగా అభివృద్ధి చెందుతుండడం, త్వరత్వరగా అభివృద్ధి చెందకపోవడం ఈ రచయితకు ఇబ్బంది కలిగిస్తున్నట్టుంది. ఈ చర్చలో పాల్గొన్న ఇతరుల లాగనే, ఈ రచయిత దృష్టిలో కూడ పెట్టుబడి అంటే ఒక వస్తువు, డబ్బు అనే అభిప్రాయం ఉన్నట్టుంది. కాని పెట్టుబడి ఒక సామాజిక సంబంధం.

ఈ రచయితకూ, ఇలాంటివాళ్లకు మాత్రం పెట్టుబడి ఒక రంగం నుంచి మరో రంగానికీ, ఒక ఊరి నుంచి మరో ఊరికీ తరలించగలిగిన, తరలించవలసిన వస్తువులా కనబడుతుంది. వీళ్లకు అది ఒక సంబంధం కాదు. సమస్త పెట్టుబడికీ మూలాధారమైన శ్రమశక్తి సొంతదారుల

**వీక్షణంలో అచ్చయిన ఆర్.ఎస్.రావు రచనలు**

| | |
|---|---|
| కేంద్ర బడ్జెట్ – మరో దృక్పథం | జూలై 16–31, 2004 |
| గౌరవప్రదమైన అభివృద్ధి | ఫిబ్రవరి 2007 |
| అభివృద్ధి – మార్క్సిస్ట్ దృక్పథం | అక్టోబర్ 2007 |
| ధరల పెరుగుదల – వ్యవస్థాగత సంక్షోభం | జూన్ 2008 |
| హింస – ప్రతిహింస – ఒక అవగాహన | అక్టోబర్ 2010 |

మీద తన అధికారం విస్తరించుకోవడానికి పెట్టుబడి సొంతదారులు ఉపయోగించే సంబంధం కాదు. తక్షణ ఉత్పత్తిదారులను వారి ఉత్పత్తి సాధనాల నుంచి దూరంచేసే సామాజిక సంబంధం కాదు. తద్వారా ఆ ఉత్పత్తిదారులు పెట్టుబడికి అధీనమైపోయి, మొత్తంగా పెట్టుబడికి లొంగిపోయేలా చేసే సామాజిక సంబంధం కాదు.

చాలమంది లాగనే ఈ రచయిత కూడ పెరిగిపోతున్న వ్యవసాయ కార్మిక జనాభా, పంపుసెట్ల వంటి ఆధునిక పరికరాలను ఉపయోగించే వారి సంఖ్య పెరిగిపోవడం వంటి గణాంకాల వాస్తవ ఆధారం మీద ఈ వాదనను నిర్మించి నిర్ధారణలకు వచ్చారు. కాని ఒక హైదరాబాద్ నిజాంకో, ఒక మైసూరు మహారాజాకో ఒక కార్ఖానా ఉన్నదనే వాస్తవం వారిని వారి భూస్వామిక స్థితి నుంచి పెట్టుబడిదారుల స్థితికి మార్చజాలదు. లేదా, ఆమాటకొస్తే బొబ్బిలి, చాట్రపల్లి, రంగాపురం జమీందారులు పంచదార కర్మాగారాలను 'నిర్మించినప్పటికీ' వారు పెట్టుబడిదారుల జాబితాలో చేరే అర్హత పొందలేదు. వారిని భూస్వాములుగా తయారు చేసినది వారికి ప్రజలతో ఉండిన సంబంధం, వారు ప్రజల మధ్య ప్రోత్సహించిన సంబంధాలు. వారు పెట్టిన కార్ఖానాలలోనైనా, వారి వ్యవసాయ క్షేత్రాలలోనైనా, బయటనైనా ప్రజల మధ్య ఉండిన సంబంధాలు.

ప్రజల మధ్య, శ్రామికుల మధ్య ఎటువంటి శ్రమ విభజనను ఒక యజమాని ప్రోత్సహిస్తాడు, సమర్థిస్తాడు అనేవే అక్కడ ఉత్పత్తి సంబంధాల స్వభావాన్ని నిర్ణయిస్తాయి. ఆ శ్రమ విభజన పెట్టుబడిదారీ విధాన స్వభావం కలిగి ఉందా, లేక అది పెట్టుబడిదారీ పూర్వ స్వభావం కలిగి ఉందా అనేదే ఉత్పత్తి సంబంధాలకు సంబంధించిన ముఖ్యమైన సామాజిక కోణం. మావో చెప్పినట్టు, 'ఆర్థిక శాస్త్రంలో ప్రధాన అధ్యయనాంశం ఉత్పత్తి సంబంధాలు. అదే సమయంలో రాజకీయార్థ శాస్త్రం, భౌతికవాద చారిత్రక దృక్పథం రెండూ కలిసి సాగేవే. అందువల్ల ఉపరితల సమస్యను విస్మరిస్తే ఆర్థిక పునాది, ఉత్పత్తి సంబంధాల సమస్యను స్పష్టంగా అర్థం చేసుకోవడం కష్టం.'

పైన ప్రస్తావించిన పత్ర రచయిత ఈ సామాజిక సంబంధాల సమాహారాన్ని, వాటిమధ్య పరస్పర సంబంధాలను విస్మరిస్తున్నారు. అనుత్పాదక, సాంఘిక, మత, తదితర ఆచారాల మీద హెచ్చు మొత్తంలో ఖర్చవుతున్నదని ఆయన వాపోతున్నారు. వాటిని అరికట్టి ఆ నిధులన్నిటినీ ఉత్పాదక పెట్టుబడిగా తరలించమని కోరుతున్నారు. రోగ లక్షణాన్నే ఆయన రోగంగా భ్రమ పడుతున్నారు. ఇక్కడ ఆ రచయిత చూడలేకపోతున్నదేమంటే పాలకవర్గాలు ఉద్దేశపూర్వకంగానే చాల తెలివిగా ఇటువంటి అనుత్పాదక వ్యయాన్ని ప్రోత్సహిస్తున్నాయి. ప్రధానంగా పెట్టుబడిదారీ పూర్వ ఉపరితలాన్ని పునరుత్పత్తి చేయడమే వాటి ఉద్దేశం.

భగవంతుడిని సరుకుగా మార్చడంలో సామ్రాజ్యవాద ప్రయోజనం ఉండవచ్చు, కాని అసలు భగవంతుడిని కొనసాగించడం భూస్వామ్య ప్రయోజనాన్ని పరిరక్షించడానికే. అది మానవమేధను లొంగదీయడానికి ఉపయోగపడుతుంది. మానవమేధ విముక్తి అయ్యే ప్రక్రియను అడ్డుకుంటుంది. కుల సంఘాలను వాడుకోవడం ద్వారా ధనిక రైతులు తమ సంకుచిత లాభాలు పొందుతున్నారేమో గాని, అసలు కుల సంఘాలు సమాజంలో భూస్వామిక విభజనను బలోపేతం చేస్తాయి. రాజ్య యంత్రాంగాన్ని వ్యక్తిగత అవసరాలకు వాడుకోవడం సామ్రాజ్యవాద ప్రయోజనాలకు ఉపయోగపడుతుందేమో గాని, అది అసలు రాజ్యానికి పెట్టుబడిదారీ విధానంలో ఉండవలసిన 'స్థానిక స్వయంప్రతిపత్తి'ని దెబ్బతీస్తుంది. అది సమాజంలోని వైరుధ్యాల మీద ముసుగు కప్పుతుంది. అందువల్ల, ఒక జాతీయ పెట్టుబడిదారీ దృష్టి నుంచి చూసినప్పుడు 'అనుత్పాదకం' గా కనబడే ఈ చర్యలన్నీ రాజ్యాధికారంపై అదుపు సాగించడానికి అవసరమైన సామాజిక పునాదిని కల్పించడానికే సాగుతున్నాయి.

ఈ సామాజిక సంబంధాలు వెనుకబడిన ఉపరితలాన్ని బలోపేతం చేస్తున్నాయి. ఆ ఉపరితలం తనకు పునాదితో ఉన్న సంబంధాన్ని మార్చుకుంటుంది. ఈ సామాజిక సంబంధాల మొత్తాన్ని అర్థం చేసుకోవాలంటే చలనంలో ఉన్న సమాజాన్ని సజీవంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది.

అయితే పత్ర రచయితలు సాధారణంగా చలనంలో ఉన్న సమాజాన్ని అధ్యయనం చేయడం గురించి మాట్లాడతారు గాని, ఆ పని వాళ్లెప్పుడూ ఆచరణలో పెట్టరు. చాల సందర్భాలలో వాళ్ళు దాన్ని విస్మరిస్తారు. భారత వ్యవసాయంలో ఉత్పత్తి విధానం గురించి జరిగిన చర్చను క్రోడీకరిస్తూ ఒక రచయిత, 'భారత వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం ప్రాబల్యంలో ఉందనడానికి ఏ సందేహమూ లేనట్టు కనబడుతుంది' అని ముగింపు పలికారు. ఇంకా 'వాస్తవ పోరాటాల నుంచి ఆచరణాత్మక పాఠాలు తీసుకుని వాటితో ఈ అధ్యయనాలను కలపాలని' పిలుపు ఇచ్చారు.

కాని ఈ క్రోడీకరణ అయినా, అంతకు ముందరి ప్రయత్నాలయినా అసలు అటువంటి పోరాటాలు ఉన్నాయని గుర్తించనే లేదు. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, బీహార్ లలో సమకాలీనంగా సాగుతున్న నిరుపేద రైతుల, వ్యవసాయ కూలీల పోరాటాలు ఈ అధ్యయనాలలో కనబడనే కనబడవు. కాని ఆ అధ్యయనాలు పెట్టుబడిని ఒక వస్తువుగా చూసి అది విస్తరిస్తున్నదని మాత్రం అంటాయి. ఈ రాష్ట్రాల నుంచి వస్తున్న నివేదికలన్నీ కూడ ఆయా ప్రాంతాలలో ఉన్న విభిన్న భూస్వామ్య శక్తుల గురించీ, ప్రయోజనాల గురించీ చెపుతున్నాయి.

ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్ గురించి బాలగోపాల్ రాసిన నివేదికలో, 'ఈ చిత్రం పెద్దపల్లిలో ఉన్న భూస్వామ్యానికి పూర్తిగా అద్దం పట్టదు... ఇక్కడ రైతులు దొర పొలాలలో వెట్టి చేయడం మాత్రమే కాదు – ఊరి శ్రామిక జనాలందరూ ఈ అక్రమానికి గురయినవారే – దీనికి తోడుగా శ్రామిక కుటుంబాల స్త్రీలు దొరల అత్యాచారాలకు బలికాక తప్పదు. దొర ముందు పనిపాటలవాళ్లు చొక్కా వేసుకోగూడదు, చెప్పులు వేసుకోగూడదు వంటి భూస్వామిక ఆచారాలెన్నో ఉన్నాయి. అవన్నీ కలిపితేనే పెద్దపల్లికి సంబంధించిన సంపూర్ణ చిత్రం అవగతమవుతుంది. ఇది నిజాంకాలంలోని చిత్రం కాదు, 1978 దాకా నడుస్తున్న చిత్రం' అన్నారు.

ఇక బీహార్ లోని పారస్ బీఘాలో జరిగిన హత్యాకాండ గురించి నివేదిక చూడండి. 'హత్యాకాండ తర్వాత వెనుకబడిన కులాల వారు జరిపిన ప్రతీకార దాడులు ఒక సూచన ఇస్తున్నాయి. ఈ రకంగా పెరిగే అవకాశం ఉన్న కుల ఘర్షణలు నిజమైన సమస్యలైన ఆర్థిక దోపిడీ, సాంఘిక అణచివేత వంటి సమస్యలను వెనుకకు తోసివేస్తాయి. మౌలిక ఘర్షణ వర్గాల మధ్య కాగా, తగాదా కులాల మధ్య జరుగుతుంది.'

చాల అభివృద్ధి చెందిన, చాల మంచి పాలన ఉన్నదని పేరున్న తమిళనాడు కూడ పోరాటం లేని నేపథ్యంలో కొన్ని వెనుకబడిన ప్రాంతాలలో ఇటువంటి వెనుకబడిన తనం చిత్రాన్నే ప్రదర్శించడం

ఆసక్తికరం, కాని ఈ ప్రాంతాలలోనే పోరాటం మొదలయిన తర్వాత వెనుకబడినతనం అంటే నిజమైన అర్థం బయటపడుతుంది. రాజ్యాధికారపు స్వభావం దాని నిజమైన రంగులలో బయటపడుతుంది. తమిళనాడు నుంచి వచ్చిన నివేదిక చూడండి. 'తిరుపత్తూరు తాలూకా లోని కదిరంపట్టి అనే చిన్న గ్రామం నక్సలైట్ ఉద్యమ పునర్విజృంభణకు దారితీసిన పరిస్థితులేమిటో చూపడానికి మంచి ఉదాహరణ. ఇక్కడ 170 సవర్ణ హిందూ కుటుంబాలు 300 హరిజన కుటుంబాలను సంపూర్ణంగా కట్టుబానిసలుగా పెట్టుకున్నాయి. ఇవాళ కూడ కదిరంపట్టిలో హరిజనులు చెప్పులు వేసుకుని, ధోవతి కట్టుకుని గ్రామ వీథుల్లో తిరగడానికి వీలు లేదు. వ్యవసాయ కూలీకి రోజువారీ కనీస వేతనం ఏడు రూపాయలు ఉండాలని నిబంధనలు ఉండగా, ఈ గ్రామంలో ఒక హరిజన కూలీకి సంవత్సరానికి రు. 350 ఇచ్చి, రోజూ రెండు పూటలా భోజనం పెట్టి పనిలో పెట్టుకుంటారు. ఈ పద్ధతిలో కూలీ ఇంటికి చేరే వేతనమే చాల తక్కువ అనుకుంటే, ఇంకా అన్యాయంగా, దీనిలో కొంతభాగాన్ని ముందుగా ఇచ్చి, దానికి వడ్డీ లెక్కకట్టి, మిగిలిన కూలీని ఆ వడ్డీగా చూపించే పద్ధతి కూడ ఉంది.'

ఆసక్తికరమైన విషయమేమంటే, ఒక సామాజిక ఉద్యమమేమో ఉన్న వాస్తవికతను ఇలా నగ్నంగా బయట పెడుతోంది. విద్యావేత్తలేమో పెట్టుబడిదారీ విధాన అభివృద్ధి మీద గణాంకాల మీద ఆధారపడి ఊహా సిద్ధాంతాలు అల్లుతూ ఉంటారు. దీన్నిబట్టే భౌతిక వాస్తవికతవైపు వెళ్లవలసిన అవసరం ఎంత ఎక్కువగా ఉందో అర్థమవుతుంది. వెళ్లవల సింది భౌతిక వాస్తవికతలో; ఆ వాస్తవికతను ప్రతిఫలించామని చెప్పుకునే గణాంకాల వైపుకాదు. మార్క్సిస్టు సూత్రీకరణలవైపు కూడ కాదు.

ఇక్కడ మార్క్స్ చేసిన ఒక వ్యాఖ్యను గుర్తు చేసుకోవడం అవసరం: 'వాస్తవ చరిత్ర నుంచి దూరమైన ఈ సాధారణీకరణలకు వాటంతటవిగా ఎటువంటి విలువా లేదు. చారిత్రక సమాచారంలో విడివిడిగా ఉన్న శ్రేణుల మధ్య ఒక వరుసక్రమం ఉన్నదని చూపడానికి, వాటిని క్రమపద్ధతిలో పేర్చడానికి మాత్రమే సాధారణీకరణలు ఉపయోగ పడతాయి. తత్వశాస్త్రంలో చేసినట్టుగా, చారిత్రక యుగాలను పద్ధతి ప్రకారం పేర్చిపెట్టడానికి ఈ సాధారణీకరణలు ఎటువంటి సూత్రాన్నీ, ఆదేశాలనూ ఇవ్వజాలవు. అందుకు భిన్నంగా, ఎవరైనా గత చరిత్ర గురించి గాని, వర్తమానం గురించి గాని దొరుకుతున్న సమాచారాన్ని పరీక్షించడానికి, వరుసలో పేర్చడానికి, దాన్ని కాపాడడానికి ప్రయత్నిస్తే ఇబ్బందులు ఎదురవుతాయి. ఈ ఇబ్బందులను అధిగమించే క్రమం మొత్తాన్నీ ఇక్కడ వివరించలేను గాని, వాస్తవ జీవిత క్రమాన్ని అధ్యయనం చేయడం, అంటే ఆ యుగంలోని వ్యక్తుల కార్యాచరణను అధ్యయనం చేయడం మాత్రమే ఆ ఇబ్బందులను తొలగిస్తుందనేది మాత్రం స్పష్టం.'

మనం ఏ నమూనాలు, ప్రాతిపదికలు, సూత్రాలు తయారు చేసుకున్నా అవన్నీ వాస్తవ చరిత్రకు అద్దంలోని ప్రతిబింబాలు మాత్రమే. ఎన్ని నమూనాలు, ప్రాతిపదికలు, సూత్రాలు చదివినా, వాస్తవ జీవితాన్ని చదవడానికి ప్రత్యామ్నాయం కాజాలవు. దీన్ని మరోమాటల్లో చెప్పాలంటే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని భౌతికీకరించడం ఇవాళ అవసరం. శ్రీశ్రీ అన్నట్టు 'భూమార్గం పట్టిస్తాను, భూకంపం పుట్టిస్తాను' అనవలసిందే. స్థిరమైన భౌతికవాదులుగా మార్క్సిస్టులు, చలనంలో ఉన్న భారత సమాజాన్ని అధ్యయనం చేయడం మీదనే కేంద్రీకరించవలసి ఉంది.

భారత సమాజం రెండు దోపిడీల కింద నలిగిపోతోంది. ఒకటి సామ్రాజ్యవాద, పెట్టుబడిదారీ దోపిడీ. రెండవది భూస్వామ్య దోపిడీ. ఈ రెండు దోపిడీ క్రమాలు కలగలిసిన స్థలం ద్రవ్య చలామణీ ప్రక్రియ. అక్కడే ఈ రెండు దోపిడీ ప్రక్రియలకు ఉమ్మడి ప్రయోజనాలున్నాయి. ఈ రెండు దోపిడీ క్రమాల ప్రభావాన్ని అత్యధికంగా అనుభవిస్తున్నది పేదరైతులు, వ్యవసాయ కూలీలు. ఈ రెండు వర్గాలు కూడ పెట్టుబడి ప్రారంభించిన ఉత్పత్తి ప్రక్రియలో భాగంగా ఆర్థిక పీడనకు గురవుతున్నారు. వారు ఆర్థికేతర పీడనకు కూడ గురవుతున్నారు. ఈ ఆర్థికేతర పీడన ఆయా ప్రాంతాన్ని బట్టి, ఒక్కో చోట కౌలు, వెట్టి, వడ్డీ వంటి రూపాలలో మిగులును సొంతం చేసుకునే ప్రక్రియగానో, లేదా ఉపరితలాన్ని వాడుకుని చలామణీ రంగంలో మిగులును సొంతం చేసుకునే ప్రక్రియగానో ఉంది. వ్యవసాయ ఖర్చు పెరిగిపోతున్నదనో, వ్యవసాయంలో తక్కువ మిగులు ఉంటుందనో కారణంతో ఒక పేదరైతు తన భూమిని కోల్పోవచ్చు. ఇది ఆర్థిక పీడన రూపం. ఇది పెట్టుబడిదారీ ప్రక్రియలో భాగం. మరొకపక్క ఆ రైతే తిరుపతికో, శబరిమలకో వెళ్ళడానికి అప్పుచేసి, ఆ అప్పు తీర్చడానికి తన భూమి కోల్పోవచ్చు. లేదా వేంకటేశ్వరస్వామి సినిమాలు చూస్తూనో, ప్రభుత్వ సారా దుకాణం లో సారా తాగుతూనో అప్పులపాలై తన భూమి పోగొట్టుకోవచ్చు. ఇటువంటి రూపాలన్నీ ఆర్థికేతర పీడన ప్రక్రియలో భాగం.

ఈ సమాజంలో ఒక పేద రైతు సరిగ్గా ఏ కారణాల వల్ల తన భూమి కోల్పోతున్నాడు? ఏ రకంగా సమాజపు అంచులలోకి నెట్టబడు తున్నాడు? వ్యవసాయ కూలీలు ఏ రకంగా అప్పుల పాలవుతున్నారు? గోండులు, కోయలు ఏ రకంగా తమ భూములను కోల్పోయారు, లేదా కోల్పోతున్నారు? ఈ వర్గాలన్నీ ఎలా సమాజపు అంచులలోకి నెట్టివేయ బడుతున్నాయి? ఇవన్నీ చరిత్రలో భాగం. ఈ ప్రజల చరిత్రపైననే, 'వెనుకబడిన ప్రాంతాల'లోని, 'వెనుకబడిన ప్రజల' చరిత్ర పైననే భౌతికవాద చరిత్రకారులు తమ దృష్టి కేంద్రీకరించవలసి ఉంది.

శ్రీశ్రీ అన్నట్టు 'సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుల సాహస మెట్టిది? ప్రభువెక్కిన పల్లకి కాదోయ్, అది మోసిన బోయీలెవ్వరు? ... పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను.'

ఈ ప్రజల భాషే, ఈ ప్రజల సంస్కృతే, ఈ ప్రజల సాంకేతిక పరిజ్ఞానమే, ఈ ప్రజలు ఎదుర్కొంటున్న వైరుధ్యాలే, ఈ ప్రజలను అంచులలోకి తోస్తున్న వైరుధ్యాలే నూతన సమాజానికి పునాది నిర్మిస్తాయి.

ఈ ప్రజలతో ప్రజాస్వామికంగా మమేకం కాకుండా ఈ అంశాలను అధ్యయనం చేయడం సాధ్యం కాదు. అటువంటి నూతన ప్రజాస్వామిక ప్రక్రియే బైరాన్ పల్లి ప్రజల వీరోచిత పోరాట చరిత్రను మళ్లీ వెలుగులోకి తెచ్చింది, ఆ ప్రజలు దాన్ని ఎలా గుర్తుంచుకున్నారనేదే చాల ముఖ్యం. అటువంటి నూతన ప్రజాస్వామిక ప్రక్రియే 'కిసింగార్ వెంతా' లాంటి కథలు రాయవలసిన అవసరం కల్పించింది. అటువంటి నూతన ప్రజాస్వామిక ప్రక్రియే "రగల్ జెండా" బ్యాలేలో విస్మృత భాషను వినిపించింది. సింగరేణి కథలను బైటికి తెచ్చింది. ఆ నూతన ప్రజాస్వామిక ప్రక్రియే దొరలను సంఘబహిష్కారం చేయడం అనే కొత్త పోరాట రూపాన్ని ముందుకు తెచ్చింది. ఆ నూతన ప్రజాస్వామిక ప్రక్రియే గోండులకూ మనకూ కూడ కేస్లాపూర్ జాతరను కొత్తగా అర్థం చేయించింది. ఈ సమాజంలోని 'వెనుకబడిన' వర్గాలకే చరిత్ర ఉంది. మనం చరిత్ర నిర్మాణంలో పాల్గొనదలచుకుంటే ఆ చరిత్రను అధ్యయనం చేయవలసి ఉంది. వీ

*అర్థశాస్త్రవేత్త, అధ్యాపకుడు, కాకతీయ విశ్వవిద్యాలయ మాజీ వైస్ చాన్సలర్, తెలంగాణ ఉద్యమ సిద్ధాంతకర్త* **ప్రొఫెసర్ కొత్తపల్లి జయశంకర్** *76వ ఏట జూన్ 21 న కన్నుమూశారు. ఆయన చదువుకున్న వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి ప్లాటినమ్ జూబిలీ సంబరాల సంచిక 'సముద్ర' లో 2005లో ఆయన రాసిన ఇంగ్లిష్ వ్యాసానికి అనువాదం*

# నా విద్యాలయం - తెలంగాణ ఆకాంక్ష

చరిత్రలోని ఘటనలు ప్రతి సంస్థనూ ప్రభావితం చేస్తాయి. కాగా కొన్ని సంస్థలు చరిత్ర గమనాన్నే ప్రభావితం చేస్తాయి. అవి విద్యా కేంద్రాలయినప్పుడు ఈ ప్రభావం మరింత ఎక్కువ. ప్రస్తుతం కాకతీయ విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉన్న వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి నిస్సందేహంగా అటువంటి సంస్థల కోవకే చెందుతుంది.

అర్ధ శతాబ్దానికి వెనుక ఇంటర్మీడియట్ విద్యార్థిగా ఆ కళాశాలలో చదువుకునే అదృష్టం నాకు కలిగింది. విద్యార్థిగా గడిపిన ఆ కాలం అనేక రకాలుగా చిరస్మరణీయమైనది. నా జీవితంలో నేను ఏ కొద్దిపాటి సాధించినా నన్ను అందుకు తీర్చిదిద్దినది ఆ కాలమే. బాల్యం నుంచీకూడ ఈ మహత్తర విద్యాసంస్థ అభివృద్ధికి సాక్షిగా ఉండడం, ఈ సంస్థ అభివృద్ధి ప్రయత్నాలలో కొన్నిసార్లు భాగస్వామిని కావడం నా భాగ్యం.

ఈ కళాశాల ప్లాటినమ్ జూబిలీ ఉత్సవాలు జరుపుతున్నామని ప్రొ. గోపాలరెడ్డి నుంచీ, ఆయన సహచరుల నుంచీ విని నేను చాల సంతోషించాను. కాని ఈ సంస్థతో నా జ్ఞాపకాలను ప్రతిఫలిస్తూ వ్యాసం రాయమని అడిగినప్పుడు కాస్త ఇబ్బంది పడ్డాను. ఈ సంస్థతో నా అనుబంధం ఎంత సుదీర్ఘమైనదీ, సన్నిహితమైనదీ, విస్తృతమైనదీ అంటే, ఎక్కడ మొదలుపెట్టాలో, ఎప్పుడు ముగించాలో నాకు తెలియదు. అయినా ఈ సంస్థకు సంబంధించిన నా అనుభవాలను, అవగాహనలను ఈ తరంతో పంచుకోవడం అవసరమని నాకు అనిపించింది. ఈ సంస్థ తెలంగాణ అస్తిత్వానికి మూర్తీభవ రూపం. తెలంగాణ ఆరాటాలకూ పోరాటాలకూ, కష్టాలకూ విజయాలకూ, ఆశలకూ ఆకాంక్షలకూ ఇది ప్రతిరూపం.

ఈ కళాశాల ప్రారంభం గత శతాబ్ది మొదటి దశకాలలో జరిగింది. ఇంటర్మీడియట్ స్థాయిలో ఆర్ట్స్, సైన్స్ కోర్సుల కోసం నిజాం ప్రభుత్వం స్థాపించిన ఈ కళాశాల మొత్తం తెలంగాణలో మొదటిది. హైదరాబాద్ మినహాయిస్తే తెలంగాణలో మరొకచోట ఈ స్థాయి కళాశాల లేదు. అదే సమయంలో ఇటువంటివే మరొక రెండు కళాశాలలను ఔరంగాబాద్ లోనూ గుల్బర్గాలోనూ కూడ స్థాపించారు. అంటే పాత నిజాం రాజ్యంలో తెలంగాణతో పాటు మరాఠ్వాడ, కర్నాటక ప్రాంతాలలో కూడ కళాశాల విద్య అవసరాలను తీర్చడానికి పూనుకున్నారు. నిజాం మీద ఎన్ని నిందలు ఉన్నప్పటికీ, రాజ్యంలోని విభిన్న ప్రాంతాలమధ్య సమాన అవకాశాల పంపిణీకి ఇది చిహ్నం.

ఈ కళాశాలను మొదట ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉస్మానియా ఇంటర్మీడియట్ కాలేజి అని పిలిచేవారు. ప్రస్తుతం హనుమకొండలో ప్రభుత్వ బాలుర జూనియర్ కళాశాల ఉన్న భవనంలో మొదట దీన్ని ప్రారంభించారు. ఆ తర్వాత దానికి ఎదురుగా రోడ్డుకు అవతలివైపు ఉన్న భవనంలోకి మారింది. ఆ భవనం ఇప్పుడు లేదు. 1940ల చివరిలో కళాశాలను వడ్డెపల్లి రోడ్డు మీద పింగళి వారి దగ్గర అద్దెకు తీసుకున్న రెండు భవనాలలోకి మార్చారు. చివరికి ప్రస్తుతం ఉన్న భవనంలోకి, అప్పటిదాకా జిల్లా కలెక్టర్ భవనంగా ఉన్న దానిలోకి మార్చారు.

అప్పుడు బోధనా మాధ్యమం ఉర్దూ. నిజానికి ఆ రోజుల్లో ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వైద్యం, ఇంజనీరింగ్, వ్యవసాయం, న్యాయశాస్త్రం, విద్య వంటి వృత్తివిద్యలతో సహా అన్ని స్థాయిలలోనూ బోధనా భాష ఉర్దూనే. అనేక రంగాలలో నిష్ణాతులైన ఎందరో మహానుభావులు ఈ విద్యావిధానం నుంచే పైకి వచ్చారని గుర్తు చేసుకోవడం అవసరం. 1950ల దాకా ఈ పద్ధతే కొనసాగింది. ఆతర్వాత విశ్వవిద్యాలయ స్థాయిలో బోధనాభాషగా ఇంగ్లిషును ప్రవేశ పెట్టారు. 1960లలో అండర్ గ్రాడ్యుయేట్ స్థాయిలో మరొక బోధనా భాషగా తెలుగును కూడ ప్రవేశపెట్టారు.

1948 దాకా అధ్యాపకులు, విద్యార్థులు కూడ యూనిఫామ్ ధరించవలసి ఉండేది. ఆకాశనీలం రంగులో షేర్వాని గాని, కోటు గాని, తెల్ల రంగులో పైజామా గాని, ధోవతి గాని, పాంటు గాని వేసుకోవలసి ఉండేది. టోపీ పెట్టుకోవడం కూడ తప్పనిసరి.

ఈ కళాశాల నుంచే 1968లో పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్ ప్రారంభమైంది. అది చివరికి 1976లో పూర్తిస్థాయి విశ్వవిద్యాలయంగా మారింది. అంటే కాకతీయ విశ్వవిద్యాలయమే ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి నుంచి పుట్టింది గాని విశ్వవిద్యాలయం నుంచి ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి పుట్టలేదు.

ఇదంతా ఈ కళాశాల పుట్టుక, పెరుగుదల, అభివృద్ధి గురించిన స్థూలమైన కాలక్రమ పట్టిక మాత్రమే. తెలంగాణలో ఉన్నత విద్యా రంగంలో అత్యంత గర్వకారణమైన స్థాయికి ఎదిగిన ఈ సంస్థ ఉజ్వల చరిత్ర గురించి తెలుసుకోవలసినది ఎంతో ఉంది.

విచిత్రమేమంటే, నిజాం ఏర్పాటు చేసిన ఈ కళాశాలే 1930లలో, 40లలో నిజాంపాలనకూ, ఆయన సాగించిన భూస్వామ్య

రాజ్యానికీ వ్యతిరేకంగా పోరాడే యువతరాన్ని తయారుచేసే కేంద్రంగా మారింది. ఆ రోజుల్లో ఈ కళాశాల విద్యార్థి అయిన పి వి నరసింహారావు, ఆ నాటి యోధులైన కాళోజీ నారాయణ రావు, దాశరథి కృష్ణమాచార్యలతో కలిసి హైదరాబాద్ రాజ్యాన్ని విముక్తి చేసే ఉద్యమంలోకి దూకారు. ఆ క్రమంలో ఆయన తన చదువులను అర్ధాంతరంగా వదిలిపెట్టి, వరంగల్ వదిలి వెళ్లవలసి వచ్చింది. పొరుగున ఉన్న బ్రిటిషిండియాలోని నాగపూర్ లో ఆశ్రయం పొంది తన చదువును అక్కడే కొనసాగించవలసి వచ్చింది. 1940ల చివరిలో తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటం ఈ ప్రాంతాన్ని ముంచెత్తి, మొత్తం దేశాన్నే కదిలించినప్పుడు, ఆ పోరాటానికి ప్రేరణనిచ్చిన మేధో సంపద ఈ కళాశాలలో వేళ్లూనుకున్నదే. నిజానికి ఈ కారణాలవల్లనే ఈ కళాశాలలో మాత్రమే కాదు, మొత్తంగా ఈ ప్రాంతంలోనే నిజమైన ప్రజాస్వామిక సంస్కృతి మొగ్గ తొడగడానికి అవకాశం వచ్చింది. అది విభిన్నమైన ఆలోచనా ధోరణులకు కేంద్రంగా మారింది. ప్రధానంగా ప్రగతిశీల స్వభావం కలిగిన ఆలోచనా ధోరణులు సాహిత్య, రాజకీయ, తాత్త్విక, సామాజిక చింతనా రంగాలలో పరిఢవిల్లాయి. ఏళ్లు గడుస్తున్నకొద్దీ ఈ సంప్రదాయం మొత్తంగా తెలంగాణకూ ప్రత్యేకించి వరంగల్ కూ నిర్దిష్టమైన సాంఘిక, రాజకీయ అస్తిత్వాన్ని నిర్దేశించాయి. ఇవాళ తెలంగాణకూ వరంగల్ కూ ఆ గుర్తింపే ఉంది.

ఈ కళాశాలకు సంబంధించిన ప్రత్యేక అస్తిత్వానికి మరొక కోణం ప్రత్యేక రాష్ట్రం కోసం తెలంగాణ ప్రజలు జరుపుతున్న పోరాటాన్ని ప్రారంభించడంలో, విస్తరించడంలో, కొనసాగించడంలో ఈ కళాశాల నిర్వహించిన, నిర్వహిస్తున్న అవిభాజ్యమైన పాత్ర.

ప్రత్యేక రాష్ట్రం కావాలనే తెలంగాణ ప్రజల ఆకాంక్ష కొత్త పరిణామం కాదని ఈ సందర్భంలో గుర్తు చేసుకోవాలి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడడానికన్న ముందే ఆ ఆకాంక్ష వ్యక్తమయింది. ఆ తర్వాత కూడ అది వ్యక్తీకరణ పొందుతూనే ఉంది. పాత ఆంధ్ర రాష్ట్రంతో కలిసి ప్రస్తుత ఆంధ్రప్రదేశ్‌గా ఏర్పడడానికి తెలంగాణ ప్రజలు చూపిన వ్యతిరేకతకు మూలం విశాల రాష్ట్రంలో తాము దోపిడీకి గురవుతామనే భయమే. కొనసాగుతున్న రాష్ట్రంలో భాగంగా ఉండడానికి చూపుతున్న ప్రతిఘటనకు కారణం గత యాభై సంవత్సరాలలో దోపిడీకి గురయిన వాస్తవ అనుభవమే. అందువల్లనే ప్రత్యేక రాష్ట్ర వాంఛ అనేక రూపాలలో కొనసాగుతోంది, వ్యక్తీకరణ పొందుతోంది.

ఈ ఉద్యమం వాస్తవంగా 1952–53లో ప్రారంభమైంది. అప్పుడు తెలంగాణ ప్రజలపట్ల కళాశాలలోని కొందరు అధ్యాపకులు చూపిన అభ్యంతరకరమైన ప్రవర్తనను ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి విద్యార్థులు తీవ్రంగా ప్రతిఘటించారు. పాత మద్రాసు సంయుక్త రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతానికి చెందిన ఆ అధ్యాపకులు, లాభసాటి అవకాశాల కోసం, బతుకుదెరువు కోసం తెలంగాణకు వలస వచ్చినవారే. ఈ వలస – నిజం చెప్పాలంటే దురాక్రమణ – 1948 సెప్టెంబర్ 17న నిజాం పతనమైన తర్వాత, పాత హైదరాబాద్ రాష్ట్రాన్ని భారత యూనియన్ లో విలీనం చేసిన తర్వాత ప్రారంభమై, అడ్డూ ఆపూ లేకుండా సాగింది. ఆ సమయంలో హైదరాబాద్ రాష్ట్రానికి కేంద్ర ప్రభుత్వం నియమించిన సైనిక, పౌర అధికార పాలకులు ఉండేవారు. సరిగ్గా ఆ కాలంలోనే పెద్దఎత్తున ఆంధ్రా వారు – ఆరోజుల్లో వారు మద్రాసు రాష్ట్రానికి చెందినవారు కాబట్టి మద్రాసీలు అని పిలిచేవారు – తరలివచ్చారు. ఈ ప్రాంత ప్రజలకు ప్రాతినిధ్యం వహించే, ప్రజాస్వామికంగా ఎన్నికైన ప్రజాప్రతినిధులు గాని, ప్రభుత్వం గాని లేనందువల్ల, ఇలా వలస వచ్చిన ఆంధ్రా వారు ఈ ప్రాంతంలో ఉన్న ఉద్యోగావకాశాలన్నిటినీ తప్పుడు పద్ధతులద్వారా ఆక్రమించుకున్నారు. అది అక్కడితో అయిపోలేదు. వారి ప్రవర్తన, కనీసంగా చెప్పాలన్నా, దుర్మార్గంగా ఉండేది. వాళ్లు ప్రతి పనిలోనూ, ప్రతి జీవన రంగంలోనూ స్థానిక ప్రజలకన్న తామే అధికులమని భావించేవారు. తెలంగాణ ప్రజలు అసమర్థులని, సోమరులని, తక్కువ నాగరికులని, మొరటు వాళ్లని అభిప్రాయం కలిగించడానికి నిరంతర ప్రచారం చేస్తుండేవారు. చివరికి ఈ ప్రాంతపు భాషను, యాసను, నుడికారాన్ని కూడ చిన్నచూపు చూస్తూ ఇది భాషాపరంగా తక్కువస్థాయిదన్నట్టు ప్రవర్తించేవారు. మరొకపక్క మద్రాసు రాష్ట్రం నుంచి తెలంగాణకు తరలివచ్చి, ఇబ్బందులుపడుతూ, ఈ స్థానిక అలగా జనానికి నాగరికత నేర్పే పవిత్ర కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నట్టు ప్రవర్తించేవారు. ఈ ప్రాంతంలోకి నిరాటంకమైన వలసలకు అవకాశం ఇచ్చే విశాలాంధ్ర రాష్ట్రాన్ని నిర్మించాలనే ప్రచారం కూడ వాళ్లు అప్పుడే ప్రారంభించారు. ఆ విశాలాంధ్రే ఆంధ్రప్రదేశ్‌గా రూపాంతరం చెందింది. ఈ రకమైన దురహంకారపూరిత, అవమానకరమైన దాడిని 1952 నాటికే స్థానిక ప్రజలు సహించలేని స్థితి వచ్చింది. స్థానిక ప్రజలు ఆగ్రహానికి గురికావడం మొదలయింది. సరిగ్గా అప్పుడే బూర్గుల రామకృష్ణరావు ముఖ్యమంత్రిగా ఎన్నికైన ప్రజాప్రభుత్వం ఏర్పడి పాలన ప్రారంభించింది. ప్రజాస్వామిక పాలన ఏర్పడడంతో ప్రజల ప్రతిఘటన మరింత పెరిగింది. కాని ఆంధ్రా వారి ఆగడాలు తగ్గలేదు సరిగదా, విశాలాంధ్ర ఏర్పాటు చేయాలనే ప్రయత్నాలు ముమ్మరమయ్యాయి. ఆ ప్రక్రియలో భాగంగానే ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజిలో పనిచేసే కొందరు అధ్యాపకులు ప్రఖ్యాత ఆంధ్ర నాయకులు అయ్యదేవర కాళేశ్వర రావును కాలేజికి తీసుకురాదలిచారు. ఆంధ్రతో తెలంగాణ విలీనం కావలసిన అవసరమూ దాని వల్ల మేలూ ఆయన చేత విద్యార్థులకు చెప్పించాలని ఆలోచించారు.

1952 చివరిలో కాళేశ్వరరావు ఈ విశాలాంధ్ర ప్రచార కార్యక్రమంలో భాగంగా వరంగల్ వచ్చారు. అప్పుడే ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజిలో ఆయన ఉపన్యాసం ఏర్పాటు చేశారు. దురుసు వ్యాఖ్యలు చేయడం కాళేశ్వరరావుకు సహజమైన అలవాటు. అలాగే ఆయన ఆరోజు ఉపన్యాసంలో తెలంగాణ గురించీ, తెలంగాణ ప్రజల గురించీ కొన్ని అవమానకరమైన వ్యాఖ్యలు చేసినప్పుడు శ్రోతలు తీవ్రమైన అభ్యంతరం తెలిపారు. ఆ సభ ఏర్పాటు చేయడంలో ప్రధాన పాత్ర వహించిన ఆంధ్ర వలస అధ్యాపకులు కళాశాల అధ్యాపకుల్లా, తెలంగాణలోని ఒక ప్రజాసంస్థ ఉద్యోగుల్లా కాక, విశాలాంధ్ర కార్యకర్తల్లా ప్రవర్తించారు. దానితో అక్కడ పరిస్థితి ఉద్రిక్తంగా మారిపోయింది. చేయి దాటి పోయింది. అక్కడి నుంచి కాళేశ్వరరావును క్షేమంగా బయటికి తప్పించడానికి నిర్వాహకులు పోలీసు బలగాన్ని ఆశ్రయించారు. విద్యార్థి బృందాన్ని చెదరగొట్టడానికి పోలీసులు లాఠీచార్జి చేశారు. ఆ లాఠీచార్జిలో ఎందరో విద్యార్థులు గాయపడ్డారు. అలా ఆరోజు గాయపడిన విద్యార్థులలో నేను కూడ ఉన్నాను. నాకు తెలిసినంతవరకు, ప్రత్యేక

# నటరాజ రామకృష్ణ



ఆంధ్ర నాట్యానికి, పేరిణి శివతాండవానికి ప్రాణం పోసిన ప్రముఖ నాట్యాచార్యులు నటరాజ రామకృష్ణ (88) హైదరాబాద్‌లోని నిమ్స్ ఆస్పత్రిలో అనారోగ్యంతో చికిత్స పొందుతూ జూన్ 7న మరణించారు. ఆయన ఇండోనేషియాలోని బాలీ ద్వీపంలో జన్మించారు. ఆయన అసలు పేరు రామకృష్ణ మాత్రమే. 'నటరాజ' అనేది ఆయన బిరుదు. గత యాభై సంవత్సరాలుగా ఆంధ్రప్రదేశ్‌లో నాట్య కళను ప్రచారం చేయడానికీ, నర్తకులను తయారు చేయడానికీ, కనుమరుగు అయిపోయిన నాట్య రూపాలను పునరుద్ధరించడానికీ ఆయన తన జీవితమంతా ధారపోశారు. కాకతీయ సామ్రాజ్య కాలంలో ప్రాచుర్యంలో ఉండి, రామప్ప ఆలయంలో శిల్పాలుగా నమోదు కూడా అయి ఆ తరువాత కాలగర్భంలో కలిసిపోయిన పేరిణి శివతాండవం వంటి నృత్య రూపాలను ఆయన తిరిగి ప్రజలకు పరిచయం చేశారు. నాట్యంపై యాభైకు పైగా పుస్తకాలు రచించారు. ఆయన చేసిన కృషిపై ఇరవై ఐదు దాకా సిద్ధాంత వ్యాసాలు ఉన్నాయి. తారామతి-బరాదరి కళాకేంద్రంగా రూపొందడంలో ఆయన కృషి ఉంది. ప్రేమావతి నాట్యం, సంగీతంపై ఆయన చేసిన అధ్యయనం, రాసిన పుస్తకాలు, ప్రభుత్వానికి సమర్పించిన వినతి పత్రాలు, ప్రతిపాదనలు అనేకం. ఆయన బ్రహ్మచారిగానే జీవించారు. 1975 ప్రాంతంలో రాష్ట్రవ్యాప్తంగా గల నృత్య కళాకారులందరినీ ఆహ్వానించి నిర్వహించిన ప్రదర్శన రీతుల సదస్సు ఒక డాక్యుమెంట్‌గా నిలిచిపోయింది. రాష్ట్ర సంగీత నాటక అకాడమీ అధ్యక్షుడుగా నటరాజ రామకృష్ణ తెలుగు ప్రాంతంలోని సమస్త కళా రూపాలు, జానపద అంశాలు వికసించడానికి పునాదులు వేశారు. హైదరాబాద్ ఆవిర్భావం ముందూ తర్వాతా దక్కన్ పీఠ భూమిలోని కళారూపాలపై ఆయన చేసిన అధ్యయనం ఎన్నెన్నో కొత్త విషయాలను వెలికి తెచ్చింది. శ్రీలంకతో మొదలుపెట్టి తూర్పు తీర ప్రాంతాలలోని అన్ని కళా రూపాలను వంట బట్టించుకుని భావి తరాలకు మహత్తర వారసత్వాన్ని అందించారు. ఆయన 'పద్మశ్రీ' బిరుదును అందుకున్నారు.

రాష్ట్రాన్ని కోరుతూ ప్రారంభమైన తెలంగాణ ఉద్యమానికి అదే నాంది.

ఈ సంఘటన గురించిన వార్త తెలంగాణ అంతటా కార్చిచ్చులా వ్యాపించింది. మొత్తంగా తెలంగాణ ప్రజానీకం, ప్రత్యేకించి విద్యార్థులు, ప్రభుత్వోద్యోగులు, ఈ ఘటన మీద గళమెత్తారు. వలస వచ్చిన ఉద్యోగులను వెనక్కి పంపించాలని కోరడం మొదలుపెట్టారు. ఆ రోజుల్లో అమలులో ఉన్న చట్టాల, నిబంధనల ప్రకారం ఈ వలస వచ్చిన ఉద్యోగులను నాన్ ముల్కీలు (స్థానికేతరులు) అని పిలిచేవారు. అందువల్ల అప్పటి ప్రధాన నినాదం "నాన్ ముల్కీస్ గో బ్యాక్" అని ఉండేది. ఈ పరిణామం చరిత్ర పుస్తకాలలో నాన్ ముల్కీ ఆందోళనగా నమోదయింది. ఉద్యోగావకాశాలను చేజిక్కించుకోవడంతో పాటు, వలసవాదులు తెలంగాణ సామాజిక సాంస్కృతిక అంశాలమీద కూడ దాడి చేశారు గనుక అందుకు ప్రతిగా "ఇడ్లీ సాంబార్ గో బ్యాక్", "గోంగూర పచ్చడి గో బ్యాక్" వంటి నినాదాలు కూడ పుట్టుకొచ్చాయి. ఈ ఆందోళన చాల వేగంగా విస్తరించి ఒక విశాల ప్రజాఉద్యమంగా మారింది. ఈ ఉద్యమ క్రమంలోనే హైదరాబాద్ లో అఫ్జల్ గంజ్ దగ్గర ఒక విద్యార్థి ప్రదర్శన జరపాలని తలపెట్టారు. ఆ ప్రదర్శన శాంతిభద్రతలకు విఘాతం కలిగిస్తుందనే అనుమానంతో పోలీసు బలగాలు తెలంగాణలోని వివిధ ప్రాంతాల నుంచి వస్తున్న విద్యార్థులను అడ్డుకోవడానికి ప్రయత్నించారు. ఆ ఘర్షణ చివరికి పోలీసు కాల్పులకు దారితీసి చాలమంది విద్యార్థులు మరణించారు. ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి నుంచి హైదరాబాద్ వెళ్లడానికి బయల్దేరిన విద్యార్థి బృందంలో నేను కూడ ఉన్నాను. మా బస్సు మార్గమధ్యంలో చెడిపోవడం వల్ల మేం సమయానికి హైదరాబాద్ చేరలేకపోయాం. ఒకవేళ చేరిఉంటే బహుశా నాకు కూడ తెలంగాణ అమరవీరుల జాబితాలో చేరే అదృష్టం పట్టి ఉండేది. ఎన్నో దశాబ్దాలుగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో తెలంగాణ ప్రజలు అనుభవిస్తున్న దుస్థితికి నిస్సహాయ సాక్షిగా ఉండే వేదనను తప్పించుకునేవాణ్ని.

ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి నుంచి అభివృద్ధి అయిన కాకతీయ విశ్వవిద్యాలయం ఆ వారసత్వాన్ని కొనసాగిస్తోంది. తెలంగాణ ఉద్యమాన్ని విస్తరించడానికి అవసరమైన మేధోకానుకలను అందించడం లో అగ్రభాగాన ఉంది.

ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజిలో పుట్టిన తెలంగాణ ఉద్యమంతో పాటే, ఆ కాలేజిని డిగ్రీ కాలేజిగా స్థాయి పెంచాలని విద్యార్థులు ప్రారంభించిన ఉద్యమం కూడ రూపు దిద్దుకుంది. ఆ ఉద్యమంలో కూడ నేను చురుకుగా పాల్గొన్నాను. ఇంటర్మీడియట్ అయిపోయిన తర్వాత పైచదువులకు మా కుటుంబం నన్ను హైదరాబాద్‌కు పంపిస్తుందో లేదోననే అనుమానం వల్ల, వరంగల్ లో పైస్థాయి కాలేజిని కోరడంలో నా స్వార్థం కూడ ఇమిడి ఉంది. అయితే, ప్రతిఒక్కరూ ఆ ఇంటర్మీడియట్ కాలేజిని డిగ్రీ కాలేజిగా మార్చాలని కోరుతుండగా, ఒకరోజు నేను మరీ ఉద్రేకపడి, వరంగల్ లో అసలు విశ్వవిద్యాలయమే పెట్టాలని అడిగాను. మాకు ఉర్దూ మీడియంలో అర్థశాస్త్రం బోధించే అధ్యాపకులు ఒకరు దీని గురించి తెలిసి, "యే పోట్టా పాగల్ హో గయా క్యా" (ఈ పిల్లవాడికి పిచ్చి లేచిందా?) అన్నారు. 1950ల మధ్య దాకా ఆ కాలేజిని డిగ్రీ కాలేజిగా మార్చడం జరగలేదు. అందువల్ల నా తల్లిదండ్రులు నన్ను పైచదువుల కోసం హైదరాబాద్ పంపించవలసి వచ్చింది. తర్వాతనే ఆ కాలేజి డిగ్రీ కాలేజిగా మారింది, పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్ గా మారింది. చివరికి విశ్వవిద్యాలయం కూడ అయింది. చెప్పాలంటే, ఆ 1950లలో 'పిచ్చిలేచిన పిల్లవాడే' 1990లలో ఆ విశ్వవిద్యాలయానికి వైస్ చాన్సలర్ అయ్యాడు. వీ

*బాబా రాందేవ్ దీక్ష అవినీతి వ్యతిరేక ఉద్యమ ముసుగులో హిందూత్వ రాజకీయాలు ప్రోత్సహించేదిగా ఉందంటున్నారు* **రామ్ పున్యాని**

# అవినీతికి వ్యతిరేకంగా రాందేవ్ దీక్ష

అవినీతికి వ్యతిరేకంగా బాబా రాందేవ్ చేపట్టిన నిరాహార దీక్షలో పాల్గొనడానికి వచ్చిన ప్రజలపై 5 జూన్ 2011న రాత్రి పోలీసులు విరుచుకు పడడాన్ని తప్పనిసరిగా ఖండించాల్సిందే. రాంలీలా మైదానాన్ని ఖాళీ చేయించే ప్రయత్నంలో పోలీసులు తమ 'సహజ' పద్ధతిలో లాఠీలకు పని చెప్పారు. బాష్పవాయువు ప్రయోగించారు. దీనివల్ల మహిళలు, పిల్లలతో సహా ఎంతోమంది గాయపడ్డారు. రాందేవ్, ప్రభుత్వం మధ్య చర్చలు విఫలం కావడంతో పోలీసు చర్యకు పూనుకున్నారు. (ఈ వ్యాసం రాసే సయమానికి) హరిద్వార్‌లోని తన పతంజలి యోగా ఆశ్రమంలో రాందేవ్ తన నిరాహార దీక్ష కొనసాగిస్తున్నారు. దీని నేపథ్యాన్ని, కొన్ని వివరాలను ఇక్కడ పేర్కొనాలి. జంతరమంతర్ వద్ద లోక్‌పాల్ బిల్లు కోసం అన్నా హజారే చేపట్టిన నిరాహార దీక్షలో బాబా కూడా పాల్గొన్నారు. అన్నా హజారే చేపట్టిన నిరాహార దీక్షకు మధ్యతరగతి వర్గాల నుంచి అసమాన్య మద్దతు లభించింది. అవినీతికి వ్యతిరేకంగా హజారే నేతృత్వంలోని ఉద్యమానికి మద్దతుగా ప్రజలు ఉవ్వెత్తున ముందుకు రావడంతో దీని నుంచి ప్రయోజనం పొందాలని కొన్ని శక్తులు ప్రయత్నించాయి. 2జి వంటి పెద్ద పెద్ద కుంభకోణాలు వెలుగు చూడడంతో మధ్యతరగతి ప్రజలలో కదలిక వచ్చి ఉద్యమించసాగారు. నిరాహార దీక్షకు ఆర్‌ఎస్‌ఎస్ మద్దతు ఇచ్చి ప్రజల ఉద్యమానికి సంఘటిత రూపం ఇచ్చింది.

నిరాహార దీక్ష సమయంలో అన్నా హజారే కేంద్ర బిందువుగా మారారు. ఆయనను 'రెండవ గాంధీ'గా పేర్కొనసాగారు. తన అనుచరుల సహాయంతో ఈ అంశాన్ని సొమ్ము చేసుకోవాలన్న పథకాలు బాబాకి ఉండడంతో అన్నా హజారేతో విభేదించాడు. అతడు విజయవంతంగా స్థాపించిన యోగ విద్య వ్యాపారంతో ఈ అనుచర వర్గం బాబాకి ఏర్పడింది. ప్రపంచీకరణ యుగంలోని కొత్త ఒత్తిడిలను, కొత్త ఆందోళనలను ఎదుర్కొంటున్న ప్రజలలో యోగా విశేష ఆదరణ పొందింది. తనకి పెద్ద సంఖ్యలో అనుచరులు, అభిమానులు ఉన్నారని బాబా చెపుతుంటాడు. అన్నా నిరాహార దీక్ష చేపట్టిన తర్వాత విదేశాలలో దాచిపెట్టిన అక్రమ నిధులపై తాను నిరాహార దీక్ష చేపడతానని బాబా ప్రకటించాడు. దీనికి అతడు తన సన్నాహాలను ప్రారంభించాడు. అతని సలహాదారులలో ఆర్‌ఎస్‌ఎస్ శిక్షితుడు గోవిందాచార్య కూడా ఉన్నాడు. రాందేవ్ తలపెట్టిన నిరాహార దీక్షకు పకడ్బందీగా ఏర్పాట్లు చేశారు. ఎంతో ఖర్చుతో ఫైవ్‌స్టార్ స్థాయి ఏర్పాట్లు చేశారు. రాందేవ్ అనుచరులలో ప్రధానంగా మధ్యతరగతి ప్రజలు ఉన్నారు. వ్యాపారస్తులు, ఖాఫ్ పంచాయితీ వంటి వ్యవస్థీకృత ప్రజలు నిరాహార దీక్షకు పెద్ద సంఖ్యలో తరలి వచ్చారు. సమాజంలోని పేదలు, వంచితుల నిరసన ప్రదర్శనలు చూసిన వారు ఈ ఉద్యమానికి అధిక సంఖ్యలో ప్రజలు తరలి రావడం, పెద్ద మొత్తంలో డబ్బులు ఖర్చు చెయ్యడం చూసి ఖంగు తిని ఉంటారు.

ప్రజలు హృదయపూర్వకంగా స్పందించారు. అయితే వాళ్లు సమస్య మూలాల్లోకి వెళ్లలేదు. మన దేశాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలో అవినీతి ఒకటని అందరూ చెప్పుకుంటారు. అయితే కుళ్లిపోతున్న మొత్తం వ్యవస్థలో పైకి కనిపించే వాటిల్లో అవినీతి ఒకటి అని కూడా గుర్తించాలి. వ్యవస్థలోని తీవ్ర అసమానతలను, అన్యాయాలను ప్రశ్నించకుండా అవినీతి ఒక్కదానిని నిర్మూలిస్తామంటే ప్రయోజనం ఉండదు. జయప్రకాష్ నారాయణం, ఆ తరువాత వి.పి. సింగ్ చేపట్టిన ఉద్యమాలు ఈ విషయాన్ని నిరూపించాయి.

ఈ నిరసనలలో పాల్గొంటున్న ప్రజలు దేశంలోని దోపిడీ, దౌర్జన్యాలకు గురై వ్యథాభరిత జీవితాలు గడుపుతున్న అధిక సంఖ్యాక వర్గానికి చెందిన వారు కాదు. 'భారత్ వెలిగిపోతుంది' అన్న బిజెపి నినాదానికి ఊతంగా ఉన్న వర్గాలే దీంట్లోనూ ఉన్నాయని చెప్పుకోవచ్చు. బాబా అనుచరవర్గంలో అక్రమ మార్గంలో సంపద సమకూర్చుకున్న వారు కూడా ఉన్నారు. బాబా పయనం, ప్రగతి కూడా చెప్పుకోదగినవే. విజయవంతమైన యోగా గురువుగా మొదలుపెట్టి విజయవంతమైన వ్యాపారవేత్త అయ్యాడు. ఇప్పుడు రాజకీయ రంగప్రవేశం చెయ్యాలన్న తలంపుతో ఉన్నాడు. ఇవన్నీ మతం, కాషాయ ముసుగులలో నడుస్తున్నాయి.

ఒక్కసారి ఘటనల క్రమాన్ని పరిశీలిద్దాం : బాబా నిరాహార దీక్ష తేదీ దగ్గరవుతున్న కొద్దీ ఎన్నికల రాజకీయాల కారణంగా ప్రభుత్వం బెంబేలెత్తిపోయింది. ఆర్‌ఎస్‌ఎస్ కూటమికి బాబా వంటి సమాంతర మద్దతు వర్గం ఉంది. హిందూ రాజ్యం లక్ష్యంగా కొత్త రాజకీయ పార్టీ పెట్టాలన్న అంశంపై ఆర్‌ఎస్‌ఎస్‌తో బాబా చర్చలు నిర్వహిస్తూ ఉన్నారు. నిరాహార దీక్షను ఎట్టి పరిస్థితులలోనైనా చేపట్టనివ్వకూడదన్న ఉద్దేశంతో ఉన్న ప్రభుత్వం బాబా రాందేవ్ ముందు మోకరిల్లింది. రెండవ దఫా చర్చలలో విదేశాలలో ఉన్న అక్రమ ఆస్తులను తిరిగి రప్పించడానికి అన్ని ప్రయత్నాలు చెయ్యడానికి, ఈ ఆస్తులు ఉన్నవారి చుట్టూ ఉచ్చు బిగించడానికి ప్రభుత్వం ఒప్పుకుంది. రాందేవ్ సహచరులు ఈ ఒప్పందంపై సంతకం చేశారు. తన డిమాండ్లలో 99 శాతం నెరవేరాయని రాందేవ్ ప్రకటించారు. అంటే అతడు నిరాహార దీక్షకు కూర్చోవలసిన అవసరమే లేదు.

రాంలీలా మైదానానికి చేరుకున్న తరువాత నిరాహార దీక్ష కొనసాగిస్తానని రాందేవ్ మొండిపట్టు పట్టాడు. అరెస్టు చేస్తారన్న భయంతో మాత్రమే ఆమోదలేఖ ఇచ్చామని అతని సహచరులు ఇప్పుడు వివరిస్తున్నారు. ఈ తరుణంలో మోసపోయామన్న నిర్ధారణకు ప్రభుత్వం వచ్చింది. సాధారణంగా ఇటువంటి ఉద్యమాలను తమ కోరికలను సాధించుకోడానికి చేపడుతుంటారు. 99 శాతం కోరికలు నెరవేరడం కంటే ఇంకా ఆశించేది ఏముంటుంది? అయినప్పటికీ ఉద్యమాన్ని కొనసాగించాలనుకోవడం వెనక ఉద్దేశం ఏమిటి? రాజకీయ లక్ష్యంతో చేసిన జనసమీకరణ చేజారిపోకుండా చూడడానికే నిరాహారదీక్షను కొనసాగించదలిచారన్నది స్పష్టమౌతుంది. అవినీతి వ్యతిరేకత అన్నది ఒక ముసుగు మాత్రమే. హిందూ జాతి రాజకీయాలను బలోపేతం చేయడమే అసలు లక్ష్యం. ఇది దేశ ప్రజలను విడదీసేది. ఫలితంగా ఆసక్తికర పరిణామాలు చోటు చేసుకున్నాయి. 'తప్పనిసరి' అయ్యిందని మన్మోహన్‌సింగ్ వ్యాఖ్యానించారు. వివరాలు ఇవ్వలేదు కాబట్టి ప్రభుత్వం మనసులో ఏముందో తెలియలేదు. రాందేవ్‌ని తరలించి, రాంలీలా మైదానాన్ని ఖాళీ చేయించాలని ప్రభుత్వం నిర్ణయించుకుంది. రాందేవ్‌ని అరెస్టు చెయ్యడానికి పోలీసులు రావడంతో మహిళా మద్దతుదారుల మధ్య నుంచి అతడు తప్పించుకున్నాడు. కొన్ని గంటల తరువాత మహిళా దుస్తులలో, దుపట్టాతో గడ్డాన్ని దాచుకున్న రాందేవ్‌ని పోలీసులు పట్టుకుని తరలించారు.

ఇప్పటివరకు ఉద్యమాల్లో తొలి దెబ్బను నాయకులు ఎదుర్కొనే వారు. పోలీసు చర్యల నుంచి అనుచరులను కాపాడడానికి నాయకులు ఉండేవారు. కానీ ఇవి భిన్న వర్గానికి చెందిన రాజకీయాలు. ఇక్కడ పిరికితనం సాహసంగా చూపబడుతుంది. నిజాయితీ స్థానంలో కుతంత్రాలు చోటు చేసుకుంటాయి. ప్రభుత్వానికి ఉత్తరం ఇచ్చిన తరువాత 'తూచ్' అన్న రాందేవ్ పోలీసులు తీసుకెళ్లడానికి వచ్చినపుడు 'సాహస' నాయకుడి మాదిరి ఆడవాళ్ల వెనక దాక్కొని, మహిళా దుస్తులలో పారిపోయాడు. అతడి కోసం వచ్చిన ప్రజలను పర్యవసానాలను ఎదుర్కోమన్నాడు. నిరాహార దీక్షను విరమించుకుంటున్నట్లు ఉత్తరం ఇవ్వడాన్ని తప్పించుకోవడానికి మారువేషం వేసుకోవడాన్ని శివాజీ అనుసరించిన ఎత్తుగడలుగా రాందేవ్ సమర్థించుకుంటున్నాడు. ప్రజాస్వామిక సమాజం పట్ల అవగాహన లేమిని ఈ మాటలు వెల్లడి చేస్తున్నాయి. శివాజీ ఒక రాజు. అధికారం కోసం అతడు ఇతర రాజులతో పోరాడాడు. ప్రజాస్వామ్యంలో ఉద్యమాలు, చర్చల ఉద్దేశం ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావడం. తమ ఉద్దేశాన్ని చాటడానికి నాయకులు అరెస్టు అవుతారు. కానీ కొంతమందికీ ఎత్తుగడలు చవకబారు పలాయన మార్గం అవుతుంది. పిరికితనాన్ని ఇక్కడ రాజుల పథకాలను అనుసరించడంగా ప్రదర్శిస్తున్నారు.

ఈ మొత్తం ప్రక్రియ వెనక రాజకీయ అంశాలు ఆసక్తి కొలిపేవిగా ఉన్నాయి. ఈ ఉద్యమమంతటికీ ఆర్‌ఎస్‌ఎస్ కూటమి పూర్తి మద్దతునిచ్చింది. రెండు సాధారణ ఎన్నికల్లో ఓటమిని ఎదుర్కొన్న తరువాత బాబ్రీ మసీదూ కూల్చివేత లేదా మతోన్మాద హింస మాదిరి ఎన్నికల్లో విజయాలు తెచ్చిపెట్టే మరో అంశం కోసం ఈ కూటమి వెదుకుతోంది. ఇప్పటి ప్రజా సమీకరణ మౌలికంగా హిందూజాతికి చేసిన సమీకరణ లాంటిదే. ఇది ఆదివాసీలు, దళితులు, సమాజంలోని ఇతర బడుగు వర్గాల హక్కులను వ్యతిరేకించేది. కూల్చివేత రాజకీయాలలోని ప్రముఖులందరూ ఇప్పుడు కూడా రంగంలో ఉన్నారు. గోవిందాచార్య, సాధ్వీ రితంబర్, ఉమాభారతి వంటి వాళ్లు బహిరంగంగానో, తెరచాటుగానో ఉన్నారు. కూల్చివేత దాడిలోని ఇతర పాత్రధారులైన అద్వానీ, మురళీమనోహర్ జోషి వంటివాళ్లు లాఠీచార్జీ అనంతర నిరసనలలో పాల్గొన్నారు. రాందేవ్ ప్రధాన మద్దతుదారులలో ఆర్‌ఎస్‌ఎస్ కార్యకర్తలు ఉన్నారు. బడుగు వర్గాలపై అత్యాచారాలు, రైతులు, అల్ప సంఖ్యాక వర్గాల వారిపై దాడులు జరుగుతున్నంత కాలం ఈ శక్తులు మౌనంగా ఉన్నాయి. ఇప్పుడు పార్లమెంటు ఉమ్మడి సమావేశాలు నిర్వహించాలని కోరుతూ రాష్ట్రపతి భవన్ వరకు బాబ్రీ విధ్వంసక ముఠా ఆడుతూ, పాడుతూ 'ప్రముఖుల ధర్నా' నిర్వహించింది.

అవినీతిపరులపై కఠిన చర్యలు తీసుకోవాలనడాన్ని పూర్తిగా సమర్థించవలసిందే. అయితే అవినీతి అన్నదాన్ని సమూలంగా నిర్మూలించడానికి నిజమైన మరింత సమగ్ర ప్రయత్నాలకీ, సంచలనాత్మక కార్యక్రమాలకీ మధ్య తేడా గమనించాలి. ప్రసార సాధనాలలో అధికభాగం దీనినంతటినీ మరింత సంచలనాత్మకంగా మలచడాన్ని కూడా అర్థం చేసుకోవాలి. రాందేవ్, అతని ప్రయత్నాలను ఆకాశానికి ఎత్తడం బాబ్రీ మసీద్ కూల్చివేతకు ముందు నాటి ప్రజా ఆవేశాలు స్థితిని కల్పించే ప్రయత్నంగా చూడాలి. ఇంతకు ముందు కూడా అవినీతికి వ్యతిరేకంగా అనేక స్థాయిలలో ఉద్యమాలు జరిగాయి. అవినీతికి వ్యతిరేకంగా ఇంత పెద్ద ఎత్తున ప్రచారానికి పూనుకున్న సమయమూ, ఎంతో పకడ్బందీగా నడుపుతున్న విధానమూ అనుమానాలకు తావు ఇస్తున్నాయి.

ప్రస్తుత నిరసనలు మన ప్రజాస్వామ్యంలో మరో అంశంపై దృష్టి నిలుపుతాయి. ప్రజాస్వామ్యంలో పౌరసమాజ బృందాలకంటే ప్రభుత్వానికి బాధ్యత తక్కువగా ఉంటుందా? పౌరసమాజ బృందాలు ప్రభుత్వాలపై పలు విధాలుగా ఒత్తిడి తెస్తూ ప్రజాస్వామ్యంలో విలువైన పాత్రను పోషిస్తున్నాయనడంలో సందేహం లేదు. కార్యక్రమాల అమలును ఎన్నికైన ప్రభుత్వాల ద్వారానే సాధించాలన్నది గమనించాలి. కాబట్టి విభజన రేఖ ఎక్కడ గీయాలి? కోరికలలో 99 శాతం ఆమోదింపబడిన తరువాత ఉద్యమాన్ని కొనసాగించవలసిన అవసరం ఉందా? పౌరసమాజ బృందాలు, ప్రభుత్వంతో ఏర్పడిన ఉమ్మడి సంఘాలలో భేదాభిప్రాయాలు ఉంటే, ఎవరికి ఎంత ప్రాధాన్యత నివ్వాలి? ఎంత కాదన్నా ప్రభుత్వం ప్రజలతో ఎన్నుకోబడింది. బాబాలు, స్వాములు రాజకీయ రంగ ప్రవేశం చాలా ప్రమాదకరమైన సందేశాన్ని పంపిస్తుంది. పాకిస్తాన్‌లో చాలాకాలం ముల్లాలు రాజకీయ అధికారం చలాయించి, ఇప్పటికీ వాళ్ల పాత్ర ప్రముఖంగానే ఉంది. పాకిస్తాన్ ప్రస్తుత సమస్యల్లో ఇది ఒక ప్రధాన కారణం. మనం కూడా పాకిస్తాన్‌ని అనుకరించాలని అనుకుంటున్నామా? బాబా రాందేవ్, సాధ్వీ రితంబర, శ్రీశ్రీ రవిశంకర్ లకు పౌరులుగా పూర్తి హక్కులున్నాయి. కానీ, తమకున్న ఆధ్యాత్మిక అనుచరుల ఆధారంగా రాజకీయాలలో ఆటలాడాలనుకోవడం మత విశ్వాసాల దుర్వినియోగం అవుతుంది.

రాందేవ్ ఘటన నుంచి ఎన్నో సిద్ధాంతాలు రూపుదిద్దు కుంటాయి. మాలెగాంవ్ నుంచి అజ్మీర్ వరకు దేశాన్ని అల్లకల్లోలం చేసిన సంఘ్ కుటుంబ హింసాత్మక చర్యల నుంచి దృష్టిని ఇది మళ్లించిందన్నది వీటిల్లో ఒకటి. హింసాత్మక చర్యలలో పాలు పంచుకున్న వాళ్లకు సంఘ

***చనిపోయిన మనిషి సమాచారాన్ని కూడా ప్రపంచానికి వెల్లడించలేని దుస్థితిలో చిక్కుకున్న సత్యసాయి బాబా చుట్టూ అలుకున్న ఆస్తి, అశ్లీలత, హత్యానేరాల చరిత్రను వివరిస్తున్నారు* బాబు గోగినేని**

# పుట్టపర్తిలో ఏం జరుగుతోంది?

**షి**రిడి సాయిబాబా మళ్లీ తనగా అవతారమెత్తాడని చెప్పుకున్న మాయగాడు. అద్భుత శక్తులున్నాయని చెప్పుకున్న మోసగాడు. ఎందరో ఇంద్రజాలికులు అతడి 'హస్త లాఘవాన్ని' నిరూపించారు. కెమెరాలు వాటిని బంధించాయి. ఒకప్పుడు భక్తులైన యువకులు తమ మీద అతడు లైంగిక ఆకృత్యాలకు పాల్పడ్డాడని ఆరోపించారు. అయినప్పటికీ సాయిబాబా దేవుడిగా బతికి, దేవుడిగా చనిపోయాడు. చట్టం నిఘా లేకుండా, ఇతరులెవ్వరికీ ఏమీ తెలియని అపారదర్శక, విస్తృత ఆర్థిక నిధులున్న సామ్రాట్టుగా వెలుగొందాడు. చనిపోయిన తర్వాత అతడిని ప్రభుత్వ మర్యాదలు, తుపాకీ వందనాలతో ఖననం చేశారు. 'సత్యమేవ జయతే' అన్న నినాదం గల దేశం, పౌరులు శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించుకోవాలనే రాజ్యాంగం సాక్షిగా అతడి పార్థివ శరీరాన్ని మూడు రంగుల జెండాతో కప్పారు. సత్యసాయి బాబా కథలో మోసాలు, రాజకీయాలతో ఏర్పరుచుకున్న అధికార, ఆశ్రిత వర్గ సామ్రాజ్యమే కాకుండా, అమాయకులైన భక్తుల పాత్ర కూడా ఉంది.

### సాయి అవతారం

ఈశ్వరమ్మ స్నానం చేస్తున్నపుడు ఆమెలోకి కాంతి ప్రవేశించినపుడు, ఆమె గానీ, నిరక్షరాస్యుడైన ఆమె భర్త పెద్ద వెంకప్పరాజు గానీ తన సరికొత్త అవతారానికి దేవుడు ఆమెను ఎంచుకున్నాడని తెలియదు. అధికారిక సాహిత్యం ప్రకారం ఈ అవతారం గురించి జీసస్, మహమ్మద్ ముందుగానే చెప్పారు. తాము చదివే బైబిల్ లేదా ఖురాన్‌లో ఇటువంటి వాక్యాలు లేవని చెప్పేవాళ్లకి సమాధానంగా ఈ అవతార పురుషుడు ప్రకటన చేశాడు.

అంతకుముందు అవతారమైన షిరిడి సాయిబాబాగా ఉన్నప్పుడు 1918లో షిరిడీ సాయి శరీరాన్ని వదిలిన తరువాత ఎనిమిది సంవత్సరాలకు పుట్టపర్తిలోని ఈశ్వమ్మకు శుక్లపక్షమిలో పుడతానని పేర్కొన్నాడు. 1926 మే 23న ఈశ్వమ్మకు మగశిశువు పుట్టాడు.

ఈ అద్భుత క్షణాలకు సూచికగా ఇంటిలోని సంగీత వాయిద్యాలు వాటంతట అవే మోగసాగాయి. గాలి పరిమళాలతో నిండిపోయింది. ప్రభువుకి రక్షణగా నాగుపాము పడగవిప్పి నిలిచింది. బుద్ధుడి జననమప్పుడు మాదిరిగానే సంతోషంతో ఏనుగులు ఘీంకరించాయనీ, నెమళ్లు నాట్యమాడాయనీ, దేవుళ్లు సంబరాలు చేసుకున్నారని అనుకోవడం సమంజసంగా ఉంటుంది.

సర్వమూ తెలిసిన వాడైనప్పటికీ సత్యనారాయణరాజు – అతనికి పెట్టిన పేరు అదే – బడికి వెళ్లాడు. అక్కడ ఆటల మాదిరి వెల్లడి చేసిన అతని అద్భుత శక్తులను అందరూ గుర్తించారు. తన శక్తులతో సృష్టించే బహుమతుల కోసం మిత్రులందరూ అతడిని ఇష్టపడేవారు. న్యాయమైన అతడి కోపానికి టీచర్లు భయపడేవారు. ఒకసారి ఒక టీచరు కుర్చీకి అతుక్కుపోయాడు, పిల్లల్ని కొట్టినందుకు పశ్చాత్తాపపడుతున్నానని, క్షమించమని అతడిని వేడుకున్న తరువాతే ఆ టీచరు కుర్చీ నుంచి వేరుపడ్డాడు.

1940లో మానసిక రుగ్మత ఉందన్న అనుమానంతో సత్యనారాయణ రాజుకి డాక్టర్లు 'చికిత్స' చేశారు. అప్పటికి అతనికి 15 ఏళ్లు. ఆ సమయంలో అతడు తనని అవతారంగానూ, సత్యసాయి బాబా గానూ ప్రపంచానికి చాటుకున్నాడు. ఆ తరువాత అతడు తన భక్తులతో ఇలా చెప్పాడు, 'దేవుడినైన నేను పుట్టపర్తిలో అవతరించాను. బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదులు అవతారులు కారు.. వాళ్లకి కొన్ని దైవిక శక్తులు ఉన్నాయి.. నా శక్తి అనంతమైనది. నా సత్యం మాటలకు చిక్కనిది, ఎవరికీ అందనిది. సత్యమూ, ప్రేమల ద్వారా మానవత్వాన్ని పునర్జీవింప చేయడం నా కర్తవ్యం.' ప్రస్తుత అవతారం 96 సంత్సరాల వయసులో 2022 అంతం అయినప్పుడు కర్ణాటకలోని మాండ్య జిల్లాలో ప్రేమసాయిగా తిరిగి అవతరిస్తానని నమ్మబలికాడు.

2022 కంటే పదకొండు సంవత్సరాల ముందుగానే 2011లో అతడు చనిపోవడంతో భక్తులంతా దిగ్భ్రాంతికి గురయ్యారు. తీవ్ర అస్వస్థతతో మొదటిసారి అతడిని ఆసుపత్రిలో చేర్పించినప్పుడు కూడా

---

సంస్థలలోని కార్యకర్తలతో ఉన్న సంబంధాలు వెల్లడయ్యాయి. హింసాత్మక చర్యలకు కారకులైన వారిని తగిన విధంగా శిక్షించడంపై అధికారుల దృష్టి పక్కకు తప్పదని ఆశిద్దాం.

సామాజిక అంశాలపై శాంతియుత నిరసనల పై దాడులను ఖండించాల్సిందేనని పునరుద్ఘాటిస్తున్నాను. అయితే ఒప్పందం నుంచి వెనక్కి తగ్గడం, ప్రముఖుల ధర్నాలు అనుమానాలకు ఆస్కారమిస్తున్నా యనడంలో సందేహం లేదు.

*(రచయిత మతోన్మాద విశ్లేషకులు)*

*(అనువాదం : కె. సురేష్, 'మంచి పుస్తకం' నిర్వాహకులు)*

*(ఆవామి భారత్ బ్లాగ్‌స్పాట్ నుంచి)* వీ

భక్తులెవ్వరికీ అనుమానం రాలేదు. భక్తులు జబ్బుపడినప్పుడు అతడెన్ని సార్లు విభూతి ఇవ్వలేదు. దేవుడిని 'వెంటిలేటర్' మీద పెట్టడమేమిటని ఏ ఒక్కరూ ప్రశ్నించలేదు. డాక్టర్లు తమ ధర్మాన్ని నిర్వర్తించడానికి సత్యసాయి బాబా అనుమతించాడంటే అది వాళ్ల కర్మ. అంతేకాని బాబాకి ఏమీ కాదని కొంత మంది అన్నారు. చివరికి అతడి మృత్యువుని తెలుగు దినపత్రికలన్నీ మొదటిపేజీ ప్రత్యేక శీర్షికలో వెల్లడించాయి. భారత దేశ న్యాయ అధికారులలో రెండవ స్థానంలో ఉండే సొలిసిటర్ జనరల్ అయిన గోపాల్ సుబ్రహ్మణ్యం తనకొక కల వచ్చిందని, ఆ కలలో సాయిబాబా తన పడక గదిలోని పెట్టెలో సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్ (దీనిలో లక్షా యాభై వేల కోట్ల ఆస్తి ఉందని చెబుతున్నారు) ని నడపడానికి సూచనలు ఉన్నాయని పేర్కొన్నారు. కానీ అటువంటి పెట్టె లేదు, ఉత్తరమూ లేదు.

ఆ రోజుల్లో లోపించినవి ఇంకా చాలా ఉన్నాయి. హేతువు, ప్రశాంతత, సరైన ప్రవర్తన. అనేక మంది మంత్రులు పుట్టపర్తిలో బసచేశారు. పెద్ద సంఖ్యలో పోలీసు బలగాలను (వాళ్ల అవసరం ఏమిటో) దింపారు. సాయిబాబాను చూసినట్టు, అతడి ఫొటో నుంచి విభూతి రాలిపడుతున్నట్టు ఎంతో మంది పేర్కొన్నారు. అతడి తరువాయి అవతారం గురించి ప్రసార సాధనాలలో ఊహాగానాలు మొదలయ్యాయి. కొంతమంది మానసిక వికలాంగులైన విద్యావంతులు హిందూ సంవత్సరాల ప్రకారం బాబా 96 సంవత్సరాలు జీవించాడని వాదించసాగారు. మరైతే ప్రతి సంవత్సరం అతడి పుట్టిన రోజుని ఇంగ్లిష్ కాలెండర్ ప్రకారం ఎందుకు జరుపుకుంటారు? పుట్టిన రోజులకు ఇంగ్లిష్ కాలెండర్, వయస్సు లెక్కలకు హిందూ కాలెండరునా?

దాదాపు దేశ రాజ్యాంగ అధికారులందరు, ప్రముఖ రాజకీయ నాయకులు బాబా పార్థివ శరీరానికి నివాళులు అర్పించడానికి వచ్చారు. సాయిబాబాని భక్తులు పుడ్చిపెట్టడానికి సన్నహాలు చేస్తున్న రోజుల్లో దేశపాలన స్తంభించిపోయింది. హిందువులైన బాబాలను దహనం చెయ్యరు. ఖననం చేస్తారు. అదీ ధ్యానముద్రలో పుడ్చి పెడతారు. అయితే సత్యసాయి బాబా స్వయంగా దేవుడు కాబట్టి అతడిని పడుకున్న స్థితిలో పూడ్చి పెట్టారు.

ఒక మనిషి దేవుడిగా పరిగణించబడడం ఏంటి? పండు వయసులో అతడు చనిపోతే దేశంలోని అధిక సంఖ్యాకులు దుఃఖించడ మేమిటి? జాతి నేతలు దానిని ఒక విషాదంగా భావించమేమిటి?

ఇది రాత్రికి రాత్రి జరిగిపోలేదు. కొన్ని దశాబ్దాల పాటు ఎక్కించిన విష ప్రభావమిది. నిరూపణ కాని, నిరూపణ చెయ్యలేని కథలను తెలివిగా ప్రచారం చేశారు. వాస్తవాలను మసిపూసి మారేడుకాయ చేశాయి. అమాయకులైన భక్తుల దానశీలత, శతాబ్దాల పాటు సమాజంలో పేర్కొన్న మౌఢ్యం వీటికి దోహదం చేశాయి.

రీడర్స్ డైజెస్ట్ ప్రచురించిన 'స్ట్రేంజ్ స్టోరీస్, అమేజింగ్ ఫ్యాక్ట్స్ –II' అన్న పుస్తకంలో ఈ నమశక్యంగాని వివరణ ఉంది. 'సాయిబాబా అసాధారణ శక్తులు ఉన్న భారతీయ గురువు. గాలిలోంచి అతడు బంగారు ఉంగరాలను, నాణాలను సృష్టించగలడు. రాయిని మిఠాయిగా, పూలను వజ్రాలుగా మార్చగలడు. అతడు గాలిలో చెయ్యి తిప్పితే వచ్చే విభూతితో రోగులను నయం చేస్తాడు. సాయిబాబా శక్తులలో అన్నిటికంటే అద్భుతమైనది 1953లో జరిగింది. నీలం రంగుకు మారి కుళ్లిపోతున్న రాధాకృష్ణ శరీరంలోకి అతడు తిరిగి ప్రాణం పోశాడు. యాభై ఏళ్లుగా బాబా తన శక్తులను ప్రదర్శిస్తున్నాడు. ఇప్పటి వరకు ఎవరూ అది కనికట్టు అని, హస్త లాఘవమని నిరూపించ లేకపోయారు'. దేవుడైన బాబాని గురువుగా పేర్కొనడమే కాకుండా రీడర్స్ డైజెస్ట్ తప్పుడు కథనాన్ని ప్రచురించింది.

ఇలాంటి కథనాలకు అంతులేదు. అమెరికా సాయి సంస్థల కేంద్ర కమిటీకి చైర్మన్ అయిన డా. జాన్ హిస్లాప్ (ఇతడు అమెరికాలో పారిశ్రామికవేత్త; మేనేజ్‌మెంట్ కన్సల్టెంట్) 1971లో గుండెపోటు కారణంగా చనిపోయిన వాల్టర్ కోవన్‌ని సత్యసాయిబాబా తిరిగి బతికించాడని చెపుతాడు. బెంగుళూరులోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌కి డైరెక్టరు, భారత ప్రభుత్వానికి వైజ్ఞానిక సలహాదారు అయిన డా. సూరి భగవంతం సత్యసాయి బాబాకి వ్యాఖ్యాతగా ఉండేవాడు. ఒకసారి బాబా గాలిలోంచి బాబా భగవద్గీతను (దేవుని ముద్రణా లయంలోనూ అచ్చు తప్పులు తప్పలేదు) సృష్టించాడని చెపుతాడు. నూతన ప్రబంధాలలోని అద్భుతాలను బాబా ప్రస్తుతంలో చేసి చూపించాడు. నీటిలో వేలు ముంచి దానిని పెట్రోలుగా మార్చాడు. భక్తుల రోగాలను తన మీదికి తెచ్చుకుని, వారికి నయం చేస్తాడు. మానసిక శక్తులతో శస్త్ర చికిత్స చేస్తాడు. చింత చెట్టు నుంచి కాలం కాని కాలంలో మామిడి పళ్లు కోస్తాడు. 'భారత దేశాన్ని మిడతల దండు మాదిరి' ముంచుకొస్తున్న చైనా సైన్యాన్ని బాబానే తిప్పికొట్టాడని నమ్ముతారు. ఒకేసారి రెండు ప్రదేశాలలో కనపడ్డాడన్న వార్తలు అనేకం. తాను నిద్రపోనని అతడు చెప్పుకున్నాడు. అతడు తెల్లవారుజామునే లేస్తాడని కథనాలు ప్రచురిత మవుతాయి.'

పెట్టుబడిదారుల మేధో హక్కుల ఉల్లంఘనగా పేర్కొనదగ్గ పార్కర్ పెన్నులను, ఒమెగా గడియారాలను సాయిబాబా 'సృష్టించి' పంచిపెట్టాడు. 'నాలోకి చూడవద్దు. పదునైన మెదడుకి, తెలివైన వ్యక్తికి అతీతుడిని... పరిమితమైన వారికి అపరిమితమైన దాని లోతు ఎలా తెలుస్తుంది? కొండను చీమ ఎలా తెలుసుకోగలుగుతుంది? ఈ వస్తువులను ఎందుకు, ఎలా సృష్టిస్తున్నానో తెలుసుకోవడం మీ పరిధిలో లేదు. నేను సృష్టించే వస్తువులను ప్రపంచాన్ని సృష్టించినట్లుగానే మానసిక సంకల్పంతో చేస్తాను. నాలో నమ్మకాన్ని ఉంచండి. గౌరవాన్ని పెంచుకోండి. ప్రేమ ద్వారా సంతోషాన్ని పొందండి. మీరు అంతకు మించి చెయ్యగలిగింది ఏమీ లేదు. అది చేసి ప్రయోజనం పొందండి' అని బాబానే చెప్పాడు.

భక్తుడైన డా. హిస్లాప్ అమాయకంగా 'విశ్వాన్ని చూసుకోవాల్సిన గురుతర బాధ్యత బాబాపే ఉంది. మనబోటి వాళ్ల కోసం అతడు సమయం ఎలా ఇవ్వగలడు?' అని ప్రశ్నిస్తే 'తన అనంతకోటి శరీరాలతో బాబా అన్ని చోట్లా ఉంటూ, అన్ని బాధ్యతలూ నెరవేరుస్తాడు... బాబా సర్వాంతర్యామి. దేవుడికి ఎటువంటి పరిమితులు లేవు' అని బాబా బదులిచ్చాడు. డా. హిస్లాప్ సంతృప్తుడయ్యాడు.

బాబా మిడిమిడి ఇంగ్లిష్ పరిజ్ఞానానికి పదునుపెట్టి, అతడి లయబద్ధ ప్రేలాపనలను రాసిన ఘనత అతడి అధికారిక జీవిత కథకుడైన కస్తూరికి దక్కుతుంది. 'సమస్తమూ నేనే, తెలుసుకోగలిగినదంతా,

పరిపూర్ణత కోరుకునేదంతా నేనే. సూర్యోదయం, సూర్యాస్తమయం నా ఇచ్చ కారణంగానే జరుగుతున్నాయి. నా కోరికను మన్నించే రాత్రి ఆకాశంలో తళుకులీనే తారలు పగటి పూట మానవులకు కనిపించకుండా ఉంటున్నాయి. నా కోరిక కాణంగానే ప్రాణులన్నింటినీ సజీవంగా ఉంచే గాలి నిరంతరం ప్రసరిస్తూనే ఉంది. నాకు ఆనందాన్ని ఇవ్వడానికి సముద్రానికి ప్రయాణం చేసే వాగులు, వంకలు గలగలలాడుతుంటాయి. అనంతమైన వైవిధ్యాన్ని ఆనందించే నా కోసమే మానవులలో కోట్ల కొద్దీ ముఖాలు రూపు దిద్దుకున్నాయి.'

నిర్హేతుకత, అమాయకత, మూఢ నమ్మకాలు కలగలిసి దేశ, సాంస్కృతిక సరిహద్దులను చెరిపేసే బంధుత్వాన్ని సృష్టించాయి. సత్యసాయి అద్భుతాలను పొగిడే భక్తులలో భారత దేశ అగ్ర రాజకీయ నాయకులు, జడ్జీలు, దేశ దేశాధ్యక్షులు, ప్రధాన మంత్రులు, స్పానిష్ రాజ కుటుంబ సభ్యులు, అంతర్జాతీయ దౌత్య అధికారులు, అడ్వకేట్లు, ఇంజనీర్లు, డాక్టర్లు, సామాన్య ప్రజలు ఉన్నారు.

రాజకీయ బ్రోకర్లు, అంతర్జాతీయ ఆయుధ వ్యాపారస్తులు, మద్య మహారాజుల బృందంలో శాంతి కాముకుడు, మద్యం ముట్టని సత్యసాయి బాబా తరచు కనిపిస్తూ ఉండేవాడు. బహుశా ఆధ్యాత్మిక సందేశం వారికే ఎక్కువ అవసరమనుకున్నాడు. బాబా అంతర్జాతీయ భక్త బృందంలో ముఖ్యుల జాబితా చూడండి: పత్రకారుని హత్యలో నిందితునిగా విచారింపబడ్డ ఇటలీ మాజీ ప్రధానమంత్రి గైలియో అండ్రియెట్టి; అవినీతికి ఐదున్నరేళ్లు ఖైదు విధింపబడ్డ ఇటలీ మాజీ ప్రధానమంత్రి బెట్టినో్క్రాక్సి; హెరాయిన్‌తో 1962లో స్విట్జర్లాండ్‌లో పట్టుబడ్డ ఇరాన్ రాకుమారి పోయితావి (మాజీ షా కి చెల్లెలు).

ఇటువంటి భక్త జన సందోహాన్ని కల్లోల పరుస్తూ స్వేచ్ఛా ఆలోచనాపరుల ప్రపంచ సంఘానికి ఆసియా అధ్యక్షుడైన శ్రీలంక వాసి డా. అబ్రహం టి. కొవూరు, బెంగళూరు విశ్వవిద్యాలయ మాజీ ఉప కులపతి డా. ఎచ్. నరసింహయ్యలు వచ్చారు. ఈ ఇద్దరూ కలిసి సత్యసాయి బాబా పైనా, అతడి ప్రాపంచిక దృక్పథంపైనా విమర్శల వెల్లువ కురిపించారు.

డా. కోవూరు 1973లో 'బిగాన్ గాడ్‌మెన్!' అన్న పుస్తకం రాశారు. దాంట్లో ఈ ఉదంతం పేర్కొన్నారు. సీకో గడియారాల ఉత్పత్తిదారుడు పుట్టపర్తిలో సత్యసాయిని కలిశాడట. అతడు తయారు చేసి పరీక్షల నిమిత్తం జపాన్‌లో ఇనపెట్టేలో పెట్టి ఉంచిన గడియారాన్ని బాబా అతనికి ఇచ్చాడు. దాంతో బాబా దివ్యశక్తుల పట్ల అతడి అనుమానాలన్ని తొలగి పోయాయి. "అతడు బాబా కాళ్లకు సాష్టాంగ నమస్కారం చేశాడు. అప్పటి నుంచి బాబాకి అతడు భక్తుడుగా ఉన్నాడు" అని పత్రికలో జరుగుతున్న చర్చలో భాగంగా డా. భగవంతం రాశాడు. డా. భగవంతం నుంచి మరిన్ని వివరాలు పొందడానికి డా. కోవూరు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. దాంతో టోక్యోలోని సీకో గడియారాల కంపెనీ అధ్యక్షుడు షోజి హట్టోరికి డా. కోవూరు ఉత్తరం రాశాడు. దానికి హాట్టోరి ఇచ్చిన జవాబు: 'మీ ఉత్తరం పేర్కొన్న సాయిబాబా వివరాలు నేను ఇంకేమీ ఇవ్వలేకపోతున్నాను. సదరు వ్యక్తిని నేను కానీ, మా సిబ్బంది కానీ ఎవ్వరమూ కలవలేదు. ఆ నివేదికలలో ఎటువంటి వాస్తవం లేదని నేను కచ్చితంగా చెప్పగలను.' ఈ విషయం గురించి చెప్పిన తరువాత కూడా భగవంతం కిమ్మనకుండా ఉండిపోయాడు.

సత్యసాయి బాబా మోసగాడనీ, శాస్త్రజ్ఞుడైన భగవంతం బాబాకి ఏజెంటనీ అంటూ డా. కోవూరు పై వివరాలు వెల్లడి చేసినప్పుడు పెద్ద దుమారం లేచింది. అయితే శాస్త్రజ్ఞుల్లో బాబా బండారాలను బయట పెట్టిన వారు కూడా ఉన్నారు. బెంగుళూరు విశ్వవిద్యాలయ ఉపకులపతి డా. ఎచ్ నరసింహయ్య బాబా మోసాలను ఒక్కటొక్కటిగా విప్పసాగాడు. 'అద్భుతాలు సరిచూడగల ఇతర మూఢ నమ్మకాలను శాస్త్రీయంగా, హేతుబద్ధంగా పరిశీలించి నిగ్గుతేల్చడానికి' పన్నెండు మంది సభ్యుల అధికార సంఘాన్ని నియమించాడు. సత్యసాయిబాబా శిష్యుడైన ఏడు సంవత్సరాల సాయికృష్ణ లోదుస్తులలో దాచి ఉన్న విభూతి ఉండను డా. నరసింహయ్య కమిటీ వెల్లడి చేసింది. దీంతో అనేక చిన్నా చితక బాబాలు, స్వాములు తమ వద్ద ఎటువంటి మహిమలు లేవని అంగీకరించారు. సత్యసాయి బాబాని కూడా పరిశీలిస్తామని కమిటీ కోరింది. కమిటీ వెళ్లినప్పుడు భయపడిన బాబా బెంగుళూరు దగ్గరలోని వైట్‌ఫీల్డ్‌లో తలుపులేసుకుని బయటకు రాలేదు. నరసింహయ్య కమిటీపై బాబా దుష్ప్రచారం చెయ్యడం మొదలుపెట్టాడు.

ఈ బహిరంగ అవమానాలు, హేతువాదుల స్పందనలు చాలనట్టు బాబాపై 1976లో మరో విమర్శ చెలరేగింది. క్రిస్టియన్‌గా పుట్టిన టాల్ బ్రూకీ పద్నాలుగు నెలల పాటు బాబాతో ఉన్నాడు. అతడు 'అవతార ఆఫ్ ది నైట్' అన్న పుస్తకం రాశాడు. (భారత దేశంలోని మూడు వేల ప్రతులను కొనేసి తగులబెట్టారు.) ఈ పుస్తకంలో బాబా స్వలింగ సంపర్కం చేస్తాడని (ఒక మంచి క్రిస్టియన్ దీనిని ఎలా ఆమోదించ గలడు), చిన్న పిల్లలపై లైంగిక దాడులకు పాల్పడతాడని పేర్కొన్నాడు. 'నాదైన ప్రతీదీ నాది. డబ్బు, ఆహారం, ఏదైనా సరే. నువ్వు అడిగినదేదైనా నీ సొంతమవుతుంది" అని బాబా ప్రలోభ పరిచాడు. 'బాబా స్వభావానికి కామం విరుద్ధమైనది. కాబట్టి అది అతడిలో లేదు. పూర్తి విశ్వాసం... బాబా అమాయకుడు' అని మొదట్లో టాల్ బ్రూక్ భావించాడు. కానీ మూడు అనుభవాలతో, పిల్లలపై లైంగిక దాడులను గురించి మిత్రులు చెప్పిన దాంతో బాబా చేతి తదుముడులు, సన్నిహిత ప్రవర్తనలలో ఆత్మను శుభ్రపరిచేది ఏమీ లేదని తెలిసింది.

ఈ ఘటనల వార్తలు, తరువాతి సంఘటనలతో చాలా మంది మెదడులలో అనుమానపు బీజాలు పడ్డాయి. సాయిబాబా సొంత బావమరిది రాబీస్‌తో ఎలా చనిపోయాడు? మానసిక శక్తులతో శస్త్ర చికిత్సకుడు అయిన బాబా విరిగిన కాలు కోసం, అపెండిసైటిస్ కోసం ఆసుపత్రిలో ఎందుకు చేరాల్సి వచ్చింది? సాదా జీవనం గురించి ప్రచారం చేసే బాబా మెర్సిడీస్ కార్లలో ఎందుకు ప్రయాణం చేస్తాడు? అతడికి పోలీసు రక్షణ ఎందుకు? ఏదైనా తియ్యడానికి ముందు బాబా చేతులను గుండ్రంగా ఎందుకు తిప్పుతాడు? భారత దేశ ప్రఖ్యాత ఇంద్రజాలికుడు పి.సి. సర్కార్, బాబాని ప్రశ్నించిన ప్రేమానంద్‌లు చెప్పినట్టు హస్తలాఘవ ప్రదర్శనకు తయారీ కాదు. ఈ విశ్వం స్త్రీ, పురుష సూత్రమని అతడు చెప్పేదానికి అప్పుడప్పుడు అతడు మహిళలను కించపరిచేదానికి, మహిళల దుస్తులు ధరించేదానికి ఎలా సరిపోతుంది? పుట్టపర్తి నుంచి వచ్చిన అనేక మహిళల శవ పరీక్ష నివేదికల్లో హింసకి నిదర్శనాలు ఉన్నాయని వెల్లడయ్యిందని కొందరు డాక్టర్లు పత్రికా

ప్రకటన ఇచ్చారు. కొంతమంది విదేశీ భక్తులు తమ యావదాస్తినీ సత్యసాయి బాబాకి ఇచ్చిన, ధారాదత్తం చేసిన తరువాత మాయమై పోతున్నారన్న వార్తల్లో వాస్తవం ఎంత? పుట్టపర్తిలో బాబా నిలయమైన 'ప్రశాంతి నిలయం' నేరస్తుల ఆలవాలమన్నది నిజమేనా? ప్రశాంతి నిలయానికి భారత గృహశాఖ మంత్రి వస్తున్న సందర్భంగా జరిపిన తనిఖీలలో సయినైడ్, పేలుడు పదార్థాలతో పాటు, ముంబై హిందూ-ముస్లిం ఉగ్రవాదులు ఉపయోగించే ఆర్.డి.ఎక్స్. దొరకడం ఆశ్చర్యం కలిగించదా? సత్యసాయిబాబా మతం ఇస్లాం విలువలను కూడా పొందు పరుచుకుంది. అయితే ముస్లిం వ్యతిరేక హిందూ మతతత్వ విశ్వహిందూ పరిషత్ ప్రచారాన్ని అతడు ఎలా స్వాగతించాడు?

కానీ అన్నిటి కంటే పెద్ద అనుమానపు బీజాన్ని వేసింది డెక్కన్ క్రానికల్. 1992 నవంబర్ 23న సాయిబాబాకి లభించిన పుట్టిన రోజు బహుమతి. భారతదేశ ప్రధానమంత్రి సమక్షంలో సాయిబాబా బంగారునగను 'సృష్టించిన' చిత్రాలను ఆ పత్రిక ప్రచురించింది. సాయిబాబా వ్యక్తిగత సహాయకుడు రాధాకృష్ణ మీనన్ అతడికి నగను అందించడం, చేతులు ఊపి బాబా దానిని సృష్టించడాన్ని వీడియోలో బంధించారు. దాంట్లోని బొమ్మలనే పత్రికలో ప్రచురించారు. ప్రభుత్వ టీవీ కెమెరాలో బంధించిన దానిని దాచిపెట్టడానికి ప్రయత్నించారు. అయితే ఎలాగో ఒక ప్రతి బయటపడింది. దీనితో ఇది దేశ విదేశాలలో వ్యాప్తి అయ్యింది. దీనిని చిత్రీకరించిన పత్రకారుడైన వేణు కొడిమెలను హేతువాదులు సన్మానించారు.

దారుణాలు అప్పుడే అంతం కాలేదు. 6 జూన్ 1993న ప్రశాంతి నిలయంలోని సత్యసాయి బాబా పడక గదిలో ఆరుగురు ఆశ్రమ వాసులు హత్య చెయ్యబడ్డారు. వారిలో ఇద్దరిని దాడికి పాల్పడిన వారు చంపేశారనీ, దాడికి పాల్పడిన వారిని (వారి దగ్గర కత్తులు మాత్రమే ఉన్నాయి) ఆత్మరక్షణ కోసం చంపాల్సి వచ్చిందని పోలీలుసు పేర్కొన్నారు. తనకు పొంచి ఉన్న ప్రమాదాన్ని గుర్తించిన బాబా ప్రాణాలు అరచేతిలో పట్టుకుని పారిపోయాడు. తెరిచి ఉన్న కిటికీలోంచి బయటుకు దూకి కీలక సభ్యులకు కూడా తెలియని ప్రమాద ఘంటికను మోగించాడు. చనిపోయిన వారందరూ బాబా ఆంతరంగిక బృందంలోని వారే. బాబాకి దొంగచాటుగా నగను అందిస్తూ వీడియోలో దొరికిపోయిన వ్యక్తిగత సహాయకుడు రాధాకృష్ణ మీనన్ కూడా వీరిలో ఉన్నాడు. ఈ హత్యల గురించి, తన సన్నిహితుల చావు అనివార్యత గురించి బాబా తన గురుపూర్ణిమ ఉపన్యాసంలో ప్రస్తావించాడు. "జననం, మరణం కలిసే ఉంటాయి. మరణం సహజమైనదని గుర్తించాలి. దాని గురించి చింతిండం అనవసరం. స్వామి జీవితం అతని చేతుల్లోనే ఉంది. ఇంకా ఎవరి చేతుల్లోనూ లేదు. నేను కోరుకుంటే ఇష్టమొచ్చినంత కాలం జీవిస్తాను. సర్వశక్తిమంతుడైనంత మాత్రాన దేవుడు వేరుగా ప్రవర్తించలేడు. ఈ సత్యాన్ని తెలుసుకోలేక ప్రాపంచిక విషయాల్లో నిమగ్నమైన వారు జరగకూడని సంఘటనలలో దేవుడు ఎందుకు జోక్యం చేసుకోలేదని ప్రశ్నిస్తుంటారు...'

ప్రశాంతి నిలయం పోలీసు స్టేషన్‌లో నివేదికను బాబాపై హత్యారోపణ నుంచి అంతర్గత కుమ్ములాటలుగా మార్చారు. దేశ అధ్యక్షుడైన శంకర్ దయాళ్ శర్మ అన్నింటిని పక్కన పెట్టి 'ఒక అమ్మాయి విషయంలో' ఈ హత్యలు జరిగాయని అన్నాడు. సత్యసాయిబాబా పడకగదిలో హత్యలు జరిగినప్పుడు అతడిని, ఎందుకు ప్రశ్నించలేదని అడిగినప్పుడు, హత్యల తరువాత రెండుసార్లు వచ్చి వెళ్లిన గృహశాఖ మంత్రి చవాన్‌ని అడిగితే ఆ సమయంలో బాబా అక్కడ లేడని పరిశోధనలను మరింత నీరుకార్చాడు. అన్నింటికంటే ఆశ్చర్యపడవలసిన విషయమేమంటే ప్రశాంతి నిలయం అధికారులు పోలీసు ఫిర్యాదు చెయ్యలేదు. పోలీసుల జోక్యాన్ని కోరుకోవడం లేదంటూ ట్రస్టు సభ్యుడు ఒక ప్రకటన ఇచ్చాడు.

ఇంద్రజాలికుడైన బి. ప్రేమానంద్ ఒకప్పుడు బాబా భక్తుడుగా ఉండేవాడు. కానీ ఆ తరువాత గొప్ప హేతువాదిగా ఎదిగాడు. హత్య పరిశోధనలలో జోక్యాన్ని నిరసిస్తూ పోలీసులు సాక్ష్యాలను రూపుమాపు తున్నారంటూ అతడు కోర్టుకు వెళ్లాడు. అంతకుముందు సుప్రీంకోర్టులో హేతువాద అడ్వకేటుగా ఉన్న కె.ఎన్. బాలగోపాల్‌తో కలిసి ప్రేమానంద్ 'బంగారాన్ని సృష్టిచడం, కలిగి ఉండడం, అమ్మడం, బదిలీ చెయ్యడం ద్వారా' బంగారం నియంత్రణ చట్టాన్ని బాబా ఉల్లంఘించాడని కోర్టుకెళ్లారు. సత్యసాయి ఆంతరంగిక బృందంలోని సభ్యుడైన హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ వై.వి. ఆంజనేయులు ఈ కేసులో తీర్పు చెపుతూ ఆధ్యాత్మిక శక్తులతో సృష్టించిన వస్తువును తయారు చేసినట్లు చెప్పలేం అన్నాడు. ప్రతివాది తనకు మద్దతుగా ఆధ్మాత్మిక శక్తులను వినియోగించు కోవడం ఇదే మొదటిసారి ఏమో? ప్రస్తుత హత్య కేసులో ప్రేమానంద్ హైకోర్టులో ప్రజాప్రయోజన వాజ్యం దాఖలు చేశాడు. న్యాయం జరిగేలా చూడడానికి కేసును నిష్పక్షపాత పరిశోధనా సంస్థకి ఇవ్వాలని అతడు కోరాడు. ఈ పిటిషన్‌ని తిరస్కరించడమే కాకుండా సత్యసాయి బాబా ప్రతిష్టకి భంగం కలిగించే ఉద్దేశంతో మున్ముందు ఇటువంటి ఫిర్యాదులతో కోర్టుకి సమయం నష్టం చేస్తే శిక్షించాల్సి ఉంటుందని హెచ్చరించాడు. అయితే ఈ విషయంలో సుప్రీంకోర్టు తీర్పునిస్తూ హైకోర్టు న్యాయమూర్తి వ్యాఖ్యలను తొలగించింది. దీంతో హేతువాదుల నైతికత బలపడింది. సుప్రీంకోర్టు చివాట్లు వెయ్యడంతో ప్రభుత్వం, పోలీసు కోర్టు ధిక్కారనికి పాల్పడ్డారన్న ప్రేమానంద్ పిటిషన్‌ని హైకోర్టు స్వీకరించింది. ప్రేమానంద్, సాయిబాబాలు మరోసారి పత్రికా వార్తల్లో చోటు చేసుకున్నారు.

రెండు వందల కోట్ల రూపాయలతో నెలకొల్పిన సత్యసాయి ఆసుపత్రిలో వైద్య సేవలన్నీ ఉచితం. అయితే దీని గురించి దిగ్భ్రాంతి కలిగించే వార్త 1996 జనవరి 19న లోక్‌ప్రభ అన్న మరాఠీ పత్రికలో ప్రచురితమయ్యింది. మహారాష్ట్ర లాతూరు జిల్లాకి చెందిన త్రియంబక్ కర్వాండే అన్న రైతుకి అతడి కొడుకు నుంచి మూత్రపిండ మార్పిడి చేశారు. ఆపరేషన్ జరిగిన వారానికి ఆపేరషన్ విఫలమయ్యిందని తండ్రి కొడుకులను పంపించేశారు. మహారాష్ట్రకి తిరిగివెళ్లి ప్రభుత్వ వైద్యశాస్త్రం, పరిశోధనా కేంద్రంలో డా. కస్తూర్‌తో పరీక్షలు చేయించగా బాలాజీ నుంచి మూత్రపిండం తీసుకున్నది వాస్తవమే కానీ కార్వాండేకి దీనిని అమర్చి ఆపరేషన్ జరగలేదని తేల్చారు. మరి మూత్రపిండం ఏమైనట్టు? ఎంతో పేరు ప్రతిష్టలున్న ఆసుపత్రి వాస్తవానికి అంతర్జాతీయ అవయవ దొంగ వ్యాపారంలో భాగస్వామా? ఎన్నో అనుమానాలు, సమాధానాలు లేని ప్రశ్నలు.

పుట్టపర్తికి వచ్చే డబ్బు దండిగా ఉన్న అమెరికన్లు, స్కాండినేవియన్లు, బెల్జియన్లు, జర్మన్లు, డచ్, మలేషియన్లు, జపనీయులు కోసం విమానాశ్రయమే కాక మూడు వేల అతిథి గృహాలున్నాయి. సాయిబాబా చనిపోవడంతో ఈ రియల్ ఎస్టేట్ అంతా కుప్పకూలింది. వీళ్లంతా సాయిబాబాని చూడడానికే కదా వచ్చేవాళ్లు. ఒకే సమయంలో పది వేల మందికి భోజనం పెట్టే సదుపాయాలు ప్రశాంతి నిలయంలో ఉన్నాయి. సత్యసాయి సంస్థల స్థాయిని 1982లో 'ప్రజల భౌతిక, ఆధ్యాత్మిక అవసరాలన్నింటినీ తీర్చడానికి ఆరు వేల గ్రామాలను దత్తత తీసుకోవాలనుకోవడాన్ని బట్టి ఊహించుకోవచ్చు. దేశంలో మూడు వేల సత్యసాయి కేంద్రాలు, 85 ఇతర దేశాలలో నాలుగు వందల కేంద్రాలు ఉన్నాయి. సత్యసాయి బాల వికాస ట్రస్ట్ ద్వారా ఇరవై నాలుగు లక్షల మందికి ఉచితంగా చదువు చెపుతున్నామనీ, ఎన్నో సామాజిక సేవా కార్యక్రమాలు చేపట్టామని ఈ కేంద్రాలు ప్రచారం చేస్తాయి. సాయిబాబా ఖాతాలోకి డబ్బులు బదిలీ చేయించడానికి ప్రభుత్వరంగ సంస్థ అయిన యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ఎటువంటి రుసుమూ వసూలు చేయదు. బాబా ఖాతాలోకి డబ్బు ప్రవహిస్తూ ఉంటుంది. లక్షా యాభై వేల కోట్ల రూపాయల ఆస్తులు ఉన్న ట్రస్టు నిర్వహించే సేవా కార్యక్రమాలు ఇంతేనా?

1995లో సత్యసాయిబాబా తన 70వ పుట్టినరోజును జరుపుకున్నప్పుడు దేశ ప్రధాని, అధ్యక్షులు అనంతపురం జిల్లాలోని ప్రతి గ్రామానికి తాగునీటిని అందించే సత్యసాయి తాగునీటి పథకాన్ని ఆవిష్కరించడానికి వచ్చారు. తన బాధ్యతను తీసుకున్న సంస్థను ప్రభుత్వం ప్రశంసించడమా? తన బాధ్యతలో ప్రభుత్వం విఫలమైనప్పుడు ఆ స్థానాన్ని మత సంస్థలు ఆక్రమించుకుంటాయి. ఆ ఒక్కరోజునే పేరు అంతగా తెలియని ఒక అమెరికన్ సంస్థ, మరొక జపనీసు సంస్థ కలిపి సాయిసేవా కార్యక్రమాలకు 160 కోట్ల రూపాయలు ఇచ్చాయి.

సత్యసాయి మానవ సేవ గురించి గొప్పలు చెపుతుంటారు. హైస్కూలుతోనే చదువు ముగించిన బాబా చెప్పే మాటలు వింటే, సేవ పేరుతో చేపట్టే అతడి విద్యా కార్యక్రమాలను ఎందుకు వ్యతిరేకించాలో తెలుస్తుంది.

"విశ్వం మధ్యలో అంతా ద్రవం, అంతా కరిగి ఉంటుంది. వేడి ఉంటుంది. నీళ్లలాగా ద్రవరూపంలో ఉంటుంది. బంగారం, ఇనుము, వెండి అన్నీ ద్రవరూపంలో ఉంటాయి. ఆ తరువాత ఘన పదార్థం, ఆ తరువాత చెట్లు. ఆ తర్వాత జంతువులు, మనుషులు. కేంద్రకంలో దేవుడు ఉన్నాడు. అన్నిటికీ ఆధారం అతడే. మొదటిది ద్రవం, రసాయనిక శాస్త్రం. తరువాత ఘన పదార్థం, అంటే భౌతిక శాస్త్రం. ఆ తరువాత చెట్లు, అంటే వృక్షశాస్త్రం. జీవానికి పతాకంగా చివరికి మనిషి. మధ్యలో అన్నిటికీ ఆధారంగా దేవుడే ఉన్నాడు. దేవుడు లేకుండా రసాయనిక శాస్త్రం, భౌతిక శాస్త్రం, వృక్షశాస్త్రం ఎక్కడివి? మా విశ్వవిద్యాలయంలో బోధన ఈ విధంగా ఉంటుంది." విశ్వవిద్యాలయ గ్రాంట్ సాంఘిక చైర్‌పర్సన్ అయిన మాధురి షా సత్యసాయి భక్తురాలు. ఇతర విద్యాసంస్థలకు ధీటుగా సత్యసాయి ఉన్నత విద్యాసంస్థలను డీమ్డ్ విశ్వవిద్యాలయంగా ప్రకటించింది.

పేద దేశాలలో మానవ సేవ అనగానే చర్చ పరిధి హేతువును దాటిపోతుంది. విచారించదగ్గ విషయమేమంటే భారతీయులం ఇప్పటికీ శ్వేతజాతి ప్రభావంలో ఉన్నాం. తెల్లతోలు ఉన్న వాళ్లు వచ్చి దేనినైనా ఆమోదిస్తే ఇంకా మనం ఏమీ అనుమానించం. ప్రభుత్వ రేడియో, టి.వి.లు కూడ సత్యసాయి ప్రచారం చేస్తాయి. ఇది అతడి చివరి రోజుల్లో, పతాక స్థాయికి చేరుకుంది. అతడికి రాజకీయ భక్తులు లభించడంతో పరిస్థితి మరింత తీవ్ర రూపం దాల్చింది. ప్రధానమంత్రి నరసింహారావు, అతడి మంత్రివర్గం మొత్తం, దేశాధ్యక్షులు శంకర్ దయాళ్ శర్మ తమ అధికారిక హోదాలోనే సాయిబాబాని దర్శించడం మొదలుపెట్టారు. ఆ తరువాత వాజపాయి ప్రభుత్వమూ ఇదే పద్ధతిని అవలంబించింది. 1960ల నుంచే వాజపాయి సాయి భక్తుడు.

సదుద్దేశం గల చాలా మంది – సాయి అభిమానులు, భక్తులలో ఇటువంటి వాళ్లు చాలా మంది ఉన్నారు. మానవసేవ అన్నది సత్యసాయి బాబా సామ్రాజ్యం, భజనలో భాగమని గుర్తించాలి. మానవ సేవే ధ్యేయమైతే అతడి పుట్టిన రోజున సాయిబాబాతో నోటి నుంచి లింగం తీసే పనిని చేయించడు. సాయి అధికారులు ఒకసారి అతడు ఆకాశంలో కనపడతాడని ప్రకటించి అభాసు పాలయ్యారు. సాయిబాబా ట్రాఫిక్ జాంలో చిక్కుకున్నాడని చెప్పి దీనిని చివరి నిమిషంలో రద్దు చేశారు. చంద్రుడి మీద దర్శనం ఇద్దామనుకున్న దేవుడు ట్రాఫిక్ జాంలో చిక్కుకున్నాడు పాపం.

మేధావుల డొల్లతనం, రాజకీయ నాయకులు కుమ్మక్కు కావడం, సామాన్య ప్రజలు తమ విమర్శనాత్మక దృష్టిని విస్మరించడం వల్ల, శాస్త్రీయ దృక్పథాన్ని రాజ్యాంగ స్ఫూర్తికి విరుద్ధంగా తిరస్కరించడం వల్ల సత్యసాయి సామ్రాజ్యం దశదిశలూ వ్యాపించింది. అద్భుతాలుగా చలామణీ చేసిన ఘటనలు దీనికంతటికీ ఆకర్షణగా నిలిచాయి. సాయిబాబా చనిపోయినప్పుడు చేసిన తతంగం ఆధునిక దేశంగా ఎదగాలనుకుంటున్న మనని అందరి మధ్యా పలచన చేసింది.

*(రచయిత హేతువాది)*

*(అనువాదం : కె. సురేష్, 'మంచి పుస్తకం' నిర్వాహకులు)* వీ

**గమనిక :** ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూపాలన – 7వ భాగాన్ని సాంకేతిక కారణాల వలన ఈ సంచికలో అందించలేకపోతున్నాం. వచ్చే సంచిక నుంచి కొనసాగుతుంది. – సం.

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 23వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. – సం.

*ప్రైవేట్ రంగం ప్రాధాన్యం పెరిగిపోయాక ప్రణాళికా రచన ఆరో వేలుగా మిగిలిపోయిందని అంటున్నారు*

**వి. హనుమంతరావు**

# ప్రణాళికా వ్యవస్థకు ప్రణాళిక ఉందా?

రాష్ట్ర పదకొండవ ప్రణాళిక గుంటపూలు పూస్తోంది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఒక ప్రణాళిక ప్రకారం గుంట పూలు పూయిస్తోంది ప్రభుత్వం. ఇటీవల ఈ ప్రణాళిక ఆఖరు సంవత్సరం (2011-12) కేటాయింపును కేంద్ర ప్రణాళికా సంఘం ఖరారు చేసిన సందర్భంలో మన ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి ఢిల్లీ నుంచి వచ్చిన తర్వాత రాష్ట్ర ప్రభుత్వం కోరికను మించి కేటాయింపు జరిగిందని, గత ఏడాది కన్నా 17 శాతం ఎక్కువ కేటాయించారని జబ్బలు చరుచుకున్నారు. కాని పత్రికల్లో వచ్చిన సమాచారం ప్రకారం సంఘం ఉపాధ్యక్షుడు రాష్ట్ర ప్రభుత్వం వైఫల్యాలను ఎత్తి చూపించి ఎడాపెడా వాయించినట్ల నిపిస్తుంది. అవును మరి ప్రణాళిక అమలు తీరుతెన్నులు అలా ఉన్నాయి. ప్రతీ సంవత్సరం కేటాయింపు ఖర్చు నానాటికీ తీసికట్టు నాగంభొట్లుగా ఉంది.

| సంవత్సరం | కేటాయింపులో ఖర్చు శాతం |
|---|---|
| 2007-08 | 89.08 |
| 2008-09 | 69.59 |
| 2009-10 | 53.55 (డిసెంబర్ వరకు) |
| 2010-11 | 55.89 (డిసెంబర్ వరకు) |

చివరి రెండు సంవత్సరాల శాతాలు తొమ్మిదేసి నెలల ఖర్చు శాతం మాత్రమే. ఆ రెండు సంవత్సరాల ఖర్చు పూర్తి వివరాలు వచ్చే సంవత్సరం బడ్జెట్‌లోనే తెలుస్తాయి. మొదటి సంవత్సరం 2007-08లో పది శాతం ఖర్చు చేయలేకపోగా ఆ మరుసటి సంవత్సరంలో 30 శాతం ఖర్చుకాలేదు. మిగతా సంవత్సరాల ఖర్చు లెక్కలు లభ్యమైన తర్వాత కూడా 70 శాతం ఖర్చు అవుతుందనుకొన్నా మొత్తం మీద ప్రణాళిక అమలు చిల్లుకుండే అవుతుంది. పోనీ ఆ మేరకు ఫలితాలు ప్రజలకు చేరుతాయా అంటే 15 శాతం మాత్రమే చేరుతున్నాయని మాజీ యువరాజు రాజీవ్ చెప్పనే చెప్పారు. అప్పటికీ ఇప్పటికీ పరిపాలనా వ్యవస్థ, రాజకీయ నాయకుల అమ్యామ్యాలు మరింత ఎక్కువయ్యాయి కాబట్టి, ఆపాటి శాతం కూడా ప్రజలకు దక్కవనేది వేరే చెప్పాల్సిన పనిలేదు. ప్రణాళికా శాఖ ప్రచురించిన గణాంకాల ప్రకారం ఎనిమిదవ ప్రణాళికా కాలంలో (ఇందులో సగం కాలం, మిగతా సగం కాలం తెలుగుదేశం పాలన కలిసి ఉన్నాయి) 95.42 శాతం, తొమ్మిదవ ప్రణాళికా కాలంలో అంతే శాతం ఖర్చు అయింది. పదవ ప్రణాళిక (2002-03 / 2006-07)లో 89.45కు తగ్గింది. పదకొండో ప్రణాళిక అమలు తీరు తెన్నులేమిటో పైన చూశాం. ఈ ప్రణాళికా కాలంలో పూర్తిగా కాంగ్రెస్ అధికారంలో ఉంది కాబట్టి ప్రణాళికా సంఘం మొట్టికాయలు మొట్టడంలో ఆశ్చర్యం లేదు. ఈ వైఫల్యాలలో వైఎస్, రోశయ్య, కిరణ్‌కుమార్ ముగ్గురూ వైఫల్యంలో ఎలా వాటాలు పంచుకుంటారో వాళ్లకే వదిలేద్దా మనుకుంటే మొదటాయన మన మధ్య లేరు. రెండో ఆయన పదవిలో లేరు. కాగా ప్రస్తుతం అధికారంలో ఉన్న ముఖ్యమంత్రి ఈ పాప భారం మొయ్యాలి.

2010-11లో నూరు పేజీల సామాజికార్థిక సర్వేను, బడ్జెట్ సమావేశంలో శాసనసభ్యులకు అందజేశారు. ఈ ప్రణాళిక నాలుగు సంవత్సరాల కాలంలో (చివరి రెండేళ్ల లెక్కలు డిసెంబర్ వరకే ఉన్నాయి) ఏం జరిగిందో చూడబోతే కొట్టొచ్చినట్లు కనపడేది సమాచార ఖర్చు 152.51 శాతం పెరిగింది. ఎందుకిలా 50 శాతం పెరిగిందంటే ఈ కాలంలోనే సాధారణ ఎన్నికలు జరిగాయి, ఎడమ చేత్తో, కుడిచేత్తో ఎన్నికల సమయంలో ప్రభుత్వ ప్రచార కార్యక్రమాల కోసం (పాలక పార్టీ ప్రచారం కోసం అని చదవుకోవాలి) ఖర్చు చేసారని మనం అనుకోవాలి తప్ప ప్రభుత్వం చెప్పదు. అలాగే వ్యవసాయం తత్సంబంధిత రంగానికి ప్రణాళిక ఖర్చు నాలుగేళ్లలో 115.38 శాతానికి పెరిగింది. కేటాయింపు కన్నా ఎక్కువ ఖర్చు జరిగిందంటే, అందులోనూ నిర్లక్ష్యానికి గురవుతున్న ఈ రంగానికి ఎక్కువ ఖర్చు చేయడం హర్షించదగిన విషయమేనని సంతోష పడుతుంటే, ప్రణాళికా పుస్తకంలో మరో కోణం నుంచి ఈ రంగాన్ని విశ్లేషించిన గణాంకాలు కనిపించాయి. నూటికి 70 శాతం గ్రామీణ ప్రజలు ప్రత్యక్షంగా, పరోక్షంగా ఆధారపడే ఈ రంగానికి ప్రణాళిక మొత్తం కేటాయింపులో కేవలం మూడు నాలుగు శాతం మధ్యనే తచ్చాడుతోంది. ఈ కేటాయింపు 'వ్యవసాయం, తత్సంబంధిత రంగాల'కు చేసినది. అంటే తిండి గింజలు, పప్పు దినుసులు, వ్యాపార పంటలు, సహకారం వ్యవసాయ యాంత్రికీకరణ, పశుపోషణ, పండ్లు, కూరగాయల, చేపల పెంపకం, అడవులు, వ్యవసాయ పరిశోధన వగైరా వగైరా కార్యక్రమాలకు చేసిన కేటాయింపు ఇది. వీటన్నిటికీ ఖర్చు చేయగా కేవలం నేరుగా వ్యవసాయానికెంత ఖర్చు జరుగుతుందో ఊహించవచ్చు. కాగా వ్యవసాయం సంక్షోభంలో పడక ఏమవుతుంది? మాకీ వ్యవసాయం వద్దు మొర్రో అని రైతులు మొత్తుకొంటున్నారంటే మొత్తుకోరూ?

అసలు ప్రణాళికా రచనలోనే ప్రాథమిక లోపం మార్కెట్ ఎకానమీలో ప్రణాళిక రచించడం. మార్కెట్ ఎకానమీలో ధరలు ఎలా చుక్కలు చూస్తున్నాయో మనం చూస్తున్నాం, అనుభవిస్తున్నాం.

2007-08లో పదకొండవ ప్రణాళిక రచన జరిగింది. ఆ రోజున ఉన్న ధరల ఆధారంగా కేటాయింపులు చేశారు. ఈ నాలుగేళ్లలో ధరల మెరుగుదల మేరకు కేటాయింపు కుదించుకుపోతుంది. అప్పటి ధరల ప్రకారం నిర్ణయించిన లక్ష్యాల సాధన కూడా ఆ మేరకు తగ్గిపోతుంది. అదే సమయంలో అదే ధరల పెరుగుదల కారణంగా సామాన్యుని ఆదాయం తగ్గిపోతుంది. సామాన్యున్ని ఉద్దేశించి నిర్దేశించిన లక్ష్యాలు అతనికి చేరవు. అలాంటపుడు ప్రణాళిక సామాన్యుని కళ్లు కప్పడం తప్ప దానికి మన ఆర్థిక వ్యవస్థలో స్థానమేమీ లేదు. అసలు ప్రణాళికా సంఘం అనే మాట మన రాజ్యాంగంలో కనిపించదు. అది చట్టబద్ధ సంస్థ కానే కాదు కాని దేశం, రాష్ట్రాల ఆర్థిక జీవనాన్ని శాసించే అధికారం లేదు. కాగా ఈ సంస్థను ఆర్థిక పరిశోధనా సంస్థ స్థాయికి కుదించి, ప్రభుత్వానికి తన సూచనలను అందించే సంస్థగా మాత్రమే దాని పరిధిగా నిర్ణయించాలి. నెహ్రూ హయాంలో మొత్తం ఆర్థిక జీవనం ప్రభుత్వ రంగ పరిధిలో ఉన్నప్పుడు ఈ సంఘానికి ఒక పాత్ర ఉండింది. కాని రాను రాను ప్రైవేటు రంగం ప్రధాన రంగంగా పరిణమించిన తర్వాత ప్రణాళికా రచన ఆరోవేలుగా తయారైంది. ఉదాహరణకు వ్యవసాయ రంగమే తీసుకుంటే ఆహార ధాన్యాల ఉత్పత్తి లక్ష్యం 121 కోట్ల మంది ప్రజలకు తిండి గింజలనందించే వనరుగా కాక మార్కెట్ సరుకుగా మారింది. ఆహార ధాన్యాల ధరలను మార్కెట్ శాసిస్తోంది. ప్రణాళికా సంఘం ఈ మార్పును నిరోధించగలదా?

ప్రణాళికా రచన ప్రారంభించినపుడు, ప్రణాళికలో చేర్చిన అనేక పథకాల అమలు తీరు తెన్నులను, లోటుపాట్లను పరిశీలించడానికి, ఆ పథకాల ఫలితాలు ఏ మేరకు లక్షిత ప్రజలకు ఏ మేరకు అందుతున్నాయో తెలుసుకోవడానికి ప్రణాళిక ఎవాల్యుయేషన్ సంస్థను ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ సంస్థ నివేదికలు ప్రజలకు అందుబాటులో ఉండేవి. ప్రభుత్వ పథకాల ఫలితాలు ప్రజలకు పూర్తిగా చేరడం లేదని, ఫలానా కారణాల వల్ల ఈ లోపం జరుగుతోందని, ఆ లోపాలను సరిదిద్దడానికి ప్రభుత్వం ఏమి చేయాలో ఆ రిపోర్టులు సూచిస్తూ వచ్చాయి. ప్రభుత్వ పరిపాలనా యంత్రాంగం లోసుగులను, విధాన లోపాలను ఎత్తి చూపుడం ప్రభుత్వాన్ని ఇరకాటంలో పడవేయడంతో ఆ సంస్థల్ని మూసేసింది ప్రభుత్వం. సంస్థలను మూసేయగలదు కాని ప్రజల, పత్రికల నోరు మూయలేదు కదా. ఆ మేరకు పత్రికలు తమ వంతు పాత్రను పోషిస్తున్నందుకు సంతోషమే కాని రాజకీయాలక్షణంతో కొన్ని పత్రికలు ఆ అవకాశాన్ని దుర్వినియోగం చేయడం విచారకరం.

రాష్ట్రంలో ప్రణాళిక సలహా సంఘాలను శాసనసభ్యులు, నిష్ణాతులతో నియమించే పద్ధతికి కూడా రాష్ట్ర ప్రభుత్వం గుడ్‌బై చెప్పేసింది. అలాగే ప్రతి సంవత్సరం ప్రణాళిక, ఆ సంవత్సరం ఎంత మేరకు అమలు జరిగిందీ నివేదికలు ప్రభుత్వం ప్రచురిస్తూ వచ్చింది. ఇపుడు కూడా వార్షిక ప్రణాళిక పుస్తకాలు ప్రచురితమవుతున్నాయి. దానితోపాటు సామాజికార్థిక సర్వేలు కూడా అందుబాటులో ఉన్నాయి. కాని ప్రభుత్వం చేతుల్లో 'సర్వే' అనే పదానికి అర్థం మారిపోయింది. నాకు అర్థమైనంతవరకు ప్రభుత్వ పథకాలు ఎలా అమలు జరుగుతున్నాయి, కేటాయింపు ఖర్చు నియమ నిబంధనల ప్రకారం జరుగుతుందా, లక్ష్యాలు ఎంత మేరకు అమలు జరుగుతున్నాయి అనే విషయాలు తెలియచేయాలి. కానీ ఈ సర్వేలు ఆ పని చేయడం లేదు. బడ్జెట్ సమావేశంలో వివిధ శాఖల మంత్రులు వారి వారి శాఖల పనితీరును తెలియజేస్తూ, గణాంక వివరాలను పొందుపరుస్తాయి. ఉదాహరణకు ఇన్ని పాఠశాలలు, ఇంత మంది ఉపాధ్యాయులు, విద్యార్థులున్నారు లాంటి వివరాలుంటాయి. సర్వే చేయాల్సిన పని విద్యార్థులు, టీచర్లు హాజరవుతున్నారా, ఆ శాఖకు కేటాయించిన సొమ్ము సరిగా ఖర్చవుతుందా లేదా అనేది సర్వేలో పొందుపర్చాలి. లేకపోతే ఆ సర్వే పుస్తకం ప్రయోజనమే లేదు. అయినా, వల విసిరితే, లైను తర్వాత లైను చదివి ఇచ్చిన గణాంకాలను విశ్లేషించుకొంటే, ఒకటి అరా చేప వలలో చిక్కుతుంది.

ఉదాహరణకు ఉపాధి కల్పన గురించి రాస్తూ 'భారతదేశ సగటుతో పోల్చుకుంటే మిశ్రమ ఆర్థిక ఉపాధి వృద్ధి ఆంధ్రప్రదేశ్‌లో చాలా తక్కువగా ఉంది. అందుకు సంబంధించిన గణాంకాల పట్టిక చూస్తే, ఈ శతాబ్దం ఆరంభంలో (మార్చ్ 2000) ప్రభుత్వ రంగంలో ఉపాధి 15,03,28 మందికి ఉపాధి లభించగా, మార్చ్ 2010లో 13,53,352కు పడిపోయింది. అదే కాలంలో ప్రైవేటు రంగంలో ఉపాధి 568362 నుంచి 749590కు పెరిగింది. చంద్రబాబు హయాంలో ప్రభుత్వ, సహకార రంగంలో ఉన్న పరిశ్రమలను ప్రత్యేక అధికారిని నియమించి ప్రైవేట్ వ్యక్తులకు అయిన కాడికి అమ్మేయడం జరిగింది. ఇలాంటి ప్రభుత్వ వైఫల్యాలు సర్వేలో అక్కడక్కడ దర్శనమిచ్చాయి.

ఇటీవల శాసనసభ సమావేశంలో 2010 - 11 ఆర్థిక సర్వేలో దారిద్ర్యరేఖకు దిగువన ఉన్న జనాభా లెక్కలు 2004-05 వరకే ఉన్నాయి. ఆ తర్వాత పేదరికం మాయమైపోయిందా ఏమిటి? అలాగే అందరికీ ఇళ్ల పథకంలో ప్రణాళిక మొదటి సంవత్సరంలో ఎన్ని ఇళ్లు నిర్మించుకొన్నారో లెక్క ఇచ్చారు. (26.51 లక్షలు) 2010-11 సర్వేలో 2007-08 లెక్క ఇవ్వడమేమిటి? పదవ ప్రణాళికా కాలంలో వ్యవసాయ రంగం వృద్ధిరేటు నాలుగు శాతం ఉండగా, అదే లక్ష్యాన్ని 11వ ప్రణాళిక లక్ష్యంగా పేర్కొన్నారు. పరిశ్రమల రంగంలో ఎన్ని కొత్త పరిశ్రమలు స్థాపించారు, ఎంతమందికి ఉపాధి కల్పించారు వగైరా వివరాలేమీ లేవు. కేవలం సెజ్‌ల గురించి అయిదు లైన్ల సమాచారం ఉంది.

కేంద్ర ప్రభుత్వం నుంచి 113 ఆర్థిక మండలాలకు ఆమోద ముద్ర లభించగా, వాటిలో 74 నోటిఫై అయ్యాయని, 27 మండలాలలో పనులు మొదలయ్యాయని, 82606 మందికి ఉపాధి లభించిందని ఉంది. పనులు ప్రారంభమయ్యాయి అంటే నిర్మాణ పనులా, ఉత్పత్తి ప్రారంభించాయనా? సర్వశిక్షా అభియాన్ లక్ష్యాల గురించి చెప్పి, ఇన్ని కోట్లు ఖర్చు చేశాం. ఇన్ని పాఠశాల భవనాలు నిర్మించాం అని మాత్రమే ఉంది. నూటికి నూరు మంది పిల్లలను పాఠశాలల్లో చేర్చాలనే లక్ష్యం ఎంతవరకు సాధించింది చెప్పలేదు. స్టేట్ హార్టికల్చరల్ మిషన్ పథకం కింద ఇప్పటి వరకూ రు. 503.56 కోట్లు ఖర్చు జరిగిందని మూడు లైన్ల సమాచారం మాత్రమే ఉంది. ఏం పని జరిగింది, ఏం సాధించారు అనే సమాచారం లేదు. ఇలాంటి అరకొర సమాచారం సర్వే అవుతుందా? వార్షిక ప్రణాళిక కూడా ఇలాగే ఉందని వేరే చెప్పనక్కర్లేదు. ఆవు చేనులో మేస్తే, దూడ గట్టుమీద మేస్తుందా, ప్రణాళికా పుస్తకంలో గత సంవత్సరం ఏమి జరిగిందో ఉండదు. పథకం లక్ష్యం, వార్షిక ప్రణాళికలో ఆ పద్దుకు, పథకానికి కేటాయింపు మాత్రమే ఉంటుంది. వైద్య విధాన పరిషత్తు ఆధ్వర్యంలో జిల్లా, ఏరియా ఆసుపత్రులు,

*తెలంగాణకు నష్టదాయకమైన ప్రాజెక్టులకు వ్యతిరేకంగానూ, కృష్ణా-గోదావరి నదీ జలాలలో న్యాయమైన వాటాకోసమూ ప్రజలు సంఘటితంగా పోరాడాలని అంటున్నారు* **తోటపల్లి జగన్మోహనరావు**

# మరో సింగూరుగా ప్రాణహిత - చేవెళ్ల

**వా**ర్ధా నది (వెన్ గంగా), వైన్ గంగా అనే రెండు నదులు మహారాష్ట్ర నుండి వచ్చి ఆదిలాబాద్ జిల్లా కౌటాల మండలంలోని తుమ్మిడిహట్టి వద్ద సంగమించి ప్రాణహిత నదిగా మారుతుంది. ఈ రెండు నదుల కలయిక వల్ల నదిలో మధ్య ఒక లంక ఏర్పడింది. ఆ లంకకు రెండు వైపులా ప్రాణహిత నది ప్రవహిస్తుంది. అయితే తుమ్మిడిహట్టి వైపు పావలా వంతు పారితే, అవతలి మహారాష్ట్ర వైపు మూడువంతుల నీరు ప్రవహిస్తుంది. అంటే అక్కడి నీటివాలు మన వైపుకంటే ఎక్కువగా ఉంది. పైగా అట్టి నదిలో ఏర్పడ్డ లంక మహారాష్ట్రకు చెందినది. కాబట్టి ఎక్కడ కూడా ప్రాణహిత పై ఏ విధమైన ప్రాజెక్టును ఆ గవర్నమెంట్ అనుమతి లేనిదే కట్టలేం. పావలా వంతు ప్రవహించే నీటినే మనకు ప్రాణహిత - చేవెళ్ల ఎత్తిపోతల పథకం ద్వారా అందిస్తామని మన ప్రభుత్వం చెబుతూ ఉంది. ఎలాంటి అడ్డుకట్ట లేకుండా నీటిని ఎత్తిపోయడం సాధ్యమైతుందా? చిన్న ప్రవాహానికి యాతం పెట్టాలన్నా కనీసం గూడు మునగటానికైనా ఓ చిన్న గుంత అవసరమని ఏ సాధారణ రైతైనా చెప్పగలడు. మరి ఎలాంటి ప్రాజెక్టు లేకుండా 160 టి.ఎం.సి.ల నీటిని (మన శ్రీరాంసాగర్ కంటే దాదాపు మూడు రెట్లు ఎక్కువగా) ఎలా ఎత్తి పోస్తారు. దానికి వారి సమాధానం, అట్టి నీటిని ప్రాణహిత ఒడ్డు నుండి లోతుగా ఒక లోతైన బావిని తవ్వి దాని నుండి నిరంతరం 160 టి.ఎం.సి.ల నీటిని దాదాపుగా 750 మీటర్ల ఎత్తుకు ఎత్తి చేవెళ్లకు అందిస్తాం అంటున్నారు. అయితే ఈ క్రమంలోనే పదకొండు నీటి నిలువ ప్రాజెక్టులను కట్టడానికి ప్లాను చేశారు. (వాటిని పట్టికలో పరిశీలిద్దాం)

శ్రీపాద, మేడారం, మిడ్ మానేరు, అప్పర్ మానేరు నీరు పోను మిగతా చెరువుల సామర్థ్యం 13.15 టి.ఎం.సి.ల నిలువ సామర్థ్యం మాత్రమే. ఈ 13.15 టి.ఎం.సి.ల నీటి నుండి 160 టి.ఎం.సి.ల నీటిని ఏ విధంగా అందిస్తారో పాలకులకే తెలియాలి. (నిజానికి శ్రీపాద, మిడ్‌మానేరు నీటినే హైదరాబాద్‌కు తరలించే దుష్ట పన్నాగం మాత్రమే కాక కరీంనగర్ జిల్లా తూర్పున బొగ్గు గనుల ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్ట్‌లతోను, పడమరన గ్రానైటు ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్ట్‌లతోను మరో బొలివియాను చేయనున్నారు.)

---

కమ్యూనిటీ ఆరోగ్య కేంద్రాలు, స్పెషాలిటీ ఆసుపత్రులు, డిస్పెన్సరీలు 2009-10లో ఎన్ని ఉన్నాయో 2010-11లో కూడా అన్నే ఉన్నాయి. వైద్య శాఖ కేవలం రాజీవ్ ఆరోగ్య పథకం అమలు చేయడమే ఏకైక లక్ష్యంగా పెట్టుకొన్నట్లుంది. ఎందుచేతనంటే పేదలకు శస్త్రచికిత్సల సంఖ్య పెరుగుదల కన్పిస్తోంది. ఈ ఆపరేషన్లు అన్నీ ప్రైవేట్ ఆస్పత్రుల్లో జరుగుతున్నాయి. వాళ్ల జేబులు నిండుతున్నాయి. ఆ శాఖ అధికారులకు కూడా వాటా ఉండకపోదు. ఆరోగ్యశాఖ 2009-10లో లక్ష్యం హాస్టళ్లకు ప్రభుత్వ డాక్టర్లు వెళ్లి వైద్య పరీక్షలు చేయాలి. చేసారనే అనుకొందాం మందులు డాక్టర్లు ఇస్తారా? చీటి రాసి కొనుక్కోమని చెబుతారా?

వైద్యం, ఆరోగ్య శాఖకు ప్రణాళికలో కేటాయింపు మొత్తని ప్రణాళికా వ్యయంలో శాతంగా 2009-10లో 4.2 నుంచి 2010-11లో 4.01 శాతానికి, 2011-12లో 3.98 కి తగ్గింది. విద్య విషయానికి వస్తే మన రాష్ట్రం అక్షరాస్యతలో దక్షిణ రాష్ట్రాల్లో ఆఖరు స్థానంలో ఉంది. అభివృద్ధి పథంలో వెనుకబడిన ఒరిస్సా, మధ్యప్రదేశ్‌లకున్నా తక్కువ స్థానంలో ఉంది. ఇవి 2001 నాటి లెక్కలు. 2011 జనాభా లెక్కల ప్రకారం పై పరిస్థితిలో ఏమార్పులేదు. ఎక్కడవేసిన గొంగడి అక్కడనే ఉంది. జాతీయ సగటు (74.1 శాతం) కన్నా కూడా తక్కువే (67.7). ఎస్.సి., ఎస్.టి. జనాభాలో అక్షరాస్యత జనరల్‌గా తక్కువ. జనాభాలో వారి శాతం 22.8 గా ఉంది కాబట్టి, అక్షరాస్యత తక్కువ అవడానికి కారణమా? కానేకాదు. ఛత్తీస్‌గఢ్, మధ్యప్రదేశ్, ఒడిస్సా రాష్ట్రాల్లో వారి జనాభా మన రాష్ట్రంలో కన్నా ఎక్కువే అయినా, అక్షరాస్యత విషయంలో మన రాష్ట్రం కన్న ఎక్కువ స్థాయిలోనే ఉన్నాయి. 2009-10లో విద్యాభివృద్ధి సూచిక ప్రకారం ప్రాథమిక స్థాయిలో 17వ స్థానంలో, అప్పర్ ప్రైమరీ స్థానంలో 12వ స్థానంలో ఉంది. ఇదే 2008లో వరుసగా 12, 11 స్థానంలో ఉంది. అంటే పరిస్థితి ఇంకా దిగజారిందన్న మాట. జాతీయ సాంపిల్ సర్వే 2007-08 ప్రకారం బడిలో చేరని పిల్లల సంఖ్య ప్రతి వెయ్యి మందికి జాతీయ స్థాయిలో 250 కాగా మన రాష్ట్రంలో 213. ఇందుకు ప్రాథమిక కారణం, విద్య కూడా ఒక వ్యాపార వస్తువుగా మారిపోయింది. డబ్బున్న వాడికే చదువు, వాడికి సరిగా మార్కులు రాకపోయినా, పాస్ మార్కులు వేయించుకోగలుగుతారు. పేదల పరిస్థితి షరా మామూలే. ప్రణాళికలు ఈ పరిస్థితిని అధిగమించడానికి ఏం చేసాయన్న ప్రశ్న. అలాంటి ప్రణాళికా వ్యవస్థ ఉంటేనేం ఊడితేనేం?

*(రచయిత వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

| | ప్రాజెక్ట్ పేరు | కెపాసిటీ | ఉద్దేశం |
|---|---|---|---|
| 1 | ప్రాణహిత బ్యారేజీ | 5 టి.ఎం.సి. | ఎత్తిపోతలకు తయారుగా |
| 2 | శ్రీపాద ప్రాజెక్ట్ (ఎల్లంపల్లి) | 20 టి.ఎం.సి. | రామగుండం విద్యుత్ కేంద్రానికి, మంథనికి సాగునీరు, తాగునీటికి ఏ విధమైన అదనపు నీటని నిల్వ చేయలేదు. |
| 3 | మేడారం చెరువు | 0.58 టి.ఎం.సి. | పాత ఆయకట్టే 800 ఎకరాలు ఉంది. |
| | 30 టి.ఎం.సి.ల నీటిని కాకతీయ కాలువలో కలిపి పాత ఆయకట్టును ఎత్తిపోతలతో మార్చడానికి. | | |
| 4 | మోతె రిజర్వాయర్ | 1.65 టి.ఎం.సి. | వరద కాలువకు అడ్డంగా నిర్మించబడింది. (వరద కాలువ నీటిని మిడ్ మానేరుకు అందించడానికి మాత్రమే) |
| 5 | మిడ్ మానేరు ప్రాజెక్ట్ | 25 టి.ఎం.సి. | వరద కాలువ నీటి ద్వారా హుస్నాబాద్, జనగామలకు, అప్పర్ మానేరుకు ఎత్తిపోయ డానికి ఉద్దేశించబడింది. కొత్తనీటిని నిలువ చేయలేదు. |
| 6 | అనంతగిరి చెరువు | 1.7 టి.ఎం.సి. | కొత్త చెరువు |
| 7 | ఇమామాబాదు చెరువు | 1.5 టి.ఎం.సి. | కొత్త చెరువు |
| 8 | తడకపల్లి చెరువు | 1 టి.ఎం.సి. | కొత్త చెరువు |
| 9 | తిప్పారం చెరువు | 1 టి.ఎం.సి. | పాత చెరువు |
| 10 | పాములపర్తి చెరువు | 1.5 టి.ఎం.సి. | కొత్త చెరువు |
| 11 | చేవెళ్ల చెరువు | 3 టి.ఎం.సి. | పాత చెరువు |
| | మొత్తం నీటి నిలువ సామర్థ్యం | 60.93 టి.ఎం.సి. | |

| | |
|---|---|
| మొత్తం నీటి నిలువ సామర్థ్యం | 60.93 టి.ఎం.సి. |
| శ్రీపాద (ఎల్లంపల్లి), మేడారం, మిడ్‌మానేరు, అప్పర్ మానేరు నీరు | –47.78 టి.ఎం.సి. |
| ప్రాణహిత నుండి చేవెళ్లకు ఎత్తిపోయడానికి మిగిలిన నీటి చెరువుల సామర్థ్యం | 13.15 టి.ఎం.సి.లు మాత్రమే |

నిజానికి ప్రాణహిత – చేవెళ్ల ఎత్తిపోతలో భాగంగా, ఆదిలాబాద్ జిల్లా, కౌటాల మండలంలోని తుమ్మిడిహట్టి 5 టి.ఎం.సి.ల బ్యారేజీ ద్వారా ప్రాణహితలో లభించే 350 టి.ఎం.సి.ల నీటి నుండి 150 టి.ఎం.సి.లు ఎత్తిపోతల ద్వారా ఎల్లంపల్లికి తరలిస్తామని ఆ ప్రాజెక్ట్ అధికారులు అంటున్నారు. కాగా గతంలోనే గోదావరి జలాలు 1600 టి.ఎం.సి.లుగా లభించే చోటనే దేవాదుల వద్ద 50 టి.ఎం.సి.ల నీటని ఎత్తిపోయడంలో విఫలమైనారు. కారణం గోదావరిలో అమర్చిన పంపుపూటుబాళ్లు గోదావరి మట్టితో మేటవేయడమే కారణం. ఎగువన విదర్భలోనూ, మధ్యప్రదేశ్‌లోనూ విరివిగా తవ్వ బడిన ఓపెన్‌కాస్ట్ మట్టి దిబ్బల నుండి వార్ధా నది తెచ్చే మట్టితో, తుమ్మిడి హట్టి వద్ద అమర్చబోయే పంపుల ఫూట్‌బాళ్లు కూడా కప్పివేయ బడగా పని చేయకుండా పోతాయి. అందువల్ల ఎట్టి పరిస్థితిలోనూ ప్రాణహిత నుండి నీటిని ఎత్తి ఎల్లంపల్లిలో నింపడం సాధ్యం కాదు.

ఇక ఎల్లంపల్లిలోని 20 టి.ఎం.సి.ల ప్రాజెక్ట్ నుండే సాధ్యమైనన్ని నీటిని ఎత్తి (వర్షాకాలంలో అదనంగా లభించే నీటితో) మేడారం చెరువుకు, అక్కడి నుండి ఇప్పుడున్న కాకతీయ కాలువలో కలుపుతారు. అక్కడి నుండి మోతెవాగు వద్ద నిర్మించబడే బ్యారేజీకి ఎత్తిపోస్తారు. అక్కడి నుండి మిడ్‌మానేరుకు, అక్కడి నుండి అనంతగిరి, ఇమామాబాదు, తడ్కపల్లి, తిప్పారం, పాములపర్తి ద్వారా చేవెళ్లకు చేరుస్తారు. అయితే ఈ క్రమంలోనే కాకతీయ కాలువకు విద్యుత్ ద్వారా ఎత్తిన నీటినే ధర్మారం, చొప్పదండి, పెద్దపల్లి, సుల్తానాబాద్, కాలువ శ్రీరాంపూర్, ఓదెల, మంథని, రామడుగు, కరీంనగర్, లోయర్ మానేరు ప్రాజెక్ట్ ద్వారా మానకొండూరు, శంకరపట్నం, హుజూరాబాద్, జమ్మికుంట, ఎల్కతుర్తి మండలాలకు, కరీంనగర్, వరంగల్, హనుమకొండ జంటనగరాలకు కూడా కరెంట్‌తో ఎత్తిపోసిన నీటినే ఇవ్వడం వల్ల ఇటు సాగునీరు, అటు తాగునీరు కూడా చాలా ఖరీదుగా మారనుంది.

దీంతో ఇక శ్రీరాంసాగర్‌లో మిగిలిన నీటిని ఇటు మాన్చాని, కొండెం, భూంపల్లి చెరువుల ద్వారా ఎత్తి నిజామాబాద్‌కు జిల్లాలో మూడు లక్షల ఎకరాలకు, అటు హంగగా, దిల్వారాపూర్ చెరువుల ద్వారా ఎత్తి ఆదిలాబాద్‌లో లక్ష ఎకరాలకు నీటిని ఇవ్వనున్నది. ఇదివరకే గుత్ప, లెండిల ద్వారా యాభై వేల ఎకరాలకు నిజామాబాద్‌లో సాగునీటిని ఎత్తి ఇవ్వడం వల్ల శ్రీరాంసాగర్ చివర ఆయకట్టుదారులకు నీరందడం లేదు. ఇప్పుడు కాకతీయ కాలువ ద్వారా గ్రావిటీ ద్వారా సాగులోనున్న ఆయకట్టును అతి ఖరీదైన ఎత్తిపోతల పరం చేయనున్నారు. దీంతో నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్ (ఇది వరకు గ్రావిటీ కాలువ కింద ఉన్న ఆయకట్టును) జిల్లాలో ఎనిమిది లక్షల ఎకరాల రైతులతో పాటు, తాగునీటిని కూడా అతి ఖరీదైన ఎత్తిపోతల పథకం కిందికి మార్చనున్నారు. దీన్నే తెలంగాణ ప్రజల చిరకాల స్వప్నంగా నీటిపారుదల శాఖ అధికారులు వర్ణిస్తూ ఉన్నారు.

ఇక్కడ ఇప్పుడు నిర్మిస్తూ ఉన్న పోలవరాన్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది. భద్రాచలంలోని కూనవరం దిగువన రామగిరి నుండి పోలవరం దాకా గోదావరి పాపికొండల మధ్య 100 నుండి 150 మీటర్ల లోతుల్లో ప్రవహిస్తోంది. పైగా సంవత్సరం పొడుగూతా 2500 టి.ఎం.సి.ల పైగా నీటి లభ్యత ఉంటుంది. ఇలాంటి చోట నిజానికి కేవలం 80 టి.ఎం.సి.ల నీటిని ఎత్తి పోయడానికి, దేవాదుల కంటే, తుమ్మిడి హట్టివద్దకంటే అనువైనది. కాని నిరంతరం కరెంట్‌పై ఆధారపడడం ఇష్టంలేకనే భద్రాచలం, బూర్గంపాడు పాత తాలూకాను భద్రాచలంతో సహా ముంచి వేయడానికైనా ఆంధ్రా పాలకులు తెగిస్తూ ఉన్నారు. ఎత్తిపోతలకు ఏ మాత్రం అనువుగాని దేవాదుల నుండి 50 టి.ఎం.సి.లు, ప్రాణహిత నుండి 160 టి.ఎం.సి.లు ఎత్తిపోస్తా మనడం కేవలం మోసపూరితం మాత్రమే కాక పాలకుల ద్వంద్వ నీతికి నిదర్శనం.

నిజంగానే ఎత్తిపోతలు సాధ్యమే అనుకుందాం. ఎంత కరెంట్ కావాలి? ఈ 160 టి.ఎం.సి.ల నీటిని 750 మీటర్ల వరకు ఎత్తి పోయడానికి 3,500 మెగావాట్ల కరెంటు కావాలి. దానికోసం మరికొన్ని కరెంటు కేంద్రాలు, వాటికి బొగ్గు కోసం మరిన్ని ఓపెన్ కాస్ట్ బొగ్గు

గనులు, వాటికై గోదావరి నది ఒడ్డుననే ప్రత్యక్షంగా 20 గ్రామాలను, పరోక్షంగా మరో 40 గ్రామాలను, అడవులను, వాగులను, వంకలను, చెరువులను ధ్వంసం చేయవలసి ఉంటుంది. ఈ విధంగా అయ్యే పర్యావరణ విధ్వంసం మాకు సంబంధించింది కాదని కేవలం ఎత్తిపోతలు, కట్టవలసిన ప్రాజెక్టులు, కాలువలకు సంబంధించిన పర్యావరణం మాత్రమే మా బాధ్యత అనడం పచ్చి మోసం తప్ప ఇంకోటి కాదు. 3,500 మెగావాట్ల విద్యుత్ కేంద్రానికి, మరి 20 బొగ్గు గనుల ఒ.సి.పి.లకు, వాటికై కావలసిన రైలు, రోడ్డు వగైరాలకు మరో లక్ష కోట్ల రూపాయలు ఖర్చు చేయాల్సి ఉంటుంది. ఈ ఖర్చును కూడా కలిపితే ప్రాణహిత – చేవెళ్ల 1 లక్షా 40 వేల కోట్ల రూపాయలకు దాటనుంది. ఇక ఈ ప్రాజెక్టు పూర్తి అయ్యే సమయానికి ఇది 1 లక్షా 50 వేల కోట్ల నుండి రెండు లక్షల కోట్ల రూపాయలకు దేకినా ఆశ్చర్యపడనక్కర లేదు. నిజానికి మరో 3,500 మెగావాట్ల విద్యుత్తు కేంద్రం, మరి దానికి అవసరమగు బొగ్గు ఒ.సి.పి.లను తవ్వడానికి, ఈ ప్రాణహిత చేవెళ్ల ఒక సాకు మాత్రమే. ఇదివరకే సిర్పూరు కాగజ్‌నగరం నుండి చింతలపూడి వరకు ఇప్పుడున్న ఒ.సి.పి. వల్ల గోదావరి నది సముద్ర మట్టానికి మరో 300 మీటర్ల లోతుల్లోనికి చేరనుంది. ఇదివరకే తెలంగాణ ఎత్తున, గోదావరి వంపున ఉన్నందు వల్ల గోదావరి నదిలోని నీరు తెలంగాణకు చెందదు. ఆ నీరు స్వతహాగా దిగువ ఆంధ్రాకే చెందాలి అని వాదిస్తూ ఉన్న కోస్తా పెత్తందారీ వర్గాలకు ఈ ఒ.సి.పి.లు మరింత అవసరం. అందుకే ఎడా, పెడా తెలంగాణలో ఒ.సి.పి.లు తవ్వి ఇటు బొగ్గు, అటు తెలంగాణలో లోతుల్లో ఇంకిన నీటిని ఆంధ్రాకు తరలించే కుట్రే ఈ ప్రాణహిత – చేవెళ్ల పథకంగా అర్థం చేసుకోవాలి.

3,500 మెగావాట్ల కరెంటుతో ఎత్తిపోస్తే ఎకరాకు సరాసరి 20 వేల నుండి 25 వేల రూపాయలు ఖర్చు అవుతుంది. ఇంత ఖర్చు తెలంగాణ రైతులు భరించి వ్యవసాయం చేయగలరా? ఇప్పటికే కేంద్ర ప్రణాళికా సంఘం, ఆర్థిక సంఘాలు విద్యుత్తుపై ఇచ్చే రాయితీని ఎత్తివేయాలని రాష్ట్ర ప్రభుత్వంపైన ఒత్తిడి తెస్తూ ఉన్నారు. అలాంటి పరిస్థితులలో ఇంత ఖర్చు కాగల పథకం రూపొందించడంలో అర్థం లేదు. పైగా గోదావరి నీటిని పెద్ద మొత్తంలో హైదరాబాద్‌కు తరలించడం అంటే పరోక్షంగా గోదావరి నీటని కృష్ణా నదికి మూసీ ద్వారా తరలించడమే కాగలదు.

ఇక ప్రాణహితకు ఉపనది అయిన వార్దా (వెన్ గంగా) నది. ఆ నది పుట్టిన మధ్యప్రదేశ్ నుండి చంద్రాపూర్ జిల్లాలోని బల్లార్ష వరకు ఎడాపెడా బొగ్గుగనుల ఓపెన్‌కాస్టులు తవ్వబడుతున్నాయి. వాటి నుండి నేల కోత లక్షల టన్నులలో ఉండి మట్టి ప్రాణహితలో చేరుతుంది. అంతేకాక వార్ద, వైన్ గంగా నదులు చాలా ఒండ్రు మట్టిని వరదలతో తీసుకువచ్చి ఒడ్డులలో మేటవేస్తోంది. అటువంటి నదికి ఎలాంటి ఆనకట్ట లేకుండా ఎత్తిపోతలు కట్టడం వృథా ప్రయాస మాత్రమే కాగలదు. ఇంతవరకు గోదావరిపై గాని, దాని ఉప నదులపై గాని కట్టిన వందలాది చిన్న చిన్న లిఫ్టులలో ఏ ఒక్కటి నడవడం లేదన్నది నిజం కాదా? (ఒక్క మంజీరా తప్ప. అదీ మంజీరా ప్రాజెక్టు కట్టడం వల్లనే విజయవంతం అయింది.) అంతెందుకు చంద్రబాబు హయాంలో ఆర్భాటంగా ప్రారంభించిన దేవాదుల ఎత్తిపోతల పథకం, ఎలాంటి ప్రాజెక్టు లేకపోవడం వల్ల బురదనీటితో కూరుకుపోయిన సంగతి అందరికీ తెలిసిందే కదా. మరి ఈ పథకానికి కూడా అదే గతి పట్టదన్న గ్యారంటీ ఏమైనా ఉందా?

కావున తుమ్మిడిహట్టి నుండి ప్రాణహిత నీటిని ఎట్టి పరిస్థితుల లోనూ 160 టి.ఎం.సి.లు ఎత్తిపోయడం సాధ్యంకాని విషయం. ఒకవేళ ఎత్తిపోయాలంటే కనీసం 100 టి.ఎం.సి.ల సామర్థ్యం గల నీటి రిజర్వాయర్‌లు అవసరం. కాని మొత్తం చేవెళ్ల – ప్రాణహిత పథకంలో నిర్దేశించిన రిజర్వాయర్‌ల సామర్థ్యం కేవలం 60.93 టి.ఎం.సి.లు మాత్రమే, అనగా ఎల్లంపల్లి, మిడ్‌మానేరు నీటినే హైదరాబాద్ తరలించే దుష్టపన్నాగం మాత్రమే. ముప్పై సంవత్సరాల క్రితం మంజీరా నది నీటికి మెదక్ రైతులకు ఇస్తామని నమ్మించి, నిజాంసాగర్ ప్రాజెక్టు ఎగువన సింగూరు ప్రాజెక్టును కట్టి ఆ నీటిని మెదక్ నిజమాబాద్‌లకు ఇవ్వకుండా హైదరాబాద్‌లకు తరలించినారు. దాంతో మెదక్, నిజామాబాద్‌లు, శ్రీరాంసాగర్ ప్రాజెక్టులు సుమారు 40 టి.ఎం.సి.ల నీటితోపాటు భూగర్భ జలాలను కూడా పోగొట్టుకున్నాయి. అలాంటి నీటిని హైదరాబాద్‌కు తరలించగా డ్రైనేజి నీరు కృష్ణా నదికి తరలించడమైనది. ఇప్పుడు ఈ ప్రాణహిత – చేవెళ్ల పేరుతో ఎల్లంపల్లి, మిడ్‌మానేరులు కరీంనగర్ పాలిట మరో సింగూరు ప్రాజెక్టులుగా మారి దాదాపు 60 టి.ఎం.సి.ల గోదావరి నీటిని కరీంనగర్, మెదక్‌ల గుండా హైదరాబాద్‌కు, తద్వారా కృష్ణా నదికి తరలించడమే కాగలదు.

ఇలాంటి పథకాలు తెలంగాణ పైననే ఎందుకు రుద్దుతున్నారో చూద్దాం. ఇలాంటి అక్కరకు రాని పథకాలపై కోట్లాది రూపాయల ఖర్చు తెలంగాణ అభివృద్ధి ఖాతాలో చూయించి ప్రపంచాన్ని, కేంద్రాన్ని లేదా శ్రీకృష్ణ లాంటి కమిటీలను నమ్మించడానికి మాత్రమే తప్ప నిజంగా తెలంగాణ ప్రజలకు తమకు చెందవలసిన నీటిని ఇవ్వకపోవడమే కాగలదు. ఇలా జరగడానికి కారణం ఉమ్మడి విశాలాంధ్రలోని తెలంగాణ నిధులతోనే, తెలంగాణ నీటిని, బొగ్గును, గ్రానైట్‌ను, అడవి, ఇతర రకాల అన్ని వనరులతో పాటు చురుకైన మానవ వనరులను ఆంధ్రా పెట్టుబడిదారులు దోచుకోవడం కోసం మాత్రమే. అందులో భాగంగానే నీళ్లు రాని వందలాది ప్రాజెక్టులు, ఆంధ్రా కంట్రాక్టర్లచే నిర్మించబడి, ఆంధ్రా పెట్టుబడిదారుల బొక్కసాలు నింపడం మాత్రమే. అట్టి డబ్బుతోనే వారు హైదరాబాద్‌ను, రంగారెడ్డి జిల్లాలను ఆక్రమించుకోగలిగారు.

1982 నాటి కేంద్ర ప్రభుత్వం జల విధానం ప్రకారంగా 'నీటి వనరులు ప్రధానంగా ప్రజల కోసం, ప్రజల చేత నిర్వహించబడి, వారికే వినియోగించబడాలి' అన్న లక్ష్యం నుండి దిగజారి 2002లో కేంద్ర జల విధానంలో నీటి వనరులను అన్ని సరుకులలాగే ఇది ఒక సరుకు మాత్రమే అనే ఉద్దేశ్యంతో 'పూర్తిగా ప్రైవేటు భాగస్వామ్యంతోనే నీటిని అమ్మాలని' ఉద్దేశించారు. ఇది పూర్తిగా ప్రపంచ బ్యాంక్, సలహాల ననుసరించే, నూతన ఎల్.పి.జి. (లిబరలైజేషన్, ప్రైవెటైజేషన్, గ్లోబలైజేషన్) పథకాన్ననుసరించే మొట్టమొదటగా తెలుగుదేశం, నారా చంద్రబాబు హయాంలో తెలంగాణలో దేవాదుల తలపెట్టినాడు. అందులో బడా బడా ఆంధ్రా కంట్రాక్టర్లు కోట్లాది రూపాయలు దండుకున్నారు. ఇక మేము మాత్రం తక్కువ తినాలా అని కాంగ్రెస్ రాజశేఖరరెడ్డి 'ప్రాణహిత – చేవెళ్ల'ను తెలంగాణ కోసం తలపెట్టినాడు. ఏట్లాంటి ప్రజాభిప్రాయం లేకుండానే ఇప్పటికే వేలాది కోట్ల

రూపాయలను పైపుల తయారీకి, వాటి రవాణా కోసం, వాటిని అమర్చడానికి ఖర్చు చేశారు. తెలుగుదేశంవారు దేవాదుల అనుభవాన్ని కూడా ఈ సందర్భంగా పరిశీలించలేదు.

ఈ సందర్భంగా గత ఎన్నికలకు ముందుగా తెలంగాణ శాసన సభ్యులంతా కలిసి ఇచ్చంపల్లిని నిర్మించాలని, దాని ద్వారానే తెలంగాణకు నీరందుతుందని ఇచ్చంపల్లికి యాత్ర చేశారు. బి.జె.పి. వారైతే యాత్ర చేయడమే కాక ఇచ్చంపల్లి వద్ద గోదావరి మాత విగ్రహాన్ని కూడా నిర్మించారు. కాని విచిత్రంగా అధికారంలోకి వచ్చిన తరువాత తెలంగాణ కాంగ్రెస్ శాసనసభ్యులు నీరు రాని ప్రాణహిత – చేవెళ్లతో సంతృప్తి చెందగా, ఇతర ప్రతిపక్షాలు సైతం సాధ్యాసాధ్యా లను, లోటుపాట్లను ప్రజల దృష్టికి తీసుకురావడంలో విఫలం కావడమే కాక, కోట్లాది రూపాయల వృథా ఖర్చును తెలంగాణ ఖాతాలో జమకావడానికి దోహదకారులవుతున్నారు. దీనికి కారణం అన్ని రాజకీయ పక్షాలు నూతన ఎల్.పి.జి. విధానాన్ని ఒక్క తెలంగాణలోనే అమలు చేయడానికి, ఆంధ్రా కాంట్రాక్టర్ల ప్రయోజనాలను కాపాడడానికి వెన్నుదన్నులు ఇవ్వడమే కారణం. నిజంగానే తెలంగాణకు ఎట్టి పరిస్థితులలోనూ నీటిని సహజమైన కాలువల ద్వారా ఇవ్వలేమా? ఇవ్వవచ్చని నిజాం కాలంలో వేయబడిన ప్రణాళికలు చెబుతున్నాయి. కాని గత యాభై సంవత్సరాలుగా వాటిని పరిశీలించి, అమలులోనికి తీసుకురావడం ఇష్టంలేని ఆంధ్రా పాలకులు, అదే సమయంలో వారికి అనుగుణంగా ఉండే ప్రణాళికలను యుద్ధ ప్రాతిపదికన అమలు పరుస్తున్నారు. ఇటు దేవాదుల, ప్రాణహిత–చేవెళ్లను నూతన జలవిధానంలో భాగంగా అమలు చేయడానికి ప్రయత్నిస్తూ, అదే సమయంలో తెలుగు గంగ (తెలుగు దొంగ) – దీనికి ఎలాంటి కేటాయిపులు అధికారికంగా ఉండవు. కింది నుంచి మీది దాక బినామీ పద్ధతిలో నడుస్తూంది), పోలవరం, పోతిరెడ్డిపాడు మొదలయిన ప్రాజెక్టులు 1982 జల విధానం ద్వారా నిర్మించడం ఆంధ్రా పాలకుల ద్వంద్వ నీతికి నిదర్శనం.

నిజాం కాలంలో శ్రీరాంసాగర్ (పోచంపాడు) ను నిజానికి ఇప్పటి బాబ్లీ వద్ద 360 టి.ఎం.సి.ల సామర్థ్యంతో కట్టి నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, మెదక్, వరంగల్ జిల్లాల్లో 36 లక్షల ఎకరాలకు సాగునీరు ఇవ్వ ప్రతిపాదించారు. అదే విధంగా దిగువన ఇచ్చంపల్లిని నిర్మించి వెయ్యి మెగావాట్ల విద్యుత్తుతో పాటు వరంగల్, ఖమ్మం జిల్లాలకు నీటిని అందించడానికి ప్లానులు వేశారు. ఇక భీమా, నెట్టెంపాడు, జూరాల, ఇప్పటి నాగార్జునసాగర్‌కు ఎగువగా ప్రాజెక్టును కట్టి మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాలకు నీటిని అందించే ప్రణాళికలు వేశారు. ఆ క్రమంలోనే 1852లోనే ఇచ్చంపల్లి ప్రాజెక్టు నిర్మాణాన్ని ప్రారంభించారు కూడా. కాని ప్లేగు వ్యాధిబారిన పడి అప్పటి ఇంజనీర్లు మృతి చెందగా అర్ధాంతరంగా నిలిపి వేయబడింది. న్యాయానికి ఆంధ్రప్రదేశ్ ఏర్పడినప్పుడు మొదట 1852లో ప్రారంభించిన ఇచ్చంపల్లిని నిర్మించడానికి బదులు ఆంధ్రా వారికి అనుగుణంగా నాగార్జునసాగర్‌ను ఇప్పటి స్థలంలోనే తెలంగాణ మిగులు నిధులతోనే నిర్మించి, తెలంగాణ ప్రజలను ముంచి, ఆంధ్రకు పారించుకున్నారు. ఈ విధంగా నాగార్జునసాగర్ వద్ద పేరు మనది, ఊరువారిదైంది.

నిజాం రాజ్యంలోని అప్పటి మరట్వాడా, కర్ణాటక ప్రాంతాలకు సింగరేణి బొగ్గుతో నిజాం చిన్న, చిన్న కరెంటు కేంద్రాలను నిర్మించి నాడు, ఇప్పటికి కూడా మన సింగరేణి బొగ్గును మహారాష్ట్రకు సంవత్సరానికి కోటి టన్నులపైన, అటు కర్ణాటకకు మరో కోటి టన్నులను తరలించగా పెద్ద ఎత్తున కరెంటు ఆయా రాష్ట్రాల్లో ఉత్పత్తి చేస్తూ ఉన్నారు.

ఆ క్రమంలో ఉత్తర తెలంగాణలో పర్యావరణ విధ్వంసం విపరీతంగా జరుగుతోంది. దానికి బదులుగా మహారాష్ట్రను ఒప్పించి పూర్తిస్థాయిలో, అనగా 150 టి.ఎం.సి.ల సామర్థ్యంతో గోదావరిపై ఇప్పుడు కడుతున్న బాబ్లీని కడితే నిజామాబాద్, మెదక్, ఆదిలాబాద్, రంగారెడ్డి, ఎగువ కరీంనగర్ జిల్లాలకు 20 లక్షల ఎకరాలకు నీటిని అందించవచ్చు. అదే విధంగా కర్ణాటక ప్రభుత్వాన్ని ఒప్పించి ఆలమట్టి వద్ద ఇప్పుడు కడుతున్న ప్రాజెక్టు సామర్థ్యాన్ని పెంచితే మహబూబ్ నగర్, మెదక్, రంగారెడ్డి, నల్లగొండలకు నీటిని అందించవచ్చు. ఆ క్రమంలో శ్రీరాంసాగర్‌లో తక్కువ పడిన నీటిని సింగూరు మంజీరా నదుల ద్వారా, నిజాంసాగర్‌కు తరలించి, తద్వారా శ్రీరాంసాగర్‌కు మళ్లించాలి. ఇక హైదరాబాద్‌కు సింగూరు నుండి గోదావరి నీటిని కాక, దాని హక్కుగా కృష్ణా నది నీటిని నాగార్జునసాగర్ నుండి కాని, శ్రీశైలం నుండి కాని తరలించాలి. ఇలాగ న్యాయంగా తెలంగాణకు చెందాల్సిన నీటి కోసం ఎలాంటి ప్రజాఉద్యమాలను నిర్మించని కాంగ్రెస్, బి.జె.పి., సి.పి.ఐ., సి.పి.ఎం., తెలంగాణ తెలుగుదేశం వారు, చివరకు తెలంగాణ రాష్ట్ర సమితి వారు కూడా ప్రజలకు శాశ్వతంగా ఎలాంటి ప్రయోజనాలివ్వని, ఆంధ్రా పాలకులకు ఉపయోగపడే ప్రాణహిత–చేవెళ్ల, దేవాదుల లాంటి ప్రాజెక్టులకే పరిమితమై తెలంగాణ ప్రజానీకాన్ని చీకటిలోనే ఉంచే ప్రయత్నాలు చేస్తూ ఉన్నారు. పైగా ఆంధ్రా పాలకులతో కాంగ్రెస్, తెలుగుదేశం వారు ప్రత్యక్షంగాను, ఇతరపార్టీల నాయకులు పరోక్షంగాను కుమ్మక్కు అవడం వల్లనే తెలంగాణ ప్రజలు తమకు న్యాయంగా చెందవలసిన నీటిని, తద్వారా చెందవలసిన అభివృద్ధికి దూరం చేయబడడమే కాక, తీవ్రమైన దోపిడీ, పీడన, అణచివేతలకు గురవుతున్నారు.

వెంటనే బాబ్లీ ప్రాజెక్టును 150 టి.ఎం.సి.లకు పెంచి, ఆ నీటిని ఉత్తర తెలంగాణ జిల్లాలకు మళ్లించాల్సిందిగాను, లేకుంటే మన బొగ్గు నిల్వలను మహారాష్ట్రకు ఆపుతామని ప్రజా ఉద్యమం చేపట్టాలి. అదే విధంగా ఆల్మట్టి ద్వారా నీటిని దక్షిణ తెలంగాణకు ఇవ్వాలని కర్ణాటక ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలి. అదే విధంగా ఆంధ్రాకు బొగ్గును నిలిపివేసి, సింగూరు నీటిని ఉత్తర తెలంగాణ జిల్లాలకు, కృష్ణా నదిలో మన నీటి వాటాకై ఉద్యమించాలి. యుద్ధ ప్రాతిపదికన ఇచ్చంపల్లిని నిర్మించాలని కూడా ఉద్యమించాల్సి ఉంది. ఇవ్వన్నిటిని సాధించాలంటే ఇప్పటి భ్రష్టుపట్టిన తెలంగాణ రాజకీయ నేతలందరినీ పక్కనపెట్టి, తెలంగాణ రైతు సంఘాలు, సింగరేణి కార్మికులు, తెలంగాణ విద్యుత్ ఉద్యోగులు, తెలంగాణ ఆర్.టి.సి. కార్మికులు, తెలంగాణ ఉద్యోగ సంఘాలు, విద్యార్థి సంఘాలు, ఇంజనీర్లు, డాక్టర్లు, లాయర్లు అన్ని మేధావి వర్గాలు, ప్రజలంతా ఏకమై కృష్ణా, గోదావరులలో మన నీటి వాటాకై పోరాడవలసిన అవసరం ఉంది. ఈ క్రమంలోనే మనకు ఏ మాత్రం ఉపయోగపడని ప్రాణహిత – చేవెళ్ల ప్రాజెక్టును వ్యతిరేకిద్దాం.

*(రచయిత తెలంగాణ భూమి రక్షణ సంఘం కో–కన్వీనర్)* వీ

*పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపూర్ ప్రాంతం లేసు పరిశ్రమలోని మహిళా కార్మికుల ఉదాహరణతో అసంఘటిత రంగంలో జరుగుతున్న దారుణమైన దోపిడీని వివరిస్తున్నారు* **కె. సుభాషిణి**

# లేసు పరిశ్రమలో మహిళా కార్మికులు

**కు**లం కొందరికి వరం. మరికొందరికి శాపం. కులాన్ని సామాజిక ఆధిపత్య హోదాగా అనుభవిస్తున్న కొందరు మహిళలు సంప్రదాయం, కట్టుబాట్లు, ఆంక్షల మధ్య చిక్కుకుపోయి ఆర్థికంగా ఎదగలేని స్థితిలో ఉన్నారు. కులపరమైన వివక్షను ఎదుర్కొంటున్న మరికొంత మంది మహిళలు అవకాశాలను అందుకోవడానికి తగిన చైతన్యం లేక సమాజంలో అట్టడుగు స్థాయిలో ఉండి పోతున్నారు.

పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపూర్‌లోని లేస్‌పార్క్‌ను ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక సందర్శించింది. అక్కడ పనిచేస్తున్న మహిళా కార్మికులను కలిసి మాట్లాడినప్పుడు, వారు ఎంతగా ఆర్థిక దోపిడీకి గురి అవుతున్నారో అర్థం అయింది.

నర్సాపూర్ చుట్టుపక్కల గ్రామాల్లో పెద్ద సంఖ్యల్లో స్త్రీలు లేసు పరిశ్రమపై ఆధారపడ్డారు. ఇది పూర్తిగా అసంఘటిత రంగం. అన్ని అసంఘటిత రంగాలలోనూ పురుషులకు ఇచ్చే కూలీ స్త్రీలకు ఇచ్చే కూలీ కన్నా ఎప్పుడూ ఎక్కువగానే ఉంటుంది. అయితే ఈ లేసు పరిశ్రమ మీద ఆధారపడినవారు అందరూ మహిళలే. సమాజంలో మహిళలు చేసే శ్రమ అనంతమైనది. కాని వారికి దక్కుతున్న వేతనాలు అతి స్వల్పం. జాతీయ ఆదాయంలో మహిళల ఆదాయం ఇప్పటికీ నామమాత్రంగానే ఉంటోంది. దీనికి కారణం సమాజంలో స్త్రీల మీద వివక్షతే. ఇది సామాజిక, లింగ, ఆర్థికపరమైన వివక్షతో అమలులో ఉంది.

నర్సాపూర్ చుట్టుపక్కల నివసిస్తున్న మహిళలు, చాలా మంది పిల్లలు పది సంవత్సరాల వయస్సు నుండే లేస్ అల్లడం నేర్చుకుంటారు. ఉదయం ఇంటి పనులు పూర్తి చేసుకుని దాదాపు పది గంటల నుండి సాయంకాలం ఐదు గంటల వరకు లేసులు అల్లుతూనే ఉంటారు. రెండు చేతుల బొటనవేళ్ళు, చూపుడు వేళ్లు నిరంతరం సూదిని, లేసు దారాన్ని కదిలిస్తూనే ఉంటాయి. నిరంతరం సూదిని వేళ్ల మధ్య తిప్పుతుండటంతో వేళ్లు మొద్దుబారి కాయలు కాయడం అనివార్యంగా సంభవించే పరిణామం.

తమ కుటుంబాల్లోని పురుషులు రోజువారి కూలీకి పొలం పనులకు కాని ఇతర పనులకు గాని పోతే, లేసు అల్లుకుంటూ ఇంటి పట్టునే ఉంటున్న మహిళలు అధికంగా కాపు కులానికి చెందినవారే. ఈ కాపు స్త్రీలు బయట కూలీ పనులకు పోవడానికి కుటుంబంలోని మగవారు అంగీకరించారు. అదే గ్రామాల్లో దళిత, బిసి కులాల స్త్రీలు బయటికి వెళ్లి శ్రమ చేసి కూలీ సంపాదించుకుంటున్నారు.

లేసులో రకరకాల మాడల్స్‌ను వివిధ డిజైన్స్‌లో ఈ స్త్రీలు అల్లుతారు. సోఫా, ఫ్రిజ్జు, టి.వి., ఫోన్ కవర్లు, టేబుల్ క్లాత్, చిన్న పిల్లలు వేసుకునే గౌన్లు, స్కర్ట్‌లు, స్వెట్టర్‌లు, పెద్దవాళ్లు వేసుకునే నైటీలు, టాప్స్ మొదలయినవి. చుట్టూ లేసుకుట్టిన తెల్లటి జేబు రుమాళ్లు, సెల్‌ఫోన్స్ పెట్టుకోవడానికి వీలయిన చిన్న చిన్న పర్సులు ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తున్నాయి.

లేసు పరిశ్రమ మీద ఆధారపడిన మహిళలు ఎవ్వరూ కూడా పెట్టుబడిదారులు కారు. కేవలం కూలీలే. లేసు దారాన్ని ముడిసరుకుగా ఈ మహిళలకు అందజేసే పెట్టుబడిదారులు, కొనుగోలుదార్ల మధ్య లేసు అల్లే మహిళల పాత్ర అత్యంత ప్రాముఖ్యమైనది. శ్రమ అనంతమైనది. కాని వీరికి ముట్టే కూలీ మాత్రం అతి స్వల్పం. ఎంత భయంకరమైన ఆర్థిక దోపిడీకి వీరు గురి అవుతున్నారో తలుచుకుంటే ఒళ్లు గగుర్పొడుస్తుంది.

ఉదాహరణకు, ఎంపిక చేసిన డిజైన్‌లో, మాడల్‌లో ల్యాండ్ ఫోన్ మీద కప్పే కవర్లు అల్లమని అర కేజీ ముడిలేసు దారాన్ని ఒక మహిళా కూలీకి పెట్టుబడిదారుడు అందజేస్తాడు. ఒక బండిల్ ఫోన్ కవర్లు (దాదాపు 28 నుండి 30 కవర్లు) అల్లడానికి దాదాపు పదిహేడు రోజులు పడుతుంది. (రోజు ఆరు గంటలు పనిచేస్తే). కాని బండిల్ ఫోన్ కవర్లు అల్లితే వారికి ముట్టేకూలీ కేవలం నూట యాభై రూపాయలు మాత్రమే. బండిల్‌లో ఉండవలసిన కవర్ల సంఖ్య కంటే తక్కువ కవర్లు ఉంటే కూలీకి చెల్లించే డబ్బులో కోత విధిస్తారు. అంటే రోజుకు ఐదు నుండి 7 గంటల పని జాగ్రత్తగా చేస్తే వారు పొందుతున్న కూలీ రోజుకు పది రూపాయలు మాత్రమే. ఒక్కొక్క కవరు ధర మార్కెట్లో యాభై వరకు అమ్ముడుబోతుంది. అమ్మకపు విలువలో తయారు చేసిన కూలీకి లభిస్తున్నది కేవలం పది శాతం మాత్రమే. శ్రమ మొత్తం వీరిది, లభిస్తున్నది అతి స్వల్పం. మిగిలింది వెట్టిచాకిరీయే. వీరి శరీర శ్రమకు, నైపుణ్యానికి విలువ కట్టకపోవడంతో అమ్మకం దారులు లేసుతో అల్లిన ఉత్పత్తులను తక్కువ ధరలకే విక్రయిస్తున్నారు. ప్రజలు కూడా వీటిని తక్కువ ధరలకు కొనడానికే అలవాటు పడ్డారు.

తమ శ్రమకు, నైపుణ్యానికి తగిన ఫలితం దక్కడం లేదని వీరికి స్పష్టంగా తెలుసు. కాని ఖాళీగా ఉండడం కంటే ఇంటి పట్టునే ఉంటూ ఏదో ఒకటి చేసుకోవడం మేలే కదా అని వీరు భావిస్తున్నారు. వేరే పనులలో నైపుణ్యాన్ని పొందలేకపోవడం వాటివైపు దృష్టి మళ్లించకపోవడం, ఇతర రంగాలలో మహిళలు పొందుతున్న కూలీ

ధరల గురించి తెలియకపోవడం లాంటివి తమ మీద జరుగుతున్న ఆర్థిక దోపిడీకి తలవంచేలా చేస్తున్నాయి. నామమాత్రపు సంఘాలు కూడా లేకపోవడంతో 'ఇది ఏమీ' అని ప్రశ్నించే వారే కరువయ్యారు.

కేంద్ర ప్రభుత్వం, మానవ వనరుల శాఖ సంయుక్త ఆధ్వర్యంలో నర్సాపూర్‌లో 2007లో లేస్ పార్క్‌ను ప్రారంభించారు. అప్పటి నుండి పొదుపు మహిళా సంఘాలకు సరికొత్త డిజైన్‌లో లేసు అల్లడాన్ని లేసు పార్క్ వాళ్లు శిక్షణ ఇస్తున్నారు. ఇక్కడ తయారు అయ్యే ఉత్పత్తులను దేశ విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ప్రభుత్వం నిర్వహించే లేస్‌పార్క్ నర్సాపూర్‌లో వచ్చాక కూడా లేసు పరిశ్రమ మీద ఆధారపడిన మహిళల వేతనాల్లో గణనీయమైన పెరుగుదల ఏ మాత్రం కనిపించడం లేదు.

అంతకు ముందు విడివిడిగా ఆర్థిక దోపిడీకి గురి అయిన మహిళలు ఒక కప్పుకింద ఉమ్మడిగా అదీ ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రభుత్వాల చేతనే దోపిడీకి గురికావడం పెద్ద విషాదం.

లేస్ పార్క్ వచ్చాక మా జీవితాల్లో వెలుగు నిండింది అని చెప్పండి అంటూ ఒక దశారీ మహిళా ట్రైనర్ మహిళా కార్మికులను ఒత్తిడి చేయడం కొందరు రచయిత్రులు గమనించారు. బహుశా రచయిత్రులు అక్కడకు వస్తారని ముందే తెలిసుంటే బహుశా వారికి మాతో ఎలా మాట్లాడాలో, ఏం చెప్పాలో ముందే శిక్షణ ఇచ్చి ఉండే వారేమో.

నర్సాపూర్‌లో లేస్‌పార్క్ వచ్చాక వీరికి రోజుకు యాభై రూపాయల కూలీ గిట్టుతోంది. రానూ పోనూ రవాణా ఖర్చులు తీసివేస్తే రోజుకు ముప్పై రూపాయలకూలీ. అంటే నెలకు తొమ్మిది వందలు (సెలవు దినాలు, ఆదివారాలు కూడా పనిచేస్తే). ఈ తొమ్మిది వందలతో వారి జీవితాలలో వెలుగు నిండడం సాధ్యమేనా? ప్రభుత్వ పథకాలను ప్రచారం చెయ్యడానికి సభలను నిర్వహిస్తూ, వాటిని విజయవంతం చేయడానికి పెద్ద ఎత్తున మహిళలను సమీకరిస్తున్న అధికారులు, రాజకీయ నాయకులు ఎక్కడా కూలీ రేట్ల గురించి మాట్లాడకపోవడం గమనార్హం.

రచయిత్రులు వారితో మాట్లాడుతున్న సమయంలో కొందర్ని 'మీరు ఉద్యోగాలు చేస్తున్నారా అంటే! ఎంత జీతం వస్తుందండి..' అని కుతూహలంగా అడిగారు. ఒక రచయిత్రి నలభై వేలు వస్తుంది అని చెప్పగా. 'నలభై వేలాంది... సంవత్సరానికా అంటే...' అని అమాయకంగా అడిగినప్పుడు మనసు కలచివేసినట్టయింది. కాదు నెలకు నలభై వేలు అని చెబితే వారు నోరు తెరిచిన విధానాన్ని, వాళ్ల ముఖాల్లోని ఆశ్చర్యాన్ని వాక్యాల్లో వర్ణించడం కష్టం. వీరి అమాయకత్వం, వెనుకబాటుతనం వెనుక అగ్రవర్ణ అహంకార మూర్ఖత్వం, పితృస్వామ్య భావజాలం, ఆర్థిక దోపిడీలు చాలా బలంగా పని చేస్తున్నాయి.

రోజుకు ఆరు నుంచి ఎనిమిది గంటలు పని చేస్తూ నెలకు వెయ్యి రూపాయలు కూడా దక్కని మహిళలు సమాజంలో ఒకవైపు ఉంటే అన్నే గంటలు పనిచేస్తూ నెలకు యాభై వేల నుండి లక్ష రూపాయల జీతం వరకు పొందుతున్న లెక్చరర్లు, ప్రొఫెసర్లు, ఇంజనీర్లు, డాక్టర్లు, జర్నలిస్టులు ఉన్నారు. బయట మార్కెట్లో అరటి పండ్లు, టొమేటో, ఆకు కూరలు ఎక్కువ జీతాలు వచ్చే వాళ్లకు ఎంతకు అమ్ముతున్నారో తక్కువ జీతాలు వచ్చే వాళ్లకు కూడా అంతే ధరలకు అమ్ముతున్నారు. మరి తొమ్మిది వందలతో మూడు పుటలు పోషక విలువలు కలిగిన ఆహారం తీసుకోవడం అనేది ఈ మహిళలకు అందని ద్రాక్ష పండ్ల లాంటిది. అందుకే అందరి స్త్రీల సమస్య ఒకటి కాదు. స్త్రీలు కులాలుగా, వర్గాలుగా విడివిడిగా ఉన్నారు. కులపరంగా, లింగ పరంగా, ఆర్థికపరంగా వివక్షతకు గురి అవుతూనే ఉన్నారు.

కూలీలను కూలీలుగానే ఉంచుతూ పెట్టుబడిదారులను మరింత పెట్టుబడిదారులుగా అభివృద్ధి చేయడానికి వీలయ్యే పథకాలను, విధానాలను ప్రభుత్వాలు అమలు చేస్తున్నాయి. పేదరికాన్ని నిర్మూలిస్తాం అని ప్రకటనలు చేస్తూ వారి కోసమే పథకాలను రూపొందిస్తున్నాం అని పైకి చెప్పుకుంటూ, పేద మహిళలకు చిల్లర డబ్బులు విదిలిస్తూ, పెట్టుబడిదారులకు అన్ని రకాల రాయితీలు కల్పిస్తూ వారిని, వారి దోపిడీని ప్రోత్సహిస్తూ వారి సేవలో తరిస్తున్నాయి. ప్రభుత్వాలు సమాజంలో ఎక్కువ శాతం స్త్రీలు కూలీలుగానే ఉన్నారు. శ్రామికులుగా, ఉత్పత్తిదారులుగా స్త్రీలే యాజమాన్య స్థాయికి ఎదిగి లాభ నష్టాలను సమష్టిగా దక్కించుకునే పరిస్థితులు కల్పించే ప్రభుత్వాలు రావాలి.

కుల, లింగపరంగా వివక్షతను ఎదుర్కొంటున్న స్త్రీలను చైతన్యవంతులుగా చేయడానికి, ఆర్థికంగా దోపిడీకి గురి అవుతున్న స్త్రీలలో అవగాహన పెంపొందించడానికి ఉన్నత విద్య అభ్యసించిన స్త్రీలు, ఉన్నత స్థానాల్లో ఉన్న మహిళలు తమ ఉమ్మడి బాధ్యతగా భావించి తమ సమయాన్ని కొద్దిగానయినా, సరే స్త్రీల కోసం, స్త్రీలు ఏర్పరుచుకున్న సంఘాల్లో పనిచేయడం నేటి అవసరం. అప్పుడే సంఘటిత, అసంఘటిత రంగాలలో పనిచేసే స్త్రీల సమస్యలను వెలుగులోకి తెచ్చి వాటికి కావాలసిన పరిష్కార మార్గాలను రూపొందించుకోవచ్చు.

సమాజంలో రోజు రోజుకూ రూపాంతరం చెందుతున్న వివక్షతను, దోపిడీని నిరంతరం పరిశీలిస్తూ, వాటిని కూలంకషంగా చర్చించి, పరిష్కార మార్గాల కొరకు స్త్రీలందరూ కలిసికట్టుగా అన్వేషణ సాగిస్తేనే స్త్రీ విముక్తి సాధ్యమవుతుంది.

*(రచయిత గణితశాస్త్ర అధ్యాపకులు, మహిళా ఉద్యమ కార్యకర్త)* వీ

**రాబోయే సంచికలలో...**

- ❖ **ఫోకస్ : ఆగస్ట్ 15 స్వాతంత్ర్యం ఎంత నిజం? ఎంత అబద్ధం?**
- ❖ **వ్యవసాయ రంగానికి ఉపాధి హామీ పథకం వర్తింపజేయాలి - బండారి ఐలయ్య**
- ❖ **కాపీ ఆధారిత పరీక్షల ప్రభావం - బి. మల్లయ్య**
- ❖ **స్పెయిన్, గ్రీస్ ప్రజాందోళనలు**
- ❖ **పోస్కో భూ నిర్వాసితుల పోరాటం**
- ❖ **నెల్లూరు జిల్లా థర్మల్ పవర్ ప్లాంట్లు**

*నిరాశా నిస్పృహలకు లోనుకాకుండా అన్నివిధాలుగా తండ్లాడి తెలంగాణను సాధించుకోవడానికి అయిలమ్మ స్ఫూర్తిగా నిలుస్తుందంటున్నారు* **ఎస్. నీలాదేవి**

# వీరవనిత అయిలమ్మ యాదిలో...

వీర తెలంగాణ రైతాంగ పోరాటం అయిలమ్మ వీరోచిత ప్రతిఘటనతో ఆరంభమైంది. సాయుధ పోరాటంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన ఒక నిరుపేద కుటుంబానికి చెంది నిరక్షరాస్యురాలైన అయిలమ్మ నాయకత్వాన సాగిన పోరాటాన్ని ప్రస్తుతం మనమున్న తెలంగాణ పోరాట సందర్భంలో గుర్తు చేసుకోవాల్సిన అవసరం ఎంతో ఉంది. దేశ్‌ముఖ్ విసునూరు రామచంద్రారెడ్డి అధికారమదంతో సాగించిన దోపిడీ విధానాన్ని ప్రశ్నించి, ఎదురొడ్డి నిలిచి వెట్టిచాకిరీ లాంటి దుర్భర బానిసత్వ విముక్తి కోసం ప్రజలను సమీకరించి నాయకత్వం వహించి కణకణమండే నిప్పుకణికలా నిలిచిందామె.

దుండగులతో ఘర్షణ పడ్డారన్న వంకతో అయిలమ్మ భర్తను, ఇద్దరు కొడుకులను జైల్లో పెట్టించినా అయిలమ్మ ఒంటరిగానే పోరాలిటాన్ని కొనసాగించింది.

అయిలమ్మ మరో ఇద్దరు పేద రైతులు రెండు ఎకరాల భూమి లో తరతరాలుగా సాగు చేసుకుంటున్న క్రమంలో దేశ్‌ముఖ్ విసునూరు రామచంద్రారెడ్డి పొలంలో పంటను దాడిచేసి కోసుకెళ్లడానికి దుండగులను పంపిస్తే ఎదిరించి గ్రామ ప్రజలను ఉత్తేజితపరిచింది. ఆ వార్త పరిసర ప్రాంతాలకు, దూర ప్రాంతాలకు అందించి వందలాదిగా చుట్టుపక్కల గ్రామాల నుండి వచ్చిన ప్రజలు అయిలమ్మకు అండగా నిలిచారు. దుండగులను తరిమికొట్టి వరికోసి, కొట్టి ధాన్యాల మూటలు కట్టి వీపుల మీద మోసి సాయుధ పోలీసుమూకలు ఒకవైపు అరెస్టులు చేస్తున్నా మరొకవైపు ప్రజలు చాలా నేర్పుతో ఎక్కడికక్కడ తప్పించుకొని ధాన్యాన్ని అయిలమ్మ ఇంటికి చేర్చారు. అందరినీ ఏకం చేసి ఐకమత్యంతో ఒక నిరక్షరాస్యురాలైన మహిళ సాధించిన చరిత్ర చెప్పిన సత్యం. చారిత్రక విజయం ఇది.

అయిలమ్మ అలుపెరుగని పోరాటాల సాక్షిగా నేడు తెలంగాణ ఉద్యమాన్ని మరింత ఉధృతం చేయాల్సిన అవసరం మహిళలపై ఉంది. ఉవ్వెత్తున ఎగిసిన ఉద్యమ ఫలితాన్ని ఆంధ్ర రాజకీయ నాయకుల కుట్ర, తెలంగాణ ప్రాంత ఇంటి దొంగ నాయకుల అసమర్థత అధికార దాహం వలన అరవై ఏండ్ల తెలంగాణ ప్రజల ఆకాంక్ష తిరిగి మళ్లీ మొదటి స్థానానికి కాలయాపన కమిటీ శ్రీకృష్ణ కమిటీతో చూస్తుండగానే సంవత్సర కాలం గడిచింది. నాలుగు కోట్ల తెలంగాణ ప్రజలు ఆశించిన విధంగానే శ్రీకృష్ణ కమిటీ ఆంధ్రపాలకుల కమిటీ అని నిరూపించింది. ఆరు సూత్రాలు వల్లె వేసి సమస్యను ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా తీర్పు ఇచ్చి చరిత్రలో కమిటీల పట్ల ప్రజలకు విశ్వాసం పోయే విధంగా తీర్పునిచ్చింది.

ఒక ప్రజాస్వామ్యబద్ధంగా నాలుగు కోట్ల ప్రజలు ముక్తకంఠంతో 'తెలంగాణ నా జన్మ హక్కు' అని నినదించినా వినరాని, కళ్లుండీ చూడలేని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలను తిరిగి మళ్లీ ఒక ప్రకటన తెలంగాణకు అనుకూలంగా రప్పించుకోవాల్సిన అవసరం ఉంది.

2010లో జరిగిన అనేక పోరాట రూపాలను అంతకన్నా ఉధృతంగా ఇప్పుడు ప్రదర్శించాల్సిన అవసరం ఉంది. 9 డిసెంబర్ 2009 తరువాత ఆరువందలకు పైగా జరిగిన ఆత్మహత్యలన్నీ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన హత్యలే. కమిటీల పేరుతో కాలయాపన చేసి ఉద్యమాన్ని అణచాలన్న ప్రభుత్వ కుట్ర కొంతవరకు ఫలించినట్లు కనిపించినా ప్రజాస్వామ్య ఉద్యమాలను అణచలేరన్న సత్యాన్ని ప్రస్తుత పరిస్థితులు తెలియజేస్తున్నాయి.

స్వార్థపూరిత రాజకీయాలు, పార్టీల విభేదాలు పక్కకు పెట్టి ప్రజలంతా ఏకమవ్వాల్సిన అత్యవసర సామాజిక అవసరం ఇది. ఈ పరిస్థితుల్లో కూడా ఒక పార్టీ లాభం కోసమో, నష్టం కోసమో కాకుండా తెలంగాణ ప్రాంత వనరుల రక్షణ కోసం ఇంకా తరలింపు ఉధృతం కాకుండా నిరోధించాల్సిన అవసరం ఉంది. ఒకవైపు ఉత్తర తెలంగాణ ప్రాంతాన్నంతా ఓపెన్‌కాస్ట్‌ల పేరుతో బొందల గడ్డగా మారుస్తూ, మరొకవైపు ప్రాజెక్టుల పేరుతో ముంపుకు గురిచేస్తూ, నిరాశ్రయులను కావిస్తూ దక్షిణ తెలంగాణ ప్రాంతాన్ని సెజ్‌ల పేరిట బహుళజాతి కంపెనీలకు కట్టబెడుతూ ఆంధ్ర పెత్తందార్ల పెత్తనాన్ని తెలంగాణ రైతాంగ పోరాట క్రమంలో ప్రజా ఉద్యమాలు నిర్మించాల్సి ఉంది. చరిత్ర పాఠాలు చదవని అక్షరం రాని ఒక మహిళ అయిలమ్మ దోపిడీ వర్గాలను ఎదిరించి నిలబడ్డ తీరు నేడు తెలంగాణ మహిళలందరికీ ఆదర్శం కావాలి.

విద్యావంతులై ఉండి కూడా నేటి చాలామంది మహిళలు సామాజిక సమస్యల పట్ల సరియైన కనీస స్పందన లేకుండా ఉన్నవారు ఉద్యోగం, ఇల్లు తప్ప మూడో విషయమే తెలియని, పట్టించుకోని వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతూ ఉంది. 'అన్ని గడపల కన్న నా గడప మేలు' అన్నట్లుగా తన కుటుంబం వరకే పరిమితమవుతున్నారు.

సామ్రాజ్యవాద విష సంస్కృతి వలన నేడు చాలామంది మహిళలు అనేక ప్రలోభాలకు లోబడి విలువైన జీవితాలను పతనం చేసుకుంటు న్నారు. ఎన్ని చట్టాలున్నా ఏ చట్టాలు స్త్రీల విషయంలో అమలు కావడం లేదు. అనేక సమస్యలతో నిత్యం సమతమవుతున్న మహిళలు ఇంటా బయట ఎక్కడో ఒక దగ్గరన్నా తమ పాత్రను సరిగ్గా నిర్వహించుకోలేని పరిస్థితులలో ఉన్నారు. కానీ చిన్న రాష్ట్రాల నిర్మాణం వలన స్త్రీలు తమ సమస్యలను పరిష్కరించుకోవడం, చట్టాలను అమలు పరుచుకోవడం కొంత సులువు అయ్యే అవకాశం ఉంది.

*పాలక విధానాలను ఎండగట్టడంతో సరిపోదనీ, దానితోపాటు ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాలను మనమే ప్రతిపాదించాల్సి అవసరం ఉందనీ అంటున్నారు* **పి. కృష్ణారావు**

# ఉత్తరాంధ్ర ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా

**'మే'** నెల వీక్షణంలో మనం ఉత్తరాంధ్రలో పాలకులు చేస్తున్న అభివృద్ధి, విధ్వంసంలను గురించి కొంత మేరకు చర్చించడం జరిగింది. అంతేగాక మన పాలకులు వివిధ సందర్భాలలో చెబుతున్న అభివృద్ధిని గురించి నిత్యం వింటున్నాం. పాలకులు చెబుతున్న అభివృద్ధి ఎవరి అభివృద్ధియో మనకు స్పష్టంగా తెలుస్తున్నది. పాలకులు అభివృద్ధిని గురించి విమర్శ చేస్తున్న వారిని కొందరు ప్రశ్నిస్తున్నదేమంటే 'ఎటువంటి అభివృద్ధి మీరు అంగీకరిస్తారు' అన్నది. నిజానికి పాలకుల అభివృద్ధి – విధ్వంసం గురించి విమర్శ చేస్తున్న మనం అందుకు ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను పరిష్కార మార్గాలను కూడా చెప్పడం న్యాయమైనది, బాధ్యత కూడా.

ముందుగా మనం వ్యవసాయ రంగాన్ని తీసుకుంటే, ఉత్తరాంధ్రలో 68 శాతం భూమి వర్షాధారంగా చెప్పుకొన్నాం. ఇందులో అడవి బంజరులు, ప్రభుత్వ బంజరులు, మెట్ట భూములు, తీర ప్రాంత భూములు మొదలైనవి ఉన్నాయి. అంతేగాక వంశధార, నాగావళి మొదలైన పదిహేను నదులు చిన్నా పెద్దవి ఉన్నాయని, వీటి వలన 32 శాతం భూమికి నీటి పారుదల సౌకర్యం లభిస్తుందని చెప్పడం జరిగింది. కానీ ఈ నదులపై సరైన ఆనకట్టలు గానీ, కాలువల ఆధునీకరణ గానీ సరిగా జరగలేదు. వంశధారపై గొట్టా బ్యారేజీ, నాగావళి పై తోటపల్లి, నారాయణపూరం ఆనకట్టలు, మాడ్డోవలస రిజర్వాయరు, అలాగే ఇతర నదులపై చిన్న చిన్న రిజర్వాయర్లు, నీటి ప్రాజెక్టులు కట్టినప్పటికీ, అవి సంవత్సరం పొడుగునా సాగునీరు, తాగునీరు అందివ్వడం లేదు. కావున ఆయా నదుల కాలువలను ఆధునీకరించి, ఎక్కడికక్కడ నదులపై లిఫ్టు ఇరిగేషన్ ప్రాజెక్టులను నిర్మించి, ఆయా ప్రాంతాలను అభివృద్ధి పరచాలి. అదే విధంగా పురాతన చెరువుల ఆక్రమణను తొలగించి, చెరువుల లోతును వైశాల్యాన్ని పెంచే పనులు చేపట్టాలి. చెరువుల కింది ఆయ కట్టుకు సాగునీటిని అందివ్వడం కోసం కాలువలను అభివృద్ధి పరచాలి.

ప్రభుత్వ బంజరులను, అడవీ భూములను భూమిలేని పేదలకు పంచి, హక్కులను కల్పించి వాటిని సాగులోకి తేవాలి. భూసంస్కరణల చట్టం ప్రకారం భూముల పంపకం, కౌలుదారీ చట్టం ప్రకారం కౌలు రైతుకు హక్కులు కల్పించడం చేయాలి. తీర ప్రాంత భూములలో చేపడుతున్న చేపల పెంపకం స్థానిక గ్రామ సంఘాలకు అప్పగించాలి. ఇక పండిన పంటలను కొనుగోలు చేయడానికి స్థానికంగా కొనుగోలు కేంద్రాలను ప్రభుత్వమే ఏర్పాటు చేయాలి. పండిన పంటలను రైతులు నిల్వచేయడానికి గాను గిడ్డంగులను ఏర్పాటు చేయాలి. అయితే పైన చెప్పుకున్నవన్నీ ముందే చట్ట రూపంలోనో, పాలకులు వాగ్దానాలు రూపంలోనో మనం అప్పుడప్పుడు వింటున్నాం. కానీ అవి అమలు కావడం లేదు. రైతులకు బాధలు తప్పడం లేదు. అందువల్ల వీటి సాధన కోసం ప్రజలు సంఘటితం కావలసిన అవసరం ఉన్నది. ప్రజలు ముందుగా గ్రామ స్థాయిలలో పాలకవర్గ రాజకీయ పార్టీలకు అతీతంగా సమస్యలు ప్రాతిపదికన కార్యాచరణ కమిటీలుగా ఏర్పడడం చేయాలి. తరువాత భూమిలేని వారిని భూములు సాధన, సాగునీరు వ్యవస్థ అభివృద్ధి కోసం, పంటల గిట్టుబాటు ధరల కోసం, పంట నిల్వల గిడ్డంగుల కోసం, రైతాంగం పోరాటాలు చేయాలి. ఫలితంగా రైతాంగ కుటుంబాల వలసల నివారణ జరుగుతుంది. ఉపాధి అవకాశాలు పెరిగి ప్రజల అభివృద్ధికి మార్గం ఏర్పడుతుంది.

గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయరంగం అభివృద్ధితో పాటుగా పరిశ్రమల కూడా అభివృద్ధి చెందినప్పుడే ప్రజలకు ఉపాధి అవకాశాలు పెరిగి, వలసల నివారణ జరుగుతుంది. అయితే ఈ పరిశ్రమలు పర్యావరణ సమతుల్యతను దెబ్బతీసే విధంగా ఉండరాదు. పాలకులు చెబుతున్న విధంగా థర్మల్, అణు విద్యుత్ ప్రాజెక్టులు గానీ, పర్యావరణ వినాశనం చేసే రసాయన పరిశ్రమలు గానీ కాకుండా, వ్యవసాయధార మైన గ్రామీణ పరిశ్రమలను ఏర్పాటు చేయాలి. ఉత్తరాంధ్రలో

---

వరకట్నం, మద్య నిషేధం లాంటి సామాజిక సమస్యల పరిష్కారం కోసం మహిళలు ఉద్యమించాల్సిన అవసరం ఉంది. కన్నీళ్లు తప్ప గుక్కెడు నీళ్లు కూడా దొరకని స్థితిలో నీళ్ల కోసం ఎండలో కిలోమీటర్లైనా నడిచి తీసుకొచ్చే తెలంగాణ బిడ్డలకు ఇంటిపక్కనే ఎన్ని బాటిల్లైనా మద్యం దొరికే పురుషునికి తరువాత ఇంట్లో జరిగే తన్నుల తంతులకు స్వస్తి పలకాల్సిన అవసరం ఉంది. స్త్రీల భాగస్వామ్యం ఉద్యమంలో లేకుండా ఏ ఉద్యమాలు విజయం సాధించలేవు అనే చరిత్ర చెప్పిన సత్యాన్ని గమనించాలి.

తెలంగాణ రాష్ట్ర సాధనే ధ్యేయంగా ఉద్యమించి విద్యావంతులు, ఉద్యోగస్తులైన మహిళలు ముందుండి చైతన్య వంతులౌతూ, చైతన్య పరుస్తూ వారితో పాటూ ఉద్యమంలో పాల్గొని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు నాలుగు కోట్ల ప్రజల గాఢమైన ఆకాంక్ష మళ్లీ మళ్లీ చెప్పాల్సి ఉంది.

వందసార్లు రాజీనామా చేసిన రాజకీయ నాయకులను మళ్లీ మళ్లీ గెలిపించడానికి ప్రజలు స్థిరంగా ఉన్నారు. తెలంగాణ కోసం నిజమైన చిత్తశుద్ధితో పని చేయడానికి ఒక్క నీతిగల నాయకుడు లేడు.

రాజకీయ నాయకులు ఓడిపోవచ్చు, గెలవొచ్చు. ప్రభుత్వం ఉండొచ్చు, ఊడొచ్చు. కానీ ప్రజాస్వామ్యయుతమైన ప్రజల ఆశయం, ఆకాంక్ష ఎప్పుడూ ఓడిపోరాదు. ప్రజా ఉద్యమాల ద్వారానే ప్రజల ఆశయం నెరవేరుద్దాం.

*(రచయిత ఉపాధ్యాయురాలు)* వీ

పండుతున్న పంటలు జనపనార, చెరకు, నూనె గింజలు (వేరుశెనగ, నువ్వులు, ఆముదం, కొబ్బరి, ఆయిల్‌ఫామ్ మొదలైనవి), జీడి మామిడి, మామిడి, పెండ్లం (కర్ర పెండ్లం) మొదలైనవి ఆయా పరిశ్రమలను ఏర్పాటు చేయాలి. వీటిలో రైతు భాగస్వామ్యం ఉండాలి. ఉదాహరణకి జనపనార మిల్లులు, పంచదార మిల్లులు, నూనె మిల్లులు, ధాన్యం మిల్లులు, కొబ్బరి పీచు పరిశ్రమలు, జీడి పరిశ్రమలు, జీడి పండ్లరసం తయారు పరిశ్రమలు, కర్ర పెండ్లంతో ఆహార పదార్థాలు తయారు పరిశ్రమలు, తీర ప్రాంతంలో ఉప్పు తయారు పరిశ్రమలు రైతు సహకార పద్ధతిలో ఏర్పాటు చేసుకోవాలి. చేతి వృత్తులకు చెందిన మట్టి వస్తువుల తయారు కేంద్రాలు, వ్యవసాయ పరికరాల తయారు కేంద్రాలు, కంచు, అల్యూమినియం వస్తువుల తయారు కేంద్రాలు మొదలైనవి గ్రామీణ ప్రాంతంలో, సహకార పద్ధతిలో ప్రజలు ఏర్పాటు చేసుకోవాలి. ఆయా పరిశ్రమలకు, ఇండ్లకి కావలసిన విద్యుత్‌ను తయారు చేయడం కోసం ఎక్కడికక్కడ గాలి ద్వారా, సౌరశక్తి ద్వారా, నీటి ద్వారా, ధాన్యపు ఊకద్వారా విద్యుత్‌ను తయారు చేసే పరిశ్రమలను (లేక) కేంద్రాలను ఏర్పరచుకోవాలి.

ఇక ప్రజల ఇతర అవసరాలైన విద్య, వైద్యం, రవాణా మొదలైనవి ఏర్పాటు చేసుకోవాలి. ప్రస్తుతం ఉనికిలో ఉన్న విద్యారంగం కానీ, వైద్య రంగం కానీ, రవాణా వ్యవస్థ కానీ ప్రజలకు అంతగా ఉపయోగ పడే విధంగా లేవు. ప్రజల వ్యవసాయ, పారిశ్రామిక ప్రజా విధానాలకు అనుగుణమైన విద్య, వైద్య విధానాలను ప్రజలు రూపొందించుకోవాలి. ఉదాహరణకి, విద్యారంగంలో ఉమ్మడి పాఠశాల విధానం ఏర్పాటు చేసుకోవడం, ప్రజల అభివృద్ధికి తోడ్పడే పాఠ్య ప్రణాళికలు రూపొందించుకోవడం, ప్రైవేటు పాఠశాలను స్వాధీనం చేసుకోవడం, ఉపాధ్యాయులు స్థానికంగా నివాసం ఉండడానికి పాఠశాల ఆవరణలో నివాస గృహాల ఏర్పాటు చేయడం, ఉపాధితో కూడిన విద్యను విద్యార్థులకు అందించడం మొదలైనవి. వైద్యరంగంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ప్రజలకు నిత్యం అందుబాటులో ఉండే విధంగా ప్రజావైద్యశాలలుగా రూపొందించాలి. వైద్యులు గ్రామీణ ప్రాంతంలో ఉండేటట్టు సౌకర్యాలు కల్పించాలి. తాగునీరు, పారిశుద్ధ్య వ్యవస్థను గ్రామీణ ప్రాంతంలో మెరుగుపరుచుకోవాలి. రోడ్డు నిర్మాణం దగ్గిర నుంచి, రవాణా వరకు ప్రజల భాగస్వామ్యం అన్నింటా ఉండాలి.

పై అభివృద్ధి నమూనా ఉత్తరాంధ్రలో సాధ్యమేనా? నిజానికి ఏ ప్రాంతానికి ఆ ప్రాంతం కొన్ని ప్రత్యేకతలు కలిగి ఉన్నప్పటికీ పై అంశాలన్నీ దేశంలో గానీ, రాష్ట్రంలోగానీ సర్వ సాధారణంగా కనిపించేవే. అయితే నా అనుభవం మేరకు ఉత్తరాంధ్రలో కొన్ని ప్రత్యేకతలు బట్టి ప్రయత్నిస్తే కొన్ని అభివృద్ధికర అంశాలను సాధించవచ్చు. అయితే అది చాలా శ్రమతో కూడిన అంశం. ముఖ్యంగా ఆయా ప్రాంతాలలోని విప్లవకర, అభ్యుదయ, ప్రగతిశీల శక్తులు, సంఘాలు ప్రయత్నిస్తే ఫలితాలు రావడం ఖాయం. పాలకవర్గ విధ్వంసకర అభివృద్ధి నమూనాకి ప్రత్యామ్నాయ అభివృద్ధిని చేసి చూపవచ్చు. ముఖ్యంగా ఉత్తరాంధ్రలోని మధ్య మైదాన ప్రాంతం మినహాయిస్తే అటు ఆదివాసీ ప్రాంతంలో గానీ ఇటు తీర మైదాన ప్రాంతంలోగానీ ఉన్న భౌగోళిక పరిస్థితులు గానీ, శ్రీకాకుళ సాయుధ రైతాంగ పోరాట కాలం నుంచి నేటి తీర ప్రాంత ప్రజలు చేస్తున్న పోరాటాలు చూసుకుంటే అక్కడ ప్రజల సంఘటిత శక్తి కొన్ని ప్రత్యేక లక్షణాలను కలిగి ఉన్నది. ఉదాహరణకి శ్రీకాకుళం జిల్లా తీర ప్రాంతంలోని గ్రామాలు గానీ (ఉద్దానం గ్రామాలు), ఆదివాసీ గ్రామాలు గానీ పాలకవర్గ పార్టీలకు అతీతంగా ప్రజల సమస్యలపై పోరాటాలు నడిపి సాధించుకొన్నవి కోకొల్లలుగా చరిత్ర చెబుతుంది. అయితే వీటిని నిర్దిష్ట అభివృద్ధి నమూనాలోనికి ప్రణాళికాబద్ధంగా కార్యాచరణ జరిపే ఐక్య సంఘటన రూపం ఏర్పడలేదు. అందుకు ముందు పీఠిన నడిపే నాయకత్వం ఏర్పడలేదు. ఈ లోపం కారణంగా విడివిడిగా నడుస్తున్న పోరాటాలు గానీ, సమస్యల సాధన గానీ ఉత్తరాంధ్ర ప్రజల అభివృద్ధికి ఒక రూపంలో వ్యక్తీకరించబడలేదు. పై అభివృద్ధి నమూనాలోని ఒక అంశాన్ని తీసుకుని ప్రయత్నం చేద్దాం. ఉద్దాన గ్రామాలలోని 26 గ్రామాల్ని తీసుకొని అక్కడ ప్రజలతో రాజకీయాలకు (ఉనికితో ఉన్న నిర్మాణాలు) అతీతంగా గ్రామ అభివృద్ధి కమిటీని ఏర్పాటు చేసుకోందాం. ఈ గ్రామ అభివృద్ధి కమిటీ జీడి రైతులు నుంచి జీడి పిక్కలను కొనుగోలు చేస్తుంది. అదే విధంగా జీడి పప్పు తయారు కేంద్రాన్ని ఏర్పాటు చేసుకొంటుంది. ఆర్థిక వనరులు కొంత సహకార పద్ధతిలోను, మరికొంత బ్యాంకు రుణాల ద్వారా సమకూర్చుకొంటుంది. అదే విధంగా జీడి పప్పు తయారు కేంద్రానికి అనుబంధంగా జీడిపండ్ల రసం తయారు కేంద్రాన్ని ఏర్పాటు చేసుకొంటుంది. పై రెంటిలో ఉత్పత్తి అయిన జీడిపప్పు, జీడి పండ్ల రసం అమ్మకాల కోసం తగు మార్కెట్‌ను కల్పించుకోవడానికి గ్రామ అభివృద్ధి కమిటీ ప్రయత్నిస్తుంది. వచ్చిన రాబడిని రైతులందరితో పంచుకొంటుంది. ఫలితంగా రైతులు ఆర్థికంగా బాగుపడడం జరుగుతుంది. మధ్య దళారుల వలలో పడకుండా కాపాడడం జరుగుతుంది. అదే ప్రస్తుత వ్యవస్థలోనైతే జీడి వ్యాపారులు రైతులను దోచుకొంటున్నారు. జీడి పండ్లు వృథాగా గోతుల్లో పూడ్చి పెడుతున్నారు.

ఇలా కాకుండా పైన చెప్పిన విధంగా ఏ గ్రామానికి ఆ గ్రామం ప్రయత్నిస్తే మొత్తం వివిధ అంశాలపై ఒక ప్రాంతంలోని గ్రామాలు ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి ప్రణాళికను తయారు చేసుకొని, కార్యాచరణను చేపట్టవచ్చు. ఇతర అంశాలైన విద్య, వైద్యం, రోడ్ల నిర్మాణం, రవాణా వ్యవస్థ, బంజరు భూముల పంపకం మొదలైన అంశాల్లో ప్రభుత్వం (పాలకవర్గ ప్రభుత్వాలు) పై ఒత్తిడి తేవడం, పోరాటాలు చేసి సాధించుకోవడం, వీలైతే గ్రామ అభివృద్ధి కమిటీల ద్వారా పాఠశాలల నిర్మాణం, ఆసుపత్రుల ఏర్పాటు, రోడ్ల నిర్మణం, బంజరు భూముల పంపకం వంటివి చేయవచ్చు. అయితే ఇక్కడ ఒక ప్రశ్న వస్తుంది? ఇవన్నీ చేస్తే పాలకవర్గ ప్రభుత్వాలు ఊరుకొంటాయా? గ్రామ పెత్తందారీ వర్గాలు ఊరుకొంటాయా? తప్పనిసరిగా అవి అడ్డుకొంటాయి. లేనిపోని ఆటంకాలు కల్పిస్తాయి. వీటిని అధిగమించ డానికి ఆయా గ్రామ అభివృద్ధి కమిటీలు ప్రజలను సంఘటితం, ప్రజా అభివృద్ధి నిరోధక శక్తులకు వ్యతిరేకంగా చేయాలి. అప్పుడు మాత్రమే ప్రత్యామ్నాయ అభివృద్ధి ప్రణాళికలను అమలు చేయడం సాధ్యం అవుతుంది. అటువంటి పరిస్థితులు ఉత్తరాంధ్ర తీర ప్రాంత గ్రామాలలోను, ఆదివాసీ గ్రామాలలోను ఉన్నాయి. కానీ ఇంత వరకు ప్రణాళికాబద్ధ ప్రయత్నలోపం కారణంగానే ఇటువంటి ప్రయత్న కార్యాచరణ జరగడం లేదని చెప్పవచ్చు.

నేను ఈ వ్యాసంలో ఉత్తరాంధ్ర అభివృద్ధి ప్రణాళిక నమూనాను బీజరూపంగానే భావిస్తున్నాను. నిజమైన ఆచరణాత్మక ప్రణాళికను కార్యక్షేత్రంలోని ప్రజాసంఘాలు ఆయా గ్రామా ప్రజా సమూహాలతో చర్చించి, ఒక కార్యరూపం తీసుకొన్నప్పుడే ప్రత్యామ్నాయ అభివృద్ధి జరుగుతుందని భావిస్తున్నాను. ఆ దిశగా పయనిద్దామని ఆశిస్తున్నాను. వీ

*(రచయిత ఉపాధ్యాయులు)*

*గత రెండు సంవత్సరాల తెలంగాణ ప్రజల ఆరాట పోరాటాల చరిత్రను రెండు ప్రధాన ఘట్టాల ద్వారా వివరిస్తున్నారు* **పిట్టల రవీందర్**

# మానుకోట నుండి మిలియన్ మార్చ్ దాకా...

డిసెంబర్ 9 నాటి ప్రకటన తర్వాత తెలంగాణలో రాజకీయ ఉద్యమ కార్యాచరణ తాత్కాలికంగా స్తంభించిపోయింది. 9వతేదీనాటి ప్రకటనను అమలు చేయించుకునేందుకు తీసుకోవాల్సిన చర్యలపై ఏ ఒక్కరూ దృష్టినిలుపలేదు. కేంద్రం ప్రకటన నేపథ్యంలో విజయోత్సవాలను నిర్వహించుకున్న టిఆర్ఎస్, కాంగ్రెస్, తెలుగుదేశం, తదితర పార్టీలు చేష్టలుడిగిపోయాయి. మరోవైపున సీమాంధ్ర రాజకీయ నాయకత్వం రాజీనామా డ్రామాలతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను ఉక్కిరిబిక్కిరి చేసాయి. స్పాన్సర్డ్ ఉద్యమాలను నిర్వహించాయి. పార్టీ విబేధాలను వదిలిపెట్టి సమైక్య నినాదంతో సీమాంధ్ర రాజకీయ నాయకత్వం తెలంగాణను వ్యతిరేకించడం లో ఐక్యమయ్యాయి. గల్లీ నుండి ఢిల్లీ దాకా తమకున్న రాజకీయ, ఆర్థిక పలుకుబడిని ఉపయోగించుకుని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై తీవ్ర స్థాయిలో ఒత్తిడిని పెంచాయి. ఫలితంగా డిసెంబర్ 23నాడు కేంద్రప్రభుత్వ ప్రతినిధిగా చిదంబరం మరో ప్రకటన జారీ చేశారు. ఈ పరిణామం తెలంగాణ ఉద్యమ శక్తులను నిరాశ, నిస్పృహలకు లోనుచేసింది. తెలంగాణ రాజకీయ నాయకత్వం తెలంగాణ జాయింట్ యాక్షన్ కమిటీ (తెలంగాణ జెఎసి) పేరిట ఐక్యసంఘటనగా ఏర్పడింది. పార్టీల జెండాలు, అజెండాలు పక్కకుపెట్టి తెలంగాణ సాధన కోసం పోరాడాలని నిర్ణయించుకున్నాయి. జెఎసికి ప్రత్యేకంగా ఉద్యమ జెండాను రూపొందించుకున్నాయి. తెలంగాణ ఉద్యమ భావవ్యాప్తిలో ఆరు సంవత్సరాలుగా నిరంతరం కృషి చేస్తున్న తెలంగాణ విద్యావంతుల వేదిక అధ్యక్షులు ప్రొఫెసర్ ఎం. కోదండరాంను కన్వీనర్‌గా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలు, ప్రజాసంఘాలు, కులసంఘాలు, తదితర సంస్థలతో తెలంగాణ జెఎసి మరింతగా విస్తృతమయ్యింది. ఉద్యమ ప్రజల విశ్వాసంతో మరింత పదునెక్కింది.

మరోవైపున తెలంగాణ వ్యాపితంగా ప్రజలు పెద్దఎత్తున ఉద్యమించారు. తెలంగాణ సమాజంలోని అన్ని వర్గాలు ప్రత్యేకంగా జెఎసిలుగా ఐక్యమయ్యాయి. తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమం ప్రజా ఉద్యమంగా మారిపోయింది. ఊరూరా వేలాదిగా టెంట్లు వెలిశాయి. దీక్షలు, ధర్నాలు, ప్రదర్శనలు, రాస్తారోకోలు, మానవ హారాలు, వంటా-వార్పులతోపాటుగా తెలంగాణ సాంస్కృతిక రూపాలన్నీ ఉద్యమంలో భాగమయ్యాయి. ఉద్యమ కార్యక్రమాలతో తెలంగాణ దద్దరిల్లిపోయింది. ప్రజలు తమ సమస్యలన్నింటినీ పక్కకు పెట్టారు. ఉద్యమమే ఊపిరిగా మారింది. తెలంగాణ రాష్ట్రం కోసం తాము నిర్వహిస్తున్న ప్రజాఉద్యమానికి తెలంగాణ రాజకీయ నాయకత్వం ముందు నిలవాలని ప్రజలు ఆశించారు. సీమాంధ్ర నాయకుల మూకుమ్మడి రాజీనామాలతో 9నాటి ప్రకటనను కేంద్ర ప్రభుత్వం వెనక్కి తీసుకున్న నేపథ్యంలో ... తెలంగాణ ప్రజాప్రతినిధులు కూడా రాజీమాలతో కేంద్రంపై ఒత్తిడిని పెంచాలని ప్రజలు ఆశించారు. ప్రజల డిమాండు మేరకు భాగస్వామ్య పక్షాల నాయకులను రాజీనామా చేయాలని తెలంగాణ జెఎసి కోరింది. ఈ మేరకు జెఎసిలో ఉమ్మడి నిర్ణయం జరిగింది. రాజీనామాలకు తేదీలను నిర్ణయించుకున్నారు. ఆ తర్వాత రాజీనామాలు చేయడానికి కాంగ్రెస్ పార్టీ కొంత సమయాన్ని కోరింది. ఇదే అదనుగా, కాంగ్రెస్ పార్టీ నాయకులు రాజీనామాలు చేస్తేనే తాము కూడా రాజీనామాలు చేస్తామని తెలుగుదేశం పార్టీ తిరకాసుపెట్టింది. అందరూ మూకుమ్మడిగా రాజీనామాలు చేస్తేనే రాజకీయ, రాజ్యాంగ సంక్షోభం వస్తుందని, తద్వారా మాత్రమే కేంద్రంపై ఒత్తిడి తీసుకురాగలమని ఆ పార్టీ వెనకడుగు వేసింది. గ్రామాల్లో ఈ రెండు పార్టీల నాయకులు తిరగలేని పరిస్థితి ఎదురు కావడంతో డమ్మీ రాజీనామాలతో ప్రజలను మభ్యపెట్టే ప్రయత్నాలు చేసారు. తరతరాలుగా రాజకీయ బానిసత్వాన్ని అనుభవిస్తున్న తెలంగాణ రాజకీయ నాయకత్వానికి, బానిస సంకెళ్లనుండి బంధ విముక్తం కావడానికి తెలంగాణ ఉద్యమం ఇచ్చిన అరుదైన అవకాశాన్ని కూడా ఇక్కడి రాజకీయ నాయకులు అందుకోలేకపోయారు. సీమాంధ్ర రాజకీయ ఆధిపత్యం కింద జీవితకాలపు బానిసత్వానికే తెలంగాణ రాజకీయ నాయకత్వం మరోమారు సిద్ధపడింది.

ఫిబ్రవరి 14నాడు తెలంగాణ జెఎసి కార్యాలయంలో తెలంగాణ నుండి ప్రాతినిధ్యం వహిస్తున్న ఎం.ఎల్.ఎ.లు అందరూ రాజీనామాలతో అసెంబ్లీకి పాదయాత్రగా వెళ్లి స్పీకర్‌కు రాజీనామాలు సమర్పించాలని నిర్ణయం తీసుకున్నారు. చివరకు అదే రోజున ఒకవైపు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్ట్స్ కళాశాలవద్ద విద్యార్థులపై పోలీసులు కాల్పులు జరుపుతున్న సమయంలలోనే 12మంది ఎం.ఎల్.ఎ.లు (ఒకరు టిడిపి, ఒకరు బిజెపి, 10మంది టిఆర్ఎస్) జెఎసి కార్యాలయం నుండి పాదయాత్రగా వెళ్లి అమరవీరుల స్మారకస్థూపం (గన్‌పార్క్)వద్ద నివాళులు అర్పించి, స్పీకర్‌కు రాజీనామాలను సమర్పించివచ్చారు. తెలంగాణ ప్రజా ఉద్యమంలో కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల దొంగనాటకం దీనితో బట్టబయలయ్యింది. ఆ తర్వాత జరిగిన పరిణామాలతో కాంగ్రెస్ పార్టీ జెఎసి నుండి వెళ్లిపోయింది. తెలుగుదేశం పార్టీ బహిష్కరణకు గురయ్యింది. తెలంగాణ ప్రజా ఉద్యమానికి అండగా నిలుస్తారని ఆశించిన ప్రధాన పార్టీలు ద్రోహపూరితంగా వ్యవహరించడంతో ఉద్యమాన్ని బలహీన పరిచేందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు అవకాశం లభించింది. కాలయాపన కోసం కేంద్రప్రభుత్వం శ్రీకృష్ణకమిటీని నియమించింది. ఏకకాలంలో సీమాంధ్ర, తెలంగాణ సమాజాలను పక్కదారి పట్టించేందుకు ఈ కమిటీని పావుగా ఉపయోగించింది. ఇందుకు సీమాంధ్ర ఆధిపత్యంలోని మీడియా లోపాయికారీగా సంపూర్ణ సహకారం అందించింది. శ్రీకృష్ణకమిటీ ఇచ్చే నివేదిక 'సర్వరోగ నివారిణ'గా ప్రచారం నిర్వహించింది. అన్నివర్గాల ప్రజలను ఆ మూసలోకి దారిమళ్లించింది. శ్రీకృష్టకమిటీకి ఇచ్చిన ఏడాది

గడువు లోగా తెలంగాణ ప్రజా ఉద్యమాన్ని నిర్వీర్యం చేయాలని, ఉద్యమంలో సంఘటితమవుతున్న తెలంగాణ ప్రజానీకాన్ని విడదీయాలని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సీమాంధ్ర ఆధిపత్య మీడియా సహకారంతో అనేక ఎత్తుగడలను, వ్యూహాలను అమలు జరిపాయి. కానీ వారి ఆశలన్నీ నిరాశలయ్యాయి. తెలంగాణ ప్రజల ఉద్యమపటిమ ముందు, నిజాయితీ ముందు, కృతనిశ్చయం ముందు ప్రభుత్వాల ఎత్తుగడలు నిలువలేదు. రాజకీయ ద్రోహాలు ఫలించలేదు. ఏకపక్ష మీడియా నాటకాలు రక్తికట్టలేదు. సీమాంధ్ర సంపన్న వర్గాల ధన దురహంకారం ఫలించలేదు. పడిలేచే కెరటంలా తెలంగాణ ప్రజాఉద్యమం నిత్య నూతనంగా ... సజీవ సదృశ్యమయ్యింది.

ఈ పరిణామాల ప్రభావాలనుండి ఉద్యమాన్ని, ఉద్యమంలో మమేకమైన ప్రజానీకాన్ని, ఐక్యతను రక్షించుకునేందుకు తెలంగాణ జెఏసి వ్యూహాత్మకంగా వ్యవహరించింది. ఎప్పటికప్పుడు వర్తమాన పరిస్థితులను సమీక్షించుకుని ఉద్యమ కార్యాచరణను రూపొందిం చింది. ఉద్యమంలో ఎదురవుతున్న లోటుపాట్లను సవరించుకుంటూ, ప్రజల సంఘటిత శక్తిని నిలబెట్టుకునేందుకు ప్రయత్నించింది. తెలంగాణ రాజకీయ నాయకత్వ పిరికితనం, సీమాంధ్ర రాజకీయ ఆధిపత్య భావజాలం, మీడియా అమలు జరుపుతున్న ద్రోహపూరిత విషప్రచారం, తదితర ప్రభావాలకు లోనవుతున్న విద్యార్థి, యువ తరాన్ని రక్షించుకునేందుకు, ఉద్యమ ప్రజల్లో ఆత్మస్థైర్యాన్ని కాపాడేందుకు నేరుగా ప్రజలముందుకే తెలంగాణ జెఏసి వెళ్లింది. అందులోభాగంగా ఉద్యమ యాత్రలను నిర్వహించింది.

మార్చి 21న అమరవీరుల స్మారక స్థూపం (గన్‌పార్క్) నుండి తెలంగాణ ఉద్యమ బస్సు యాత్ర ప్రారంభమయ్యింది. రాత్రి మణుగూరు చేరుకుని అక్కడ దీక్షాశిబిరంలో ప్రసంగించి మరునాడు ఉదయం 9 గంటలకు యాత్ర ప్రారంభమయ్యింది. భద్రాచలం, పాల్వంచ, కొత్తగూడెం, ఇల్లందుల మీదుగా రాత్రి ఖమ్మం చేరుకుని రిక్కాబజార్ స్కూల్‌లో సమావేశం నిర్వహించాం. 23న ఉదయం ఖమ్మంలో మీడియా కాన్ఫరెన్స్ ముగించుకుని డోర్నకల్, బయ్యారం, మహబూబాబాద్, గూడూరు, నర్సంపేట నుండి వరంగల్లు, హన్మకొండలో అర్ధరాత్రి యాత్రను ముగించాం.

ఏప్రిల్ 9న కొమురవెల్లిలో ప్రారంభమైన రెండవ విడత తెలంగాణ ఉద్యమ బస్సు యాత్ర మెదక్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో మూడు రోజులపాటు సాగింది. జిల్లాలలోని జెఏసి స్టీరింగ్ కమిటీ సమావేశాలను నిర్వహించుకుని, వంద రోజులు పూర్తి చేసుకున్న దీక్షాశిబిరాలను సందర్శించుకున్నాం. అన్ని జిల్లాల్లోనూ భవిష్యత్తు కార్యాచరణకు సంబంధించిన సమాలోచనలు జరిపాం. ఆర్టీసీ జెఏసి, సింగరేణి జెఏసి, తెలంగాణ సినిమా జెఏసిలను పటిష్టపరిచే దిశలో సమావేశాలు జరిగాయి. విద్యార్థి సంఘాల జెఏసిలతోనూ సమన్వయ సమావేశాలు జరిగాయి. ఈ రెండు యాత్రల్లోనూ ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాల జెఏసి, తెలంగాణ విద్యావంతుల వేదిక, లెక్చరర్స్ ఫోరం, వివిధ ఉపాధ్యాయ సంఘాలు, తెలంగాణ విద్యుత్ ఉద్యోగుల జెఏసి, వివిధ కుల సంఘాలు, ప్రజా సంఘాలు, ఇతర జెఏసిలు ప్రముఖపాత్రను నిర్వహించాయి. ఈ యాత్రలు తెలంగాణ జెఏసి నాయకత్వంలో కొత్త ఉత్సాహాన్ని నింపాయి. ప్రజల ఉద్యమ సంసిద్ధత తెలిసింది. భవిష్యత్తు ఉద్యమానికి దిశా నిర్దేశం మరింతగా స్పష్టమయ్యింది. అయితే తెలంగాణ రాజకీయ నాయకత్వం ఉద్యమంలో వెనకబడిపోవడం, ప్రజా ఉద్యమంలో భాగం కాకపోవడం, ఉద్యమ నాయకత్వంలో వైవిధ్యాలు కనిపించడం, ఆత్మహత్యల పరంపర కొనసాగుతుండటంలాంటి పరిణామాల నేపథ్యంలో తెలంగాణ ఉద్యమం నివురుగప్పిన నిప్పులాగా, తుఫాను ముందటి ప్రశాంతంగా, విస్ఫోటానికి సిద్ధపడుతున్న అగ్నిపర్వతంలాగా ... అంతుచిక్కని పరిస్థితిలో నిరీక్షణకు గురయ్యింది.

**మానుకోట బాటలో ...**

రెండోసారి ముఖ్యమంత్రిగా బాధ్యతలను స్వీకరించిన వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఆకస్మిక దుర్మరణం తర్వాత రాష్ట్రంలో నాటకీయంగా చోటుచేసుకున్న రాజకీయ పరిణామాలు తెలంగాణ ఉద్యమ క్రమానికి కొంతమేరకు ఉపయోగపడతాయనే భ్రమలు చాలా తక్కువ సమయం లోనే తేలిపోయాయి. తండ్రి స్థానంలో ముఖ్యమంత్రి పదవిని ఆశించిన వై.ఎస్.జగన్మోహన్ రెడ్డి అధికారపార్టీని కొంతమేరకు ఉక్కిరిబిక్కిరి చేసినా రాజకీయ చిత్రపటాన్ని మార్చివేసేంతగా ప్రభావితం చేయలేక పోయారు. తెలుగుదేశం పార్టీ సభ్యులతో పార్లమెంటులో తెలంగాణకు వ్యతిరేకంగా 'ప్లకార్డు'ను పట్టుకున్న జగన్ దృశ్యమే తెలంగాణ ప్రజల మనసుల్లో నిలిచిపోయింది. తెలంగాణ ఉద్యమంపట్ల రాజశేఖర్‌రెడ్డి అనుసరించిన వ్యతిరేక వైఖరి, అమలు జరిపిన కుట్రపూరిత విధానాలు, నిండు సభలో వ్యక్తీకరించిన వ్యంగాలు, ఛలోక్తులు, అవమానాలు ప్రజల మనసుల్లో గాయాలుగా సలుపుతున్నాయి. ఈ రెండు వ్యక్తిత్వాలు మూర్తీభవించుకున్న జగన్‌ను తరతరాల సీమాంధ్ర రాజకీయ ఆధిపత్యానికి ఆనవాలుగా, సీమాంధ్ర దోపిడీ సంపన్న వర్గాల ప్రతిరూపంగా, తెలంగాణ ప్రజల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షకు అడ్డుగోడగా, సమైక్యవాదానికి నిలువుటద్దంగా ... తెలంగాణ ప్రజలు భావించుకున్నారు.

తెలంగాణ శత్రువర్గాల ప్రతినిధి 'జగన్' ఓదార్పుయాత్ర పేరుతో తెలంగాణ గడ్డమీద అడుగుపెట్టడానికి సిద్ధపడడం తమ ఆత్మగౌరవాన్ని దెబ్బతీసేదిగా తెలంగాణ ప్రజలు భావించారు. తెలంగాణ ఉద్యమ ప్రజల ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోవాలంటే జగన్ యాత్రను ఎట్టిపరిస్థితుల్లోనూ అడ్డుకోవాలని తెలంగాణలోని ప్రతి ఒక్కరూ కోరుకున్నారు. జగన్ ఓదార్పుయాత్రపై కాంగ్రెస్ అధిష్టానానికి, ఆయన మద్దతుదారులకు జరుగుతున్న ప్రచ్ఛన్నయుద్ధంపై మీడియా మరింతగా రెచ్చగొట్టే ధోరణితో వ్యవహరించింది. ఫలితంగా తెలంగాణ ప్రజల్లో అడ్డుకోవాలనే తలంపు మరింతగా బలపడింది. తెగింపుగా మారిపోయింది. జగన్ యాత్రను అడ్డుకోవడం తెలంగాణ ప్రజల ఆత్మగౌరవ ప్రతీకగా మారిపోయింది. జగన్ ఓదార్పుయాత్రను వ్యతిరేకిస్తూ ప్రజలు తమంతటతాముగానే నిరసన కార్యక్రమాలను నిర్వహించారు. వరంగల్లుజిల్లా నుండి ప్రారంభమైన ఈ నిరసనలు తెలంగాణ అంతటా విస్తారంగా జరిగాయి. ఓదార్పుయాత్రపై మీడియా ప్రకటనలకు పరిమితమైన రాజకీయ పార్టీలు తెలంగాణ ప్రజల అభిప్రాయాన్ని ప్రతిబింబించలేక పోయాయి. ఉద్యమ భాగస్వామ్యంలో వెనకబడినట్లుగానే ఈ విషయంలో కూడా ఉద్యమ ప్రజలకంటే పార్టీలు వెనకబడిపోయాయి. తెలంగాణ ప్రజలు తమ నిరసనల ద్వారా వ్యక్తం చేస్తున్న అభిప్రాయాలకు అనుగుణంగా తగు నిర్ణయం తీసుకునే విషయంలో తెలంగాణ జెఏసిపై క్షేత్రస్థాయి జెఏసిలనుండి ఒత్తిడి పెరిగింది.

ముందుగా వరంగల్ జిల్లా జెఏసి జగన్ యాత్రను అడ్డుకోవాలని నిర్ణయం తీసుకున్నది. ఇందుకు అవసరమైన వారంరోజుల కార్యాచరణను రూపొందించుకున్నది. మే 19నాడు నిర్వహించిన తెలంగాణ జెఏసి విస్తృతస్థాయి సమావేశంలో వరంగల్లు జెఏసి రూపొందించిన కార్యాచరణపై సుదీర్ఘంగా చర్చ జరిగింది. జగన్ ఓదార్పుయాత్ర పేరుతో తలపెట్టిన ఆధిపత్య దండయాత్రను అడ్డుకోవాలని రాష్ట్ర జెఏసి స్టీరింగ్ కమిటీ ఏకగ్రీవంగా నిర్ణయించింది. తెలంగాణ జెఏసి మొట్టమొదటిసారిగా తీసుకున్న రాజకీయ కార్యాచరణకు విద్యార్థి సంఘాల మద్దతును కూడగట్టింది. మే 21నాడు తెలంగాణ జెఏసి, విద్యార్థి సంఘాల జెఏసిల ఉమ్మడి సమావేశం నిర్వహించి ఉమ్మడి కార్యాచరణను రూపొందించుకుని

మీడియా ద్వారా ప్రకటించింది. వరంగల్ జిల్లా జెఎసి జగన్ యాత్రను అడ్డుకునే క్రమంలో జిల్లా ప్రజానీకాన్ని సమాయాత్తం చేయడం కోసం వారం రోజుల వరుస కార్యక్రమాలను ప్రకటించింది. జిల్లా వ్యాపితంగా నిరసన ర్యాలీలు, రాస్తారోకోలు, బహిరంగసభను నిర్వహించారు. జిల్లా కేంద్రంతో పాటుగా అంతటా అడ్వకేట్లు భారీగా కదిలారు. వరంగల్లు నుండి మహబూబాబాద్ వరకు యాత్ర నిర్వహించారు. పిడమర్తి రవి, రాజారాం యాదవ్, కోటా శ్రీనివాస్ గౌడ్‌ల నాయకత్వంలో విద్యార్థులు భారీ ఎత్తున మానుకోటకు కదిలారు. ప్రతిక్షణం వెంటాడుతున్న పోలీసులను తప్పించుకుంటూ సమీప గ్రామాలనుండి విద్యార్థులను సమీకరించేందుకు ప్రయత్నించారు.

జగన్ ఓదార్పుయాత్రకు నిరసనగా జిల్లా జెఎసి పిలుపు మేరకు 25న నిర్వహించిన జిల్లా బంద్‌కు అనూహ్యమైన రీతిలో ప్రజలనుండి స్పందన లభించింది. జెఎసిలో భాగస్వామ్య పార్టీలుగా ఉన్న తెలంగాణ రాష్ట్ర సమితి, భారతీయ జనతా పార్టీ, సిపిఐ-ఎం.ఎల్. న్యూ డెమొక్రసీ పార్టీలు ఈ బంద్‌కు పూర్తిస్థాయిలో సహకరించాయి. ఇదే రోజున జెఎసి రాష్ట్ర నాయకత్వంకూడా వరంగల్లు, మహబూబాబాద్‌లలో పర్యటించి జగన్ పర్యటనను ఎట్టిపరిస్థితుల్లోనూ అడ్డుకుని తీరుతామని స్పష్టంగా ప్రకటించింది. దీనితో జిల్లాలో వాతావరణం ఒక్కసారిగా వేడెక్కింది. ఇతర జిల్లాలపై కూడా ఈ ప్రభావం కనిపించింది. అడ్డుకోవడం అప్రజాస్వామిక మంటూ మీడియాలో మేధావులు చర్చోపచర్చలు నిర్వంచారు. అయితే ఇదే సందర్భంలో కెసిఆర్‌ను కత్తి పద్మారావు స్వయంగా కలిసి విజయవాడకు రావాలని ఆహ్వానించడం చర్చనీయాంశమయ్యింది.

అప్పటివరకూ నివురుగప్పిన నిప్పులాగా ఉన్న మానుకోటలో పరిస్థితులు వేగవంతంగా మారిపోయాయి. ఇతర జిల్లాలనుండి ఉద్యమకారులు అక్కడికి రావడం ప్రారంభమయ్యింది. జగన్ అనుచరులు ఖమ్మంలో భారీసంఖ్యలో మకాం వేసినట్లు వార్తలు వచ్చాయి. 26వ తేదీనాడు మహబూబాబాద్ రైల్వేస్టేషన్‌లో 'బాంబులున్నాయి జాగ్రత్త!!' అంటూ ఓ సంచి ప్రత్యక్షమయ్యింది. మూటవిప్పితే అందులో పాతచెప్పులు ప్రత్యక్షమయ్యాయి. ప్రజల అభిప్రాయానికి విరుద్ధంగా మానుకోటలో జగన్ పర్యటిస్తే చెప్పులతో సత్కరిస్తామని, యాత్రకు సహకరిస్తున్న వారికి అదే గతిపడుతుందని 'తెలంగాణ లిబరేషన్ ఆర్మీ' పేరిట మూటలో ఉన్నలేఖలో హెచ్చరిక ఉంది. ఇదే రోజు సాయంత్రం బస్టాండు సమీపంలో ఉన్న ఓవర్‌హెడ్ ట్యాంకుపై జగన్ యాత్రను నిరసిస్తూ ఓ విద్యార్థి ఆత్మహత్యా ప్రయత్నం చేసాడు. అక్కడ ఓ గంటపాటు హైడ్రామా నడిచింది. ఈ సంఘటనలన్నీ మీడియాలో ప్రధాన వార్తలయ్యాయి. 27న బస్టాండులో 'బాంబు' కలకలం ఉదయం 11 గంటల నుండి సాయంత్రం 8 గంటల వరకు కొనసాగింది. బాంబు డిస్పోజబుల్ స్క్వాడ్, డాగ్ స్క్వాడ్, ప్రత్యేక పోలీసులు రంగంలోకి దిగారు. పోలీసు యంత్రాంగం అప్రమత్తమయ్యింది. భారీ పోలీసు బలగాలను మానుకోటలో మోహరించారు. పట్టణమంతా పోలీసులతో నిండిపోయింది. రాత్రి 8 గంటలకు ప్లాస్టిక్ బకెట్‌ను పట్టణ శివారులోకి తీసుకువెళ్లి భారీ పోలీసు బందోబస్తు మధ్యన పేల్చివేసారు. చివరకు ఆ బకెట్‌లో ఆలుగడ్డతో తయారు చేసిన డమ్మీ బాంబులున్నట్లు తేల్చివేసారు. 'తెలంగాణ లిబరేషన్ ఆర్మీ' పేరిట దొరికిన లేఖలో జగన్ కాన్వాయిని బాంబులతో పేల్చివేస్తామని హెచ్చరించారు. అయితే ఈ సంఘటనతో రాష్ట్ర పోలీసు యంత్రాగం మొత్తం అప్రమత్తమయ్యింది. జగన్ ప్రయాణించే మార్గంలో రైల్వేలైనును పేల్చివేస్తామని కూడా 'తెలంగాణ లిబరేషన్ ఆర్మీ' ఆ మరునాడు మీడియా ద్వారా హెచ్చరించింది. ఇదే రోజున వరంగల్లు నుండి అనేకమంది అడ్వకేట్లు మానుకోటకు యాత్రగా చేరుకున్నారు. టిఆర్ఎస్, బిజెపి, న్యూడెమొక్రసీ నాయకులు సైతం మానుకోటలో మకాం వేసారు. సాయంత్రం నిర్వహించిన భారీ ర్యాలీతో పట్టణ ప్రజల్లోనూ ఉత్సాహం పెరిగింది. మే 27 రాత్రి సమయానికి మానుకోటలో ఒక ఉద్వేగపూరిత వాతావరణం నెలకొన్నది. తెలంగాణ సమాజం మొత్తం మానుకోటమీద మనసుపెట్టి ఉత్కంఠంగా కాలం గడిపింది. 28న నాలుగుకోట్ల తెలంగాణ ప్రజల ఆత్మగౌరవానికి మానుకోట ఒక ప్రతీకగా నిలబడింది. తెలంగాణ ఉద్యమ చరిత్రలో ఇది ఒక మైలురాయిగా నిలిచింది.

**అనూహ్యమైన గెలుపు ... అదొక మలుపు**

మానుకోట ప్రతిఘటన ఇచ్చిన స్ఫూర్తితో తెలంగాణ జెఎసి మరింత విస్తృతమైన కార్యాచరణను రూపొందించుకున్నది. తెలంగాణ ప్రజల డిమాండు మేరకు రాజీనామాలు చేసిన 12మంది ఎం.ఎల్.ఎ. లను తిరిగి ఏకగ్రీవంగా గెలిపించుకోవాలనే లక్ష్యంతో సంప్రదింపుల ద్వారా మిగితా పార్టీల సమ్మతిని కూడగట్టాలనే ప్రయత్నం ఫలించలేదు. రాజీనామాల విషయంలో అనుసరించిన దాగుడు మూతల వ్యూహాన్నే తెలుగుదేశం పార్టీ ఉపఎన్నికల విషయంలోనూ అనుసరించింది. కాంగ్రెస్ పోటీలో లేకుంటే తాము కూడా ఆలోచిస్తామని స్పష్టం చేసింది. అయితే ఉప ఎన్నికల విషయంలో కాంగ్రెస్‌లోనూ భిన్నాభిప్రాయాలు వ్యక్తం అయ్యాయి. ఎన్నికల్లో పోటీ చేయడానికి ఉబలాటపడుతున్న వాళ్లు ఒకరకంగానూ, ఎన్నికలకు దూరంగా ఉండాలనుకునేవాళ్లు మరోరకంగానూ విడిపోయారు. ఈ మొత్తం వ్యవహారంలో పి.సి.సి. అధ్యక్షుడు డి. శ్రీనివాస్ నిర్వహించిన పాత్ర తెలంగాణ ఉద్యమానికి ద్రోహపూరితమైనది. ఉపఎన్నికల్లో గెలిస్తే తాను ముఖ్యమంత్రినో, ఉపముఖ్యమంత్రినో అయిపోతానని బహిరంగంగానే ప్రకటించుకుని, ఉపఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థులను బరిలోకి దింపడానికి ప్రధానంగా కారకుడయ్యాడు.

ప్రజల డిమాండు మేరకు రాజీనామాలు చేయాలనే ఒత్తిడి తెలంగాణ జెఎసి నుండి వచ్చిందికాబట్టి, రాజీనామాలు చేసిన వారిని తిరిగి గెలిపించే బాధ్యత కూడా తెలంగాణ జెఎసినే తీసుకున్నది. మానుకోట ప్రతిఘటన తర్వాత ప్రజల్లో జెఎసి పట్ల విశ్వాసం మరింతగా పెరిగింది. జూన్ 12వతేదీనాడు జరిగిన విస్తృతస్థాయి జెఎసి స్టీరింగ్ కమిటీ సమావేశంలో ఉపఎన్నికల వ్యూహాన్ని సిద్ధం చేసుకున్నాం. రాష్ట్ర జెఎసి నుండి 12 నియోజకవర్గాలకు బాధ్యులను నియమించుకుని, స్థానిక, జిల్లా జెఎసిలను కలుపుకుని నియోజకవర్గాల పరిస్థితిపై సమగ్ర అధ్యయనం నిర్వహించాము. రాజీనామాలు చేసిన చాలామంది ఎమ్మెల్యేల విషయంలో ప్రజల్లో అసంతృప్తి ఉన్నప్పటికీ, ప్రజల డిమాండు మేరకు రాజీనామాలు చేసారనే సానుభూతి కూడా కనిపించింది.

ఇదే సమయంలో విద్యార్థి బృందాలు ఉపఎన్నికలు జరుగుతున్న 12 నియోజకవర్గాల్లో విస్తృతంగా పర్యటించి ఎన్నికల చుట్టూ తెలంగాణ ఉద్యమ నేపథ్యాన్ని సృష్టించడంలో కృతకృత్యు లయ్యారు. ఉపఎన్నికల పూర్వరంగ ప్రచారంలో పర్యటించిన విద్యార్థి బృందాలకు ఉద్యమ ప్రజలనుండి అనూహ్యమైన స్పందన, ఆదరణ లభించాయి. ఈ ప్రచారాన్ని ఓట్ల మళ్లింపునకు ఉపయోగించు కోవడంలో రాజీనామాలు చేసిన ఎంఎల్ఎలు సైతం ప్రయత్నించారు. మానుకోట ఘటన తర్వాత జూన్, జూలై రెండు నెలల పూర్తికాలం ఉప ఎన్నికల ప్రచారంతోనే ముగిసింది. జెఎసి నాయకత్వం పూర్తి కాలాన్ని ఈ ఎన్నికల కోసం వెచ్చించింది. రాజీనామాలు చేసిన అభ్యర్థులందరూ వారివారి పార్టీ అభ్యర్థులకంటే జెఎసి అభ్యర్థులుగానే ప్రజలు అంగీకరించారు. పార్టీలు సైతం జెఎసి జెండా కిందనే ఎన్నికల ప్రచారాన్ని నిర్వహించాయి. అయితే ఈ పరిస్థితులు టిఆర్ఎస్ పార్టీకి ఇబ్బందికరంగా మారినట్లు ఆ పార్టీ నాయకత్వం,

ఎన్నికలబరిలోకి దిగిన అభ్యర్థుల ప్రవర్తననుబట్టి అర్థమయ్యింది. ఈ ఉపఎన్నికల సమయంలో ఉద్యోగవర్గాలు సైతం తమతమ పద్ధతుల్లో విశేషంగా కృషిచేసాయి.

2009 నవంబర్ నెలాఖరునుండి ఉద్యమంలో పాల్గొంటున్న తెలంగాణ సమాజం ఈ ఉపఎన్నికలను అత్యంత ప్రతిష్ఠాత్మకంగా తీసుకుంది. అప్పటికే ఆరుమాసాలుగా ఎడతెరపి లేకుండా కొనసాగుతున్న ఉద్యమం, తెలంగాణ విషయంలో మాటిమాటికీ రంగులు మారుతున్న రాజకీయాలు ఉపఎన్నికలకు సానుకూలమైన భౌతిక పునాదిని కల్పించాయి. ఉద్యమంలో పాల్గొన్న కులవృత్తులవాళ్లు, వృత్తికులాల ప్రజలు తమ పనిముట్లను ఉద్యమ ప్రతీకలుగా ప్రతిబింబించారు. ఉద్యమంలో భాగంగా అప్పటికే గ్రామగ్రామాన వెలిసిన టెంట్లలో తమకు జీవనాధారంగా ఉపయోగపడుతున్న పనిముట్లను ఉద్యమంలో భాగంచేసి ప్రదర్శించారు. నూలు వడికారు. వలలు పరిచారు. కుండలు చేశారు. మగ్గం నేశారు. ప్రపంచీకరణ ప్రభావంతో కనుమరుగవుతున్న గ్రామీణ జీవితాన్ని ఉద్యమంలో పునప్రతిష్టించారు. వలస దోపిడీతో తాము కోల్పోయిన జీవితాన్ని తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడితేనే, స్వయంపాలన, స్వయం నిర్ణయాధికారాన్ని సాధించుకుంటేనే తిరిగి పొందగలమని ఇక్కడి ప్రజలు గట్టిగా నమ్మారు. అందుకే ఏడాదికోసారి జరుపుకునే పండగ, పబ్బాలను కూడా ప్రతిరోజూ నడిరోడ్డుమీద, ఉద్యమ శిబిరాలవద్ద ఉద్యమంలో భాగంగా ప్రదర్శించారు. బతుకమ్మలను పేర్చుకున్నారు. బోనాలను ఎత్తుకున్నారు. వ్యక్తిగత సమస్యలను, కుటుంబ ఇబ్బందులను, సాంఘికమైన అంశాలను పక్కకుపెట్టి అన్ని సందర్భాలను ఉద్యమానికి జోడించారు. తెలంగాణ సాంస్కృతిక ప్రతీకలన్నింటినీ ఉద్యమంలో భాగం చేశారు.

ఉమ్మడి రాష్ట్రంలో సీమాంధ్ర పాలకులు అనుసరిస్తున్న పక్షపాత విధానాల ఫలితంగానే తమ బతుకుల్లో చీకట్లు కమ్ముకున్నాయని తెలంగాణ ప్రజలు సంపూర్ణంగా విశ్వసించారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడితేనే సకల సమస్యలకు పరిష్కారం వెతుక్కునేందుకు అవకాశం దొరుకుతుందని పూర్తిగా నమ్మారు. తెలంగాణ ఉద్యమం తెలంగాణ ప్రజలకు ఈ విషయంలో స్పష్టతను ఇవ్వగలిగింది. మరోవైపున ఉద్యమంలో అత్యంత చురుకైన పాత్రను నిర్వహిస్తున్న యువకులు తమ జీవితాలకు, భవిష్యత్తుకు తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు మాత్రమే ఏకైక మార్గంగా నమ్ముతున్నారు. ఉద్యమిస్తున్న సాధారణ ప్రజలకు వీరందరూ అండగా నిలిచారు. ఉద్యమ ఉధృతి సడలిపోకుండా, ఎలాంటి ఆటుపోట్లు ఎదురైనా తట్టుకుంటూ ఉద్యమాన్ని సజీవంగా నిలపడంలో అత్యంత కీలకంగా నిలుస్తున్నారు. దాదాపు ఏడు కేంద్రాలలో నిరహారదీక్షా శిబిరాలు 500రోజులు దాటి నడుస్తున్నాయంటే తెలంగాణ ఉద్యమ స్ఫూర్తి ఎంతబలమైనదో అర్థం చేసుకోవచ్చు.

ఉద్యమ ప్రజలను ఉపఎన్నికల దిశలో సమీకరించుకునేందుకు తెలంగాణ జెఎసి ఎనమిదిరోజుల కార్యాచరణను ప్రకటించింది. ఉపఎన్నికల నోటిఫికేషన్ విడుదలైన జూలై 2 నుండి నామినేషన్ల గడువు ముగిసే జూలై 9 వరకు ఈ కార్యక్రమాలకు ప్రజలనుండి స్పందన అనూహ్యంగా లభించింది. జూలై 1న దండోరాతో ప్రారంభమై, తెలంగాణ జెండా ఆవిష్కరణ, అలాయి-బలాయి (సర్వమత ప్రార్థనలు-ప్రతిజ్ఞ), అమరవీరుల స్మృతి, తెలంగాణ దీక్షా కంకణం, విద్యార్థుల మానవహారం, తెలంగాణ జులూస్, తెలంగాణ గ్రామ కట్టడిలాంటి వినూత్న కార్యక్రమాలను స్థానిక జెఎసిలు ఉత్సాహంగా నిర్వహించాయి.

ఉపఎన్నికల సమయంలో ఎన్నికల ప్రచార వాతావరణం కంటే ఉద్యమ వాతావరణమే ఎక్కువగా కనిపించింది. ఉపఎన్నికలు జరుగుతున్న చాలా గ్రామాల్లో పోటీలో నిలిచిన కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు చెందిన అభ్యర్థులనుగానీ, వారి తరఫున పార్టీ నాయకులను గానీ అడుగుపెట్టనీయలేదు. రాజీనామాలు చేసిన వారిపై పోటీకి నిలిచినవారిని తెలంగాణ ద్రోహులు గానే ప్రజలు భావించారు. పార్టీ అభ్యర్థులను ఉపఎన్నికల బరిలోకి బలవంతంగా దింపిన చంద్రబాబు నాయుడు ఎన్నికల ప్రచారంలో పాల్గొనే సాహసం చేయలేకపోయాడు. దేవేందర్‌గౌడ్‌లాంటి ఒకరిద్దరు పార్టీ నాయకులు పార్టీ తరఫున ప్రచారం చేసేందుకు ప్రయత్నించి భంగపడ్డారు. ప్రజల నుండి తీవ్రమైన వ్యతిరేకతను ఎదుర్కొని పరాభవం పొందారు. చివరకు చంద్రబాబునాయుడు ఆడిన 'బాబ్లీ' డ్రామాను కూడా తెలంగాణ ఉద్యమ ప్రజలు సీమాంధ్ర కుట్రగానే అర్థం చేసుకుని పార్టీ అభ్యర్థులెవ్వరికీ కనీసం డిపాజిట్టు దక్కని రీతిలో గుణపాఠం చెప్పారు.

అత్యంత బలహీనమైన ముఖ్యమంత్రిగా అధికారంలో కొనసాగుతున్న కొణిజేటి రోశయ్య కూడా ఎన్నికల ప్రచారంలో పాల్గొనలేక పోయారు. అధికారపీఠానికి మడుగులొత్తడమే మహా భాగ్యంగా భావించే కొంతమంది తెలంగాణ మంత్రులు మాత్రమే ఎన్నికల ప్రచారంలో పాల్గొని తమ బానిస భావజాలాన్ని ప్రకటించు కున్నారు. ఈ ఉపఎన్నికల్లో నిజామాబాద్ (అర్బన్) స్థానానికి జరిగిన ఎన్నికలు అన్ని విధాలుగా ప్రత్యేకతను సంతరించుకున్నాయి. ఉప ఎన్నికలను ఏకగ్రీవం కాకుండా నిలువరించడంలో ప్రధాన దోషిగా నిలిచిన డి. శ్రీనివాస్ ఒక జాతీయ పార్టీకి రాష్ట్రస్థాయి అధ్యక్షునిగా కాకుండా, నిలువెల్లా స్వార్థం నింపుకున్న తెలంగాణ ద్రోహిగానే పనిచేశారు. పదవుల పేరుతో, కులం పేరుతో, మతం పేరుతో నిజామాబాద్‌లో ఓట్లకోసం ఆయన చేయని అకృత్యాలు లేవు. టివీ9 లాంటి సీమాంధ్ర, పచ్చి తెలంగాణ వ్యతిరేక ఛానెల్ ఇట్లాంటివాళ్లకు లోపాయికారీగా సహకరించి ద్రోహానికి ఒడిగట్టింది. అయితే తెలంగాణ ఉద్యమ ప్రజలందరూ రాజీనామా చేసిన యెండల లక్ష్మీనారాయణ పట్ల సానూభూతితోనే స్పందించారు. ఆయన బిజెపి అభ్యర్థిగాకంటే తెలంగాణ జెఎసి అభ్యర్థిగానే ఎన్నికల ప్రచారాన్ని నిర్వహించారు. నిజామాబాద్ జిల్లా జెఎసితోపాటుగా న్యాయవాదులు, తెలంగాణ జాగృతి కార్యకర్తలు, న్యూడెమొక్రసీ, టిఆర్ఎస్ శ్రేణులు, మరీ ముఖ్యంగా ముస్లిం మైనారిటీ నాయకులు ప్రజలను సానుకూలంగా సమీకరించడంలో ఎంతో కృషి చేసాయి.

మొత్తంగా ఉపఎన్నికల ఫలితాలు తెలంగాణ ఉద్యమ ఉధృతిని ప్రపంచానికి చాటిచెప్పాయి. సీమాంధ్ర రాజకీయ కుట్రలను భగ్నం చేశాయి. ఉద్యమంలో నిజాయితీలేని రాజకీయశక్తులకు కళ్లు తెరిపించాయి. నాలుగుకోట్ల తెలంగాణ ప్రజల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షను ఈ 12 నియోజకవర్గాల ఎన్నికల ఫలితాలు ప్రతిబింబించాయి. అయితే ఏకపక్షంగా వెలువడిన ఈ ఉపఎన్నికల ఫలితాలు, తెలంగాణ భవిష్యత్తు రాజకీయాలలో పెనుమార్పులకు సంకేతాలుగా కనిపిస్తున్నాయి. ఉపఎన్నికల ఫలితాలు తమకు అనుకూలమనిగానీ, తమ విజయమనిగానీ టిఆర్ఎస్‌తోసహా ఏ పార్టీ ప్రకటించుకునేందుకు సాహసం చేయకపోవడంతో అది తెలంగాణ ప్రజల విజయమేననే వాస్తవాన్ని ఒప్పుకోక తప్పలేదు. ఎవ్వరూ ఊహించని మెజారిటీని అందించడం ద్వారా తెలంగాణ ప్రజలు ప్రత్యామ్నాయ రాజకీయాలను కోరుకుంటున్నారనే సూచిక కనిపిస్తున్నది.

**ఉద్యమ విస్తరణ దిశలో మిలియన్ మార్చ్**

ఉపఎన్నికల ఫలితాలు ఇచ్చిన ఊపుతో ఉద్యమం మరోమారు ఊపందుకున్నది. ఆ తర్వాత జరిగిన జాతీయ రహదారి-7, 9లపై నిర్వహించిన మానవహారాలకు ప్రజలనుండి అనూహ్య స్పందన లభించింది. రాజీవ్ రహదారిపై నిర్వహించిన 'వంటా-వార్పు' కార్యక్రమం వినూత్నంగా విజయవంతం అయ్యింది. ఇదే సమయంలో జెఎసి తన సంస్థాగత నిర్మాణాలమీద దృష్టిని కేంద్రీకరించింది. అన్ని జిల్లాలలోనూ పూర్తిస్థాయి కమిటీలను ఏర్పాటు చేసుకున్నది. డివిజన్ స్థాయిలోనూ,

నియోజకవర్గ స్థాయిలోనూ, కొన్ని జిల్లాలలో మండల, గ్రామస్థాయి వరకూ తెలంగాణ జెఎసి కమిటీలు ఏర్పడ్డాయి. ఉపఎన్నికల ఫలితాల తర్వాత కూడా ఆత్మహత్యల పరంపర కొనసాగడంలో ఉద్యమంలో ఆందోళనకరమైన పరిణామంగా అందరూ గుర్తించారు. ఆత్మహత్యల నిరోధంపై ప్రత్యేక దృష్టిని సారించారు. ప్రొఫెసర్ ఘంటా చక్రపాణి చొరవతో ఆత్మహత్యల నిరోధానికి ఒక ప్రత్యేక కమిటీ ఏర్పాటయ్యింది. జిల్లాలలో ప్రత్యేక సమావేశాలు, విద్యార్థులకు కౌన్సిలింగ్ లాంటి కార్యక్రమాలు జరిగాయి. ఉద్యమంపట్ల సీమాంధ్ర మీడియా పనిగట్టుకుని చేస్తున్న దుష్ప్రచారాలు, తెలంగాణ అంశంపై సుదీర్ఘంగా ఏకపక్షంగా నిర్వహిస్తున్న మీడియా చర్చలు, తెలంగాణ రాజకీయ నాయకత్వం పాటించిన వ్యూహాత్మక మౌనం, సీమాంధ్ర రాజకీయ నాయకులు తెలంగాణపై చేసిన అవమానకరమైన వాఖ్యానాలు, ఉద్యమంలో ఎదురవుతున్న ఆటుపోట్లు, తదితర కారణాలవల్లనే తెలంగాణలో ఆత్మహత్యలు కొనసాగుతున్నట్లు ఈ కమిటీ అధ్యయనంలో వెల్లడించింది. ఆత్మహత్యల నిరోధానికి తెలంగాణ జెఎసి, విద్యార్థి సంఘాలతో కలిసి ఆత్మహత్యల నిరోధక కమిటీ ఆగస్టు 18నాడు తెలంగాణ వ్యాపితంగా నిర్వహించిన 'ప్రతిజ్ఞ'లు కొంత ప్రభావితం చేశాయి. అయితే తెలంగాణలో కొనసాగుతున్న ఆత్మహత్యలకు సీమాంధ్ర ఆధిపత్య మీడియాదే ప్రధాన బాధ్యతగా సర్వత్రా ఒక ధృఢమైన అభిప్రాయం నెలకొన్నది. ఈ అంశంపై బహిరంగ చర్చను నిర్వహించాలని తెలంగాణ జెఎసి తరఫున ఏపియుడబ్ల్యుజె నాయకులకు లేఖ రాసినప్పటికీ ఎలాంటి స్పందన లభించలేదు. కానీ తెలంగాణ ఆకాంక్షలపై కక్షగట్టి, తప్పుడు ప్రచారాలు నిర్వహిస్తున్న సీమాంధ్ర మీడియామీద జెఎసి ఖచ్చితమైన వైఖరిని ప్రకటించిన సందర్భాలలో మాత్రం సదరు ఏకపక్షమీడియా పక్షాన ఈ నాయకులే మధ్యవర్తులుగా పెద్దరికం ప్రదర్శించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అయితే ఇదే అంశంపై తెలంగాణ జర్నలిస్టుల ఫోరంతో కలిసి తెలంగాణ విద్యావంతుల వేదిక జనవరి మాసంలో నిర్వహించిన రౌండ్‌టేబుల్ సమావేశానికి మాత్రం సీమాంధ్ర ఛానళ్ల ప్రతినిధులు ముఖం చాటేసుకున్నారు. టీవీ స్టూడియోల్లో నిర్వహించే అంతర్గత చర్చల్లో ఆవేశపడటానికి అలవాటు పడిన సీమాంధ్ర ఏకపక్ష జర్నలిస్టులు బహిరంగ చర్చల్లో పాల్గొనే సాహసం చేస్తారనుకోవడం ఒక భ్రమగానే మిగిలిపోయింది. మరికొన్ని సందర్భాలలో కూడా ఇది స్పష్టమయ్యింది.

హైదరాబాద్ సంస్థానాన్ని భారతదేశంలో విలీనం చేసిన సెప్టెంబర్ 17నాటి సంఘటనను ఎట్లా గుర్తించాలనే అంశంపై తెలంగాణ జెఎసిలో సుదీర్ఘమైన, భిన్నమైన చర్చలు జరిగాయి. విమోచన దినోత్సవంగా నిర్వహించాలని భారతీయ జనతా పార్టీ జెఎసి చర్చల్లో గట్టిగా పట్టుబట్టింది. ఇటీవల చనిపోయిన బిజెపి మహిళా నాయకురాలు ఝాన్సీ ఈ చర్చల్లో ప్రముఖంగా పార్టీ వాదనలు వినిపించారు. విమోచన దినోత్సవంగా జరుపుకోవాలని తెలంగాణ రాష్ట్ర సమితి మొదట అభిప్రాయపడినా చివరకు జెఎసి నిర్ణయానికి కట్టుబడి ఉంటామని ప్రకటించింది. ఈ విషయంలో సిపిఐ ఎం.ఎల్. న్యూడెమెక్రసీ నాయకులు భిన్నమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. అయితే సుదీర్ఘ చర్చల తర్వాత సెప్టెంబర్ 17న విలీనదినంగా జరుపుకుంటూనే, విమోచన కోసం పోరాడాలని జెఎసి అభిప్రాయపడింది. ఈ మేరకు విలీన దినం పేరిట తెలంగాణ వ్యాపితంగా జాతీయ జెండాలతోపాటు, తెలంగాణ జెండాలను ఎగురవేశారు.

మరొకవైపున తెలంగాణ అంతటా ధూం, ధాం లాంటి కార్యక్రమాలు విస్తృతంగా జరుగుతూనే ఉన్నాయి. ఉద్యమంలో భాగంగా ఎదిగిన తెలంగాణ కళాకారులు గజ్జెకట్టి గ్రామాగ్రామాన కార్యక్రమాలను నిర్వహిస్తూ ఉద్యమ ప్రజలను ఉత్తేజితులను చేస్తున్నారు. ఒకవైపున తెలంగాణ ఇతివృత్తంగా సినిమాలు జోరందుకున్నాయి. ఎన్. శంకర్ దర్శకత్వంలో నిర్మించిన 'జైబోలో తెలంగాణ' సినిమా నిర్మాణం దాదాపుగా తెలంగాణ ఉద్యమంలో భాగంగా మారిపోయింది. ఉద్యమంలో ముందున్న నాయకుల్లో అనేక మంది తెరమీద ప్రత్యక్షమయ్యారు. తెలంగాణ ఉద్యమ నేపథ్యంలో రసమయి బాలకిషన్ దర్శకత్వంలో ప్రారంభమైన 'యమలోకంలో జై తెలంగాణ'తోపాటు మరికొన్ని సినిమాలు సైతం నిర్మాణంలోకి వచ్చాయి. తెలంగాణ సినిమా జెఎసి కూడా ఏర్పాటయ్యింది. సినిమారంగంలో తెలంగాణ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయాలను ప్రశ్నించే ప్రయత్నం చేశారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికి టిఆర్ఎస్ ఆధ్వర్యంలో ఏర్పాటు చేసిన 'రాజ్' న్యూస్ ఛానల్ ఉద్యమ ప్రజలకు కొంత ధైర్యాన్ని అందించింది. అతి తక్కువ కాలంలోనే 'రాజ్ న్యూస్' ఛానల్ తెలంగాణ ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నది. తెలంగాణ ఉద్యమ వార్తలతోపాటు, తెలంగాణ సంస్కృతీ సాంప్రదాయాలను ప్రతిబింబించడంలో ఇప్పుడు 'టి' న్యూస్‌గా మారిన రాజ్‌ఛానల్ అంకితభావంతో కృషి చేస్తున్నది. తెలంగాణ ఉద్యమానికి 'టి' ఛానల్ ఒక ఆయుధంగా, ఆలంబనగా పనిచేస్తున్నది. అయితే అందులో వస్తున్న వ్యాపార ప్రకటనల విషయంలో మాత్రం విభిన్నమైన అభిప్రాయాలు వ్యక్తం అవుతున్నాయి. ఏది ఏమైనా సీమాంధ్ర మీడియా ఆధిపత్యానికి, తెలంగాణ కోసమే పని చేస్తున్న మరికొన్ని ఛానల్స్ కొంతమేరకు ప్రత్యామ్నాయంగా పనిచేస్తున్నాయి.

తెలంగాణ రచయితలు కూడా తమవంతు కర్తవ్యంగా తమ రచనల ద్వారా ఉద్యమానికి ఉత్తేజాన్ని అందించారు. తెలంగాణ రచయితల వేదిక, 'సింగిడి'లాంటి సంస్థలు అనేక సంకలనాలను వెలువరించాయి. 2004లో ప్రారంభమైననాటినుండి ఉద్యమ భావవ్యాప్తిలో ముందున్న 'తెలంగాణ విద్యావంతుల వేదిక' తెలంగాణ ఉద్యమానికి అనుసంధానంగా అనేక సదస్సులను, కార్యక్రమాలను నిర్వహిస్తూనే ఉన్నది. తెలంగాణ జర్నలిస్టుల ఫోరం ఉద్యమ క్రమంలో వేగం పుంజుకున్నది. తెలంగాణ ఉద్యమ శక్తులను ఐక్యం చేసేందుకు అనేక కార్యక్రమాలను నిర్వహించింది. తెలంగాణలోని జర్నలిస్టులందరినీ సంఘటిత పరుచడంలో విశేషంగా కృషి చేసింది. ఇందులో భాగంగా జనవరి 5న ఆర్.టి.సి. కల్యాణమంటపంలో టిజెఎఫ్ నిర్వహించిన సభ అత్యంత కీలకమైనది. తెలంగాణ వర్తమాన ఉద్యమంలో న్యాయవాదులు, విద్యార్థులు నిర్వహించిన పాత్ర అమోఘమైనది. రాజధానితో పాటు జిల్లా కేంద్రాలలోనూ, స్థానికం గానూ న్యాయవాదులు సమరశీలమైన పోరాటాలను నిర్వహించారు. న్యాయవాదులు నిర్వహించిన 'ఛలోఢిల్లీ' కార్యక్రమం దేశరాజధానిలో సంచలనం సృష్టించింది. ఉన్నత న్యాయస్థానం లో తెలంగాణ ప్రాంతానికి 42శాతం వాటా కోసం న్యాయవాదులు అలుపెరుగని పోరాటం చేసి విజయం సాధించారు. ఉద్యమంలోని ప్రతి సందర్భంలోనూ న్యాయవాదులు తమవంతు కృషిని కొనసాగించారు. ఒకవైపున ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొంటూనే మరోవైపున ఉద్యమంలో పోలీసు కేసులను ఎదుర్కొంటున్న బాధితుల పక్షాన ఉచితంగా న్యాయసహాయం అందించి మానవత్వాన్ని ప్రదర్శించారు. ఫ్రీజోన్ విషయంలోనూ, గ్రూప్-1 సర్వీసుల్లో తెలంగాణ ప్రత్యేక వాటా డిమాండుతోనూ, అసెంబ్లీ ముట్టడి సందర్భంగానూ విద్యార్థులు తమ శక్తియుక్తులను ప్రదర్శించి ఉద్యమ స్ఫూర్తిని చాటుకున్నారు. విద్యార్థులే తెలంగాణ వర్తమాన ఉద్యమానికి దిక్సూచిగా నిలిచారు. ఆత్మత్యాగాలతో ఉద్యమ జ్వాలలను విస్తరించారు. తెలంగాణ ఉద్యమం ఆటుపోట్లకు గురైన ప్రతిసందర్భం లోనూ ఉద్యమవేడిని రగిలించడంలో విద్యార్థులు నిర్వహించిన పాత్ర చరిత్రాత్మకమైనది. అయితే సంఘటిత ఉద్యమంగా విద్యార్థి ఉద్యమాన్ని రూపుదిద్దడంలో ఇతర సంస్థలు ఎదుర్కొన్న పరిమితులు, అడ్డంకుల నుండి వీరికి కూడా మినహాయింపు లభించకపోవడం ఉద్యమ

వేగానికి అడ్డంకిగానే భావించాలి. తెలంగాణ డాక్టర్స్ జెఏసికూడా తమ వృత్తి ఒత్తిళ్లను భరిస్తూనే ఉద్యమంలో క్రియాశీలకంగా భాగస్వాములయ్యారు. ఉద్యమ భావవ్యాప్తిలోనూ, ప్రచారంలోనూ తెలంగాణ వైద్యులు తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించారు. పోలీసు కాల్పుల్లో, లాఠీఛార్జీ సంఘటనల్లో గాయపడిన ఉద్యమకారులకు ఉచితంగా వైద్య సహాయం అందించడంలో వైద్యులు పోషించినపాత్ర ప్రశంసనీయ మైనది.

తెలంగాణ జెఏసిలోని సభ్య సంఘాలన్నీ అక్టోబర్, నవంబర్ మాసాలలో తమతమ సంస్థాగతమైన కార్యక్రమాలపై దృష్టిని కేంద్రీకరించాయి. ఉద్యోగ సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు, తెలంగాణ విద్యావంతుల వేదిక, తెలంగాణ లెక్చరర్స్ ఫోరం లాంటి ఇంకా అనేక సంఘాలు ప్రత్యేకంగా తమ సంస్థల తరఫున కార్యక్రమాలను విస్తృతంగా నిర్వహించాయి. ముఖ్యంగా కొత్తగా రంగం మీదికి దూకిన తెలంగాణ విద్యుత్ ఉద్యోగుల జెఏసి అతి తక్కువ సమయంలోనే అత్యంత సంఘటిత శక్తిగా ఉద్యమ తెరమీదికి వచ్చింది. తెలంగాణ జెఏసి కార్యక్రమాలలో చురుకైన పాత్రను నిర్వహిస్తూనే సంస్థాగతంగా కూడా బలం పుంజుకునేందుకు శాయ శక్తులా కృషి చేసింది. అక్టోబర్ 29వ తేదీనాడు సుమారు 20వేల మంది విద్యుత్ ఉద్యోగులతో హైదరాబాద్ ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో నిర్వహించిన బహిరంగసభతో విద్యుత్ ఉద్యోగుల జెఏసి తమ విశ్వరూపాన్ని ప్రదర్శించింది. తెలంగాణలోని వివిధ రంగాల ఉద్యోగ వర్గాలకు ఈ సమావేశం కొత్త ఊపుని అందించింది. ఆర్.టి.సి. జెఏసి, సింగరేణి జెఏసిలకు ఇది ప్రేరణగా నిలిచింది. అయితే అంతకు ముందు సంవత్సరం తెలంగాణ ఉద్యోగ ఉపాధ్యాయ కార్మిక సంఘాల జెఏసి 21 అక్టోబర్ 2009లో సిద్ధిపేటలో నిర్వహించిన 'ఉద్యోగ గర్జన' మొత్తం తెలంగాణ ఉద్యమానికే తలమానికంగా నిలిచింది. తెలంగాణ వర్తమాన ఉద్యమానికి 'ఉద్యోగ గర్జన' సభతోనే అంకురార్పణ జరిగిందనడంలో ఎలాంటి అతిశయోక్తిలేదు.

తెలంగాణ ఉద్యోగులు అనుభవిస్తున్న అణచివేత, అన్ని రంగాల్లోనూ సీమాంధ్ర ఉద్యోగుల, అధికారుల ఆధిపత్యంపై ఆలోచన ప్రారంభమయ్యింది. తెలంగాణ ఉద్యోగులు తమలోఉన్న బేధాభి ప్రాయలను పక్కకుపెట్టి ఉద్యమంలో సంఘటితం కావడం మొదలయ్యింది. అన్ని శాఖల ఉద్యోగులు జెఏసిలుగా ఏకమయ్యారు. తమ స్వంత గడ్డమీద పరాయిలుగా ఎందుకు మారిపోయారో, అందుకు గల కారణాలు, నేపథ్యాన్ని అర్థంచేసుకున్నారు. సీమాంధ్ర ఆధిపత్య భావజాలానికి వ్యతిరేకంగా పోరాడేందుకు సిద్ధపడ్డారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పాటువల్లనే తమ సమస్యల పరిష్కారానికి మార్గం సుగమమవుతుందని భావించారు. ఉద్యోగ నియామకాలలో చోటు చేసుకున్న రాజ్యాంగ ఉల్లంఘనలు, నిధుల కేటాయింపుల్లో పక్షపాతం, ప్రాంతీయ దురభిమానం మూలాలకు సంబంధించిన కారణాలను విశ్లేషించుకున్నారు. తరువాత జరిగిన ఉద్యమంలో ప్రజలతో మమేకమయ్యారు. తెలంగాణ జెఏసి ఇచ్చిన పిలుపు మేరకు ఉద్యోగులు చేపట్టిన 'సహాయ నిరాకరణ' ఉద్యమం చారిత్రాత్మకంగా నిలిచిపోయింది. రాష్ట్ర ప్రభుత్వం దిమ్మదిరిగిపోయింది. సహాయ నిరాకరణ ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేసేందుకు శతవిధాలా ప్రయత్నించి విఫలమయ్యింది. ఉద్యోగుల సంఘటిత శక్తిముందు మోకరిల్లింది. 'సహాయ నిరాకరణ' ఉద్యమానికి అనుబంధంగా జెఏసి చేపట్టిన 48గంటల బంద్ సంపూర్ణంగా విజయవంతమయ్యింది.

ఈబంద్ సందర్భంగా ఆర్.టి.సి. కార్మికులు స్వచ్ఛందంగా పాల్గొని తమ సత్తాను ప్రదర్శించారు. సింగరేణి గని కార్మికులు రెండురోజులు సమ్మెలో పాల్గొని బొగ్గు ఉత్పత్తిని స్తంభింపజేసారు. ఉపాధ్యాయులు విధులను బహిష్కరించారు. ప్రైవేటు సంస్థలు, బ్యాంకులు స్తంభించి పోయాయి. మొత్తంగా తెలంగాణ వ్యాపితంగా జనజీవనం స్తంభించింది. ఇదే సమయంలో 'పలెపల్లె పట్టాలమీదికి' నినాదంతో తెలంగాణ జెఏసి నిర్వహించిన 'సంపూర్ణ రైల్‌రోకో' దేశవ్యాపితంగా ప్రభావం చూపింది. ఉత్తర, దక్షిణ భారతంలమధ్యన రెండు రోజుల పాటు రైల్వే లింకు పూర్తిగా తెగిపోయింది. ఉద్యమం ఉన్నత స్థాయికి చేరుకున్నది. మరోవైపున రాష్ట్ర అసెంబ్లీలో తెలంగాణ ప్రాంత ఎం.ఎల్.ఏ.లు గైరాజరు కావడంతో అది ఆంధ్రా అసెంబ్లీగా మారిపోయింది. ఎప్పటిలాగానే తెలంగాణనుండి ప్రాతినిధ్యం వహిస్తున్న మంత్రులు ద్రోహపూరితంగా ప్రభుత్వానికి సహకరించి ప్రజలు ప్రదర్శిస్తున్న ఉద్యమ స్ఫూర్తికి తూట్లు పొడిచే ప్రయత్నం చేశారు. లోక్‌సభలో తెలంగాణ అంశం రెండురోజులపాటు చర్చనీయాంశమయ్యింది. తెలంగాణ నుండి ప్రాతినిధ్యం వహిస్తున్న కాంగ్రెస్ ఎం.పి.లు క్రియాశీలకంగా తమవంతు ఆందోళనను నిర్వహించారు. బిజెపి నాయకురాలు సుష్మాస్వరాజ్ తెలంగాణ ఉద్యమానికి మద్దతుగా, 'సహాయ నిరాకరణ' ప్రభావాన్ని ఉటంకిస్తూ తీవ్రస్వరంతో కేంద్రాన్ని నిందించారు. తెలంగాణపై ప్రకటన చేయాలని డిమాండు చేశారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై తీవ్రమైన ప్రభావం చూపిన 'సహాయ నిరాకరణ' ఉద్యమం మార్చి 10న తలపెట్టిన 'మిలియన్ మార్చ్' వరకు కొనసాగాలని అన్ని వర్గాల ప్రజలు ఆశించారు. కానీ అనుకోని రీతిలో, తీవ్రమైన ఒత్తిళ్ల నడుమ 'సహాయ నిరాకరణ' విరమణ జరిగిపోయింది. ఈ హఠాత్పరిణామం అందరినీ నిరాశ పరిచింది. ఈ పరిణామాల నేపథ్యంలో 'మిలియన్ మార్చ్' కార్యక్రమాన్ని రద్దు చేసుకోవాలని జెఏసి నాయకత్వంపై ఒత్తిడి పెరిగింది. అయితే టిఆర్ఎస్ మినహా జెఏసి భాగస్వామ్య పక్షాలు, ప్రజాఫ్రంట్, తెలంగాణ యునైటెడ్ ఫ్రంట్,తెలంగాణ జర్నలిస్టుల ఫోరం, తదితర ఉద్యమ సంస్థలు, ప్రజాసంఘాలు 'మిలియన్ మార్చ్' కు తమ సంపూర్ణ మద్దతును ప్రకటించడం, ప్రజలనుండి వ్యక్తమైన పట్టుదల, ఉద్యమ అనివార్యతల ఫలితంగా 'మిలియన్ మార్చ్' నిర్వహించేందుకు అవసరమైన కార్యాచరణను జెఏసి సిద్ధం చేసుకున్నది. వ్యూహాత్మకమైన ఎత్తుగడలను అమలు జరిపింది. 'మిలియన్ మార్చ్' విషయంలో జెఏసి పట్టుసడలకుండా నిలబడడంతో అన్నివర్గాల ప్రజల్లోనూ 'మిలియన్ మార్చ్'లో పాల్గొనాలనే పట్టుదల పెరిగింది. ఉద్యమ ప్రజలు నడిచిన దారిలోనే తెలంగాణ రాజకీయ నాయకత్వం సైతం నడవాల్సిన అనివార్యత ఏర్పడింది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర సాధన ఉద్యమంలో 'మిలియన్ మార్చ్' మరొక మైలురాయిలా నిలిచింది. తెలంగాణ రాజకీయ నాయకత్వ వరుస వైఫల్యాలే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటులో ప్రధాన అడ్డంకులనే వాస్తవాన్ని 'మిలియన్ మార్చ్' బహిర్గతం చేసింది.

పెద్దలు డాక్టర్ కె. జయశంకర్ పదేపదే ప్రస్తావించినట్లుగా తెలంగాణ వర్తమాన ఉద్యమంలో ఇమిడిఉన్న మూడు దశల్లో... భావవ్యాప్తి నిరంతరం విరామం లేకుండా వివిధ రూపాల్లో కొనసాగుతూనే ఉన్నది. గడచిన సంవత్సరన్నర కాలంగా ఉద్యమం నిర్విరామంగా జరుగుతున్నది. ఈ రెండు దశల ఉద్యమానికి రాజకీయ ప్రక్రియ అనుసంధానం కావాల్సిఉన్నది. కానీ తెలంగాణ రాజకీయ నాయకత్వం సీమాంధ్ర రాజకీయ ఆధిపత్యంనుండి బయటపడేందుకు సిద్ధం కావడంలేదు. తెలంగాణ రాజకీయ నాయకత్వం ప్రదర్శిస్తున్న పిరికితనమే తెలంగాణ సాధనలో ప్రధాన అవరోధంగా పనిచేస్తున్నది. తెలంగాణ ప్రజాఉద్యమం ఉవ్వెత్తున లేచిన ప్రతి సందర్భంలోనూ తెలంగాణ రాజకీయనాయకత్వం దాగుడుమూతలు ఆడుతున్నది. ప్రజలను మోసం చేయడానికే సిద్ధపడుతున్నది. పార్టీ అధి నాయకత్వానికి బానిసలుగా పడిఉండేందుకే

*దేశ స్వాతంత్ర్యానికన్నా ముందే ఆనాటి కమ్యూనిస్టు పార్టీ రూపొందించిన చారిత్రక పత్రం తెలుగు నేలకే కాకుండా దేశం మొత్తానికి అన్వయించుకునేలా ఉందని అంటున్నారు* **ఆర్.జె. రాంపల్లి**

# ‘విశాలాంధ్రలో ప్రజారాజ్యం’లో ఏముంది?

తెలుగుజాతి తన భవిష్యత్తు గురించి తీవ్రంగా చర్చించుకుంటున్న నేపథ్యంలో వక్రీకరణలకు గురైన ఒక చారిత్రక పత్రంలోని వాస్తవాలను అర్థం చేసుకునేందుకు చేస్తున్న ప్రయత్నమిది.

పుచ్చలపల్లి సుందరయ్య పేరుతో ఆనాటి కమ్యూనిస్టు పార్టీ బ్రిటిష్ ఇండియాలో 1946లో జరిగిన ఎన్నికల సందర్భంగా తెలుగు జాతి భవిష్యత్తును కమ్యూనిస్టు పార్టీ ఎలా తీర్చిదిద్దదలుచుకున్నదో తెలియపరిచే వివరమైన లక్ష్య ప్రకటనే విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే పత్రం. ఇది 1946 జనవరిలో వెలువడింది. ఆనాటికి తెలంగాణ నిజాం రాజ్యంలో భాగం కనుక అక్కడ ఎన్నికలనే ప్రస్తావన అప్పటికి రాలేదు. కానీ నిజాం రాజ్యంలోని ఆంధ్రులైన తెలంగాణీయులను కలుపుకునే తెలుగు జాతీయ రాజ్యం గురించి పదే పదే ఈ పత్రం ప్రస్తావన చేసింది. ‘తెలంగాణలో ఆంధ్ర మహాసభ’ అనే ఉపశీర్షిక కింద అక్కడి ప్రత్యేక పరిస్థితులను ఉద్యమ స్థితిగతులను వివరించింది.

ఈ పత్రం కేవలం తెలుగు జాతికి మాత్రమే అన్వయించుకోదగినదిగా భావించనక్కరలేదు. మొత్తం విశాల భారతావనికి కూడా అన్వయించుకోదగినట్లుగా ఈ పత్రం ఉంది. ‘ప్రజారాజ్యాల సమాఖ్యగా విశాల భారతం’గా కూడా దీనిని మెరుగుపరుచుకుని అన్వయించుకోదగిన విధంగా ఇది రూపొందించారు. అప్పటికింకా భారతదేశానికి ‘స్వాతంత్ర్యం’ రాలేదు. (1948లో ఇవ్వాలనేది బ్రిటిష్ పాలకుల తొలి నిర్ణయం – దాన్ని త్వరితం గావించిన వాటిలో తెలంగాణ తదితర పోరాటాలు కూడా కారణం.) పాకిస్తాన్ విభజనకు బ్రిటిష్ వలస పాలకులూ, కాంగ్రెస్, ముస్లిం లీగు పార్టీలు ఒక నిర్ణయానికి వచ్చాయి. దేశ విభజనతో పని లేకుండా వివిధ జాతుల స్వయం నిర్ణయాధికార హక్కులు గల ‘జాతీయ రిపబ్లిక్‌ల సమాఖ్య’గా స్వతంత్ర విశాల భారతదేశం నిర్మించుకోవడమే ఉత్తమ ప్రజాస్వామిక పునర్నిర్మాణమని ‘విశాలాంధ్రలో ప్రజారాజ్యం’ పేర్కొంది. ఆనాటి భారత కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి పి.సి. జోషీ అభిప్రాయం పూర్తిగా ఇది కాకపోవచ్చు. నాటి కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ అభిప్రాయంలోని ‘జాతుల స్వయం నిర్ణయాధికార హక్కు’ అనే అంశాన్ని నేడు పాకిస్తాన్‌లోని పంజాబీలు, సింధీలు, పఠాన్లు తదితరులకు కూడా అన్వయించుకోదగిన విధంగా, దేశ విభజనకు ప్రత్యామ్నాయంగా ‘స్వయం నిర్ణయాధికార జాతుల సమాఖ్యగా విశాల భారతదేశం’ అనే దృక్పథాన్ని ఈ పత్రం అందించింది.

జాతుల స్వయం నిర్ణయాధికారంలో కీలకమైన అంశంగా ఏ భాషా జాతికా భాషాజాతి తనదైన రాజ్యాంగ నిర్ణాయక పరిషత్తుని వయోజన ఓటింగ్ ద్వారా ఎన్నుకుని, తమ జాతి అవసరాలకనువుగా రాజ్యాంగ రచన గావించుకుని, దాని ప్రాతిపదికన స్వయం పోషకంగా తమ కాళ్లపై తాము నిలుస్తూ ‘స్వతంత్ర భారత రిపబ్లిక్‌ల సమాఖ్య’లో కలిసి మెలిసి ఉండాలనేది ఈ పత్ర రచయిత పుచ్చలపల్లి (ఆంధ్ర కమ్యూనిస్టుల) అభిప్రాయం. కేంద్ర ప్రభుత్వానికి దేశ రక్షణ, విదేశీ వ్యవహారాలు, కమ్యూనికేషన్స్, కరెన్సీ లాంటి అంశాలలో మాత్రమే అధికారాలుండాలనేది ఈ పత్రం అవగాహన.

ఇటీవలి కాలంలో అనేక రకాల వికృత వక్రీకరణలకూ, అపార్థాలూ–అపోహలకూ అదే సమయంలో విస్మరణకు కూడా గురైన ఒక ముఖ్యమైన చారిత్రక పత్రమిది. నేటి ఆంధ్రప్రదేశ్ సరిహద్దులనానుకుని వెలుపలనున్న తెలుగు వారందరితో (బస్తరు – బళ్లారి –

---

ప్రయత్నిస్తున్నది. మానుకోట ప్రతిఘటన ఇచ్చిన ఆత్మగౌరవాన్ని తెలంగాణ రాజకీయ నాయకత్వం అందిపుచ్చుకోవడంలేదు. మిలియన్ మార్చ్ ఇచ్చిన ధైర్య, సాహసాలను పుణికిపుచ్చుకోవడంలేదు. మొత్తంగా తెలంగాణ రాజకీయ నాయకత్వం ఉద్యమిస్తున్న ప్రజలకంటే ఎంతో వెనుకబడి ఉన్నారు. తెలంగాణ ఉద్యమంలో అన్నివర్గాల ప్రజలు తరతమ బేధాలను మరచి, కులమతాలకు అతీతంగా ... తమ ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకుంటూనే, స్వంతరాష్ట్రాన్ని సాధించుకోవడంకోసం ఉద్యమిస్తున్నారు. కానీ తెలంగాణ రాజకీయ నాయకత్వమే సంఘటితం కావడంలేదు. ముఖ్యంగా కాంగ్రెస్, తెలుగుదేశంపార్టీలకు చెందిన తెలంగాణ ప్రాంత నాయకులు అనుసరిస్తున్న స్వార్థపూరిత వైఖరి కారణంగానే తెలంగాణ ప్రజల ఆకాంక్ష నెరవేరడంలేదు. తెలంగాణ రాజకీయ నాయకులు వేసుకుంటున్న ముసుగులన్నీ ఒక్కొక్కటిగా తొలగిపోయాయి. పార్టీలమీదా, ఆ పార్టీల ప్రతినిధుల మీదా ప్రజలకు ఇప్పుడు పూర్తి స్పష్టత వచ్చింది. ఉద్యమ మిత్రులు ఎవ్వరో, అంతర్గత శత్రువులు ఎవ్వరో తేలిపోయింది. ఇది తెలంగాణ ఉద్యమం సాధించిన చారిత్రక విజయం.

అందువల్ల ... మానుకోట ప్రతిఘటన నిలబెట్టిన ఆత్మగౌరవాన్ని కొనసాగించుకుంటూ, ‘మిలియన్ మార్చ్’ అందించిన దిశానిర్దేశంతో ... తెలంగాణ రాజకీయ నాయకత్వాన్ని ఉద్యమదారిలోకి తీసుకు రావడమో లేక అడ్డు తొలగించుకుని ఉద్యమ ప్రజల నాయకత్వంలో లక్ష్యసాధనవైపు ముందుకు సాగడమో నిర్ణయించుకోవడమే తక్షణ ఉద్యమ కర్తవ్యం.

*(రచయిత సీనియర్ జర్నలిస్టు, ‘చర్చ’ వారపత్రిక సంపాదకులు)* వీ

బరంపురం – తమిళనాడుల్లో వారిని) కలుపుకొని విశాల తెలుగు జాతీయ రాజ్యం నిర్మించుకుందామని ఈ పత్రం పిలుపునిచ్చింది. ఆనాటికి ఉన్న ఆర్థిక – సాంఘిక – సాంస్కృతిక అసమానత్వాలను రూపు మాపి, ఒక ప్రజాస్వామిక జీవన విధానానికి అనుగుణమైన నూతన సామాజిక వ్యవస్థ నిర్మాణానికి తెలుగు జాతిని సంసిద్ధులను గావిస్తూ అశేష తెలుగు ప్రజానీకం ముందు నిలిపిన ఒక స్పష్టమైన ఆచరణాత్మక ప్రణాళిక ఇది. తెలుగు జాతికిచ్చిన పిలుపది.

ఈ వ్యాసం ముఖ్యోద్దేశం – విశాలాంధ్రలో ప్రజారాజ్యం అనే పత్రంలో నిజంగా ఏముందో తెలుసుకుని అందులోని కీలక వాస్తవాల ప్రాతిపదికమైన దాన్ని అర్థం చేసుకునేట్టు చేయడమే. ఇందు నుండి మిగుల్చుకోవలసినదీ, వదుల్చుకోవలసినదీ – వారి వారి ఇష్టాయిష్టాలు, అవగాహనలూ, దృక్పథాలపై ఎటూ ఆధారపడి ఉంటుంది గదా!

## ముందుగా ఆ పత్రంలోని కొన్ని శీర్షికలు చూద్దాం!

'జన్మభూమి ఛిన్నాభిన్నమైనది'; 'జమీందారీ దోపిడీ'; 'మన వ్యవసాయం పాడు పడింది'; 'మన పరిశ్రమలు అభివృద్ధి కాలేదు'; మన విజ్ఞానం కుంటుపడింది'; 'పౌరసత్వ హక్కులు'; 'మన గ్రామ సీమలు'; 'జమీందారీలను రద్దు చేయాలి'; 'సాగు చేసుకోక పొలాలను కౌలుకిచ్చే భూస్వామిక విధానాన్ని రద్దుపరచాలి'; 'సాగు చేసేవాడికే పొలం'; 'పొలాల్లో సాగు చేయడానికి నీటి వసతులు కావాలి'; 'రైతుల పొలాలు అన్యాక్రాంతం కాకూడదు'; 'రైతుకు గిట్టుబాటయ్యే ధర ఇవ్వాలి'; 'ప్రజలకు చౌకగా ఆహారాన్ని అందించాలి'; 'వ్యవసాయ కూలీలు'; 'సైన్యం నుండి తిరిగి వచ్చే సైనికులు'; 'చేపల పరిశ్రమ – అగ్నికుల క్షత్రియులు'; 'తాటి బెల్లపు పరిశ్రమ – శెట్టి బలిజ – గౌడ కులస్తులు'; 'ఆదిమ నివాసులు'; 'మన పరిశ్రమలు – పట్టణ ప్రజలు'; 'ఆంధ్రలో పరిశ్రమలు మరింత వెనుకబడి ఉన్నాయి'; 'ఇంగ్లిష్ కంపెనీల విపరీత లాభాలు'; 'కార్మికుల కష్టాలు'; 'ఆంధ్రలో పరిశ్రమాభివృద్ధికి మార్గం'; 'అభివృద్ధి చేయడానికి వీలున్న పరిశ్రమలు'; 'రైలు మార్గాలు'; 'రేవు పట్టణాలు'; 'చేనేత పరిశ్రమ'; 'ఇత్తడి కంచు వగైరా చేతి పనులు'; 'చిన్న దుకాణదారులు – వర్తక గుమాస్తాలు'; 'పట్టణ మధ్య తరగతి ప్రజలు'; 'ముస్లిం ప్రజలు'.. ఇంతే కాక 'ఆంధ్ర ప్రజల నూతన ప్రజాస్వామిక రాజ్యం'; 'నూతన ప్రజాస్వామిక రాజ్యసూత్రాలు'; 'మన కోర్టులు'; 'మనకున్న విద్యా సౌకర్యాలు'; 'మన ప్రజలకు కావలసిన సదుపాయాలు'; 'మన పట్టణాలు ఎలా ఉన్నాయి?'; 'స్త్రీల కోర్కెలు – హక్కులు'; 'నూతన ఆంధ్రను ఎవరు నిర్మిస్తారు?'

తొలి 69 పేజీల ఈ పత్రంలోని శీర్షికలివి (తృతీయ ముద్రణ – 1996 డిసెంబర్ – ప్రజాశక్తి బుక్‌హౌస్). మరొక 16 పేజీలలో ఉద్యమ, రాజకీయ వైఖరులకు సంబంధించిన వాటిలో 'ఐక్య ఆంధ్ర ప్రజా ఉద్యమం'; 'స్వదేశీ కాంగ్రెస్ ఉద్యమాలు'; 'ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది'; 'తెలంగాణలో ఆంధ్ర మహాసభ' తదితర శీర్షికలు ఉన్నాయి.

ఈనాటికీ మనం 'ప్రజల భాషలో విద్య పరిపాలన' కోసం వివాదాలకు, ఆందోళనలకు గురవుతున్నాం కనుక మొదటగా పై విషయంపై ఈ పత్రంలో పేర్కొన్న ఆసక్తికర అంశాలు తెలుసుకుందాం.

'కోస్తా, రాయలసీమ జిల్లాల బడులలో ఇంగ్లిష్ నిర్బంధం చేయబడింది. ఇంగ్లిష్‌లోనే అందరికీ అన్ని విషయాలు నేర్పుతూ వచ్చారు. ఇప్పటికీ కాలేజీలలో పరాయిభాష ఇంగ్లిష్‌లోనే చదువు చెప్తుతున్నారు. నైజాం సంస్థానంలో ప్రాథమిక తరగతులలో తప్ప మిగిలిన అన్ని తరగతులలోనూ ఉర్దూలోనే పాఠాలు బోధిస్తారు. ఉర్దూని నిర్బంధ భాషగా చేశారు. (పే10). 'నూతన ప్రజాస్వామ్య రాజ్య సూత్రాలు'లో 3వ అంశం 'విద్యను మాతృభాషల ద్వారా ప్రతి ఒక్కరికి నేర్పుతుంది' (పేజీ 58); 'మన విద్యా విధానమంతా నేడు స్వతంత్ర జీవనం చేయడానికి తగిన శిక్షణ నివ్వడం లేదు'; 'మన విద్యా విధానమంతా తిరిగి కొత్త పద్ధతులపైన పునర్నిర్మాణం చెయ్యాలి... మన ప్రజలందరికీ అక్షరజ్ఞానం కలిగించాలి. మన ప్రజలు వ్యవసాయక, పారిశ్రామిక జీవితాన్ని వివిధ శాఖోపశాఖలతో నిర్మించడానికి తగిన విజ్ఞానాన్ని, శిక్షణను, టెక్నికల్ జ్ఞానాన్ని మన విద్యా విధానం ఇచ్చేటట్లు ఏర్పాటు చేయాలి. మన విద్యనంతా మన మాతృభాష తెలుగులోనే చెప్పాలి. (పే 64) 'ముస్లింలకు ఉర్దూ భాషలో చదువు చెప్పబడుతుంది (55).

గత చరిత్రలో విద్యా విధానమంతా దాదాపు పాలకుల భాషలోనే ఉంది. నేటికీ విద్యా విధానంపై ఇంగ్లిష్ భాషాధిపత్యాన్ని 'స్వతంత్ర' పాలకులు కూడా కొనసాగిస్తున్నారు. రోజురోజుకీ విద్య – పరిపాలనలకు తెలుగు భాష పనికిరానిదయిపోతుండడం వెనుక ప్రజల ప్రయోజనాలు లేవని చెప్పడానికి, ప్రపంచీకరణ మార్కెట్టు శక్తుల ఇంగ్లిష్ పట్టు బిగుస్తోందని చెప్పడానికి ఇంతకంటే వేరే రుజువులవసరం లేదు.

31-34 పేజీలలో 'వ్యవసాయ కూలీలు' అనే శీర్షిక కింద దళితుల జీవన స్థితిగతులను పేర్కొన్నారు. 'ఆదిమాంధ్రులు గ్రామాలకు బయట పల్లెలలో నివసిస్తున్నారు. వారి ఇండ్లు మురుగు కూపాలతో, చాలా అపరిశుభ్ర స్థలాలలో కిక్కిరిసి ఉంటున్నాయి. సాంఘికంగా వారిని అంటుకోరాదని ఇతర కులస్తులు దూరంగా పెట్టారు. వీరిని గ్రామస్తులందరూ ఉపయోగించే చెరువుల నుండి, నూతుల నుండి నీళ్లు తెచ్చుకోనివ్వరు. కొన్ని గ్రామాలలో వారిని వీథుల గూండా కూడా పోనివ్వరు. గ్రామంలో పాఠశాలకు ఇతర కులస్తులు వస్తే వీరిని రానివ్వరు.'

'గత 25 సంవత్సరాల జాతీయోద్యమం, ఆంధ్రలో గత పదిహేను సంవత్సరాల వ్యవసాయ కూలీ ఉద్యమం... వీటి ప్రభావం చేత నేడు వారు సమాన ఆర్థిక, రాజకీయ, సామాజిక అధికారాలను కోరుతున్నారు. వారిలో చదువుకున్న యువకులు, ఉపాధ్యాయులు తమకొక సంఘం కావాలంటూ షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్ నిర్మించు కుంటున్నారు. షెడ్యూల్డ్ కాస్ట్ ఫెడరేషన్‌లో ఆదిమాంధ్రులందరికీ ఏ రాజకీయ పార్టీకి చెందినా అంబేద్కర్ అనుయాయులు గానీ, కాంగ్రెస్‌కు చెందిన వారు గానీ, కమ్యూనిస్టు పార్టీని బలపరిచే వారుగానీ అందరికీ స్థానముండాలని కమ్యూనిస్టులం పనిచేస్తున్నాం.'

ఇక స్త్రీల విషయానికి వస్తే.. (పేజీ 67) 'చదువులలోనూ, పనులు ఉద్యోగాలలోనూ, ఆస్తి హక్కులలోనూ, సాంఘిక హక్కులలోనూ, విజ్ఞానావకాశాలలోనూ పురుషునితో పాటు స్త్రీలకు సమానాధికారాలు, సమానావకాశాలు ఉండాలి.'

'హిందూ 'లా'ను సవరిస్తూ స్త్రీలకు పురుషులతోపాటు సమాన ఆస్తిహక్కులు కలిగిస్తూ సమగ్ర శాసనం వెంటనే చెయ్యాలి'; 'ఒకే పనికి పురుషునితో పాటు స్త్రీకి సమాన జీతాలు ఇవ్వాలి'; 'విడాకులు ఇచ్చుకోవడానికి హక్కులు కలుగజేయాలి. తల్లికి బిడ్డలను తనవద్ద ఉంచుకునే హక్కు భరణం ఏర్పాటు ఉండాలి.'

దున్నేవానికే భూమి – అమలు చేసే విధానాన్ని ఇలా చెప్పింది 'జమీందారీ, ఈనాందారీ, ముఠాదారీ పద్ధతిని రద్దుచేసి వారి పొలాలను నేడు సాగుచేస్తున్న రైతు కూలీలకు చెందేటట్లు చేస్తుంది.' కౌలుదారీ

పద్ధతి లేకుండా చేసి ప్రతి రైతు తన పొలాన్ని సాగు చేసుకునేటట్లు చేస్తుంది. ప్రభుత్వానికి తప్ప ఇతరులెవరికీ పొలాన్ని అమ్ముకోవడానికి వీలు లేకుండా చేసి సాగు చేసే రైతుల నుండి పొలం అన్యాక్రాంతం గాకుండా గ్యారంటీ చేస్తుంది. ఐదేళ్ల లోపు రైతుకు భూమిపై పన్ను లేకుండా చేస్తుంది. ప్రైవేటు వడ్డీ వ్యాపారాన్ని రద్దుచేసి సహకార సంఘాల ద్వారా పావలా వడ్డీకి రుణాలు ఇస్తుంది.'

(పేజీ 13 నుండి 40 దాకా రైతు – కూలీల జీవన పునర్నిర్మాణాంశాలతో 3వ అధ్యాయం 4వ అధ్యాయంలో ఉంటుంది.) నూతన ఆంధ్ర రాజ్యపు ప్రజాస్వామిక సూత్రాలు ఉంటాయి. వాటి ప్రకారం 'గ్రామ మునసబు, కరణం, ఇప్పటివలె వంశపారంపర్యంగా నియమించబడరు. గ్రామపంచాయతీ యాజమాన్యాన ప్రజలచే కొన్ని సంవత్సరముల వరకు ఎన్నుకోబడిన ఉద్యోగస్తులుగా ఉంటారు.' 'పోలీసులపై అధికారం గ్రామానికి సంబంధించినంతవరకు గ్రామ పంచాయితీ బోర్డులకే ఉంటుంది.' 'ప్రతి గ్రామంలోనూ, పట్టణ వార్డులలోనూ అచ్చటనున్న వయోజన ఓటర్లు అందరూ రహస్య బ్యాలెట్ ద్వారా ఎన్నుకుని పంచాయితీ కోర్టులు ఏర్పాటు చేయాలి. వానికి సివిల్, క్రిమినల్ కేసులు విచారించడానికి హక్కు ఉంటుంది.'

జాతీయ రిపబ్లిక్ ఏర్పాటు గురించి ఈ పత్రం పేర్కొన్నది చాలా కీలకమైన విషయం, చర్చనీయాంశంలోకి రానీయకుండా చేస్తున్నదిదే.

'విశాలాంధ్ర రాజ్యాంగాన్ని తెలుగు దేశమందలి వయోజనులందరూ ఎన్నుకున్న ప్రజాపరిషత్తే నిర్ణయించాలి. తెలుగు ప్రజలు భారత ప్రజల ఐక్య కూటమిలో కలిసి ఉండడానికి, తమ రాజ్యాంగ పరిషత్తులో నిర్ణయం తీసుకోవాలని కోరుతుంది. భారత ఖండంలోని వివిధ జాతులు స్వేచ్ఛగా తమ తమ స్వతంత్ర రాజ్యాంగ పరిషత్తుల ద్వారా నిర్ణయించుకుని స్వతంత్ర భారత సమాఖ్యను (రాజ్యాన్ని) ఏర్పరచాలని కమ్యూనిస్టు పార్టీ కోరుతుంది. కమ్యూనిస్టు పార్టీ స్వతంత్ర భారత దేశంలో ఐక్య విశాలాంధ్ర కావాలంటుంది.'

అంతేకాదు 'ఐదింట రెండు పాళ్ల తెలుగు భూమి, మూడవ వంతు తెలుగు ప్రజలు నైజాం నిరంకుశ బానిసత్వం కింద ఉన్నంతకాలం, ఇంగ్లిష్ సైనిక సన్నీలతో నైజాం నిరంకుశ పాలన సాగుతున్నంత కాలం మనకు స్వాతంత్ర్యం లేదు. ఇంగ్లిష్ సామ్రాజ్య వాదుల పరిపాలనను, దాని తాబేదారులయిన స్వదేశీ సంస్థానాధీశుల పరిపాలనను తొలగించిన నాడే మన తెలుగు ప్రజలకు స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం లభిస్తాయి.. భారతదేశమందలి వివిధ జాతులకు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించడానికి కాంగ్రెస్ – లీగు – కమ్యూనిస్టు పార్టీలు కలిసి ఐక్య స్వాతంత్ర్య పోరాటం సాగించాలి...'

విశాలాంధ్ర భౌతిక హద్దుల పరిమాణాన్నే కాక, రాజకీయ స్వభావపు గుణాన్ని కూడా ఈ పత్రం ప్రకటించింది.

'ఇంగ్లిష్ ప్రభుత్వం కింద ఉన్న తెలుగు జిల్లాలే కావు తెలుగు గడ్డ అంతా ఒకటి కావాలి. మద్రాసు, మైసూరు, నైజాం, మధ్య పరగణా, బస్తరు, ఒరిస్సాలలో ముక్కలు ముక్కలుగా ఉన్న తెలుగు గడ్డ అంతా ఒకటి కావాలి. ప్రత్యేక రాష్ట్రం సరిపోదు. తెలుగుజాతి స్వతంత్ర భారతఖండ సమాఖ్యలో, స్వతంత్ర తెలుగు రాజ్యంగా ఉండాలి.' (పేజీ 12)

ఆనాటి చారిత్రక వాస్తవ స్థితిని 'తెలంగాణలో ఆంధ్ర మహాసభ' శీర్షిక కింద ఈ పత్రం ఇలా పేర్కొంది.

'కాంగ్రెస్ ఉద్యమమే సంస్థానాలలోని పీడిత ప్రజలలో గూడ చైతన్యం కలిగించింది. తమ పౌరసత్వ హక్కుల కోసం సంస్థాన ప్రజలు పోరాటాలను ఆరంభించడం కాంగ్రెస్ ప్రభావ ఫలితమే. హైదరాబాద్ సంస్థానంలో 1923లో మాడపాటి హనుమంతరావు తదితర విద్యావంతులు ఆంధ్రమహాసభను ఏర్పాటు చేశారు. 1930 ఉప్పు సత్యాగ్రహంలో నిజాం రాష్ట్రం నుండి చాలా మంది యువకులు వచ్చి పాల్గొన్నారు. 1938లో నిజాం రాష్ట్ర కాంగ్రెస్‌ను ఏర్పరచి దానిని నిషేధిస్తే సత్యాగ్రహాన్ని నడిపారు. వందలకొద్ది యువకులు నిజాం జైళ్లలో మగ్గారు. ఈ రకంగా బయలుదేరిన సంస్థాన ప్రజా ఉద్యమాన్ని కోస్తా తెలుగు జిల్లాలలోని రైతు, కార్మిక, కమ్యూనిస్టు ఉద్యమాలు పూర్తిగా మార్చివేశాయి. నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభ లంచగొండి ఉద్యోగస్తుల నిర్బంధాలను ఎదుర్కొన్నది. జాగీర్దారులు, దేశ్‌ముఖుల వెట్టిని, అక్రమ వసూళ్లను, నిర్బంధాలను అరికట్టసాగింది. వందలకొద్ది సంవత్సరాలుగా పీడింపబడుతూ వచ్చిన రైతులలో నూతన చైతన్యాన్ని, కొత్త బలాన్ని, విశ్వాసాన్ని కలిగించింది. ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు నాయకత్వం కింద నేడు లక్షకు మించిన సభ్యత్వంతో వెయ్యి మంది కార్యకర్తలతో నిజాం రాష్ట్ర ఆంధ్ర ప్రజల ఏకైక సంస్థగా ప్రజా ఉద్యమాన్ని నిర్మించి పనిచేస్తూ ఉంది.'

విశాల భారత సమాఖ్య గురించిన భావనలు కూడా ఇందులో విస్పష్టంగా పొందుపరిచారు.

'భారతదేశంలో 17 పెద్ద జాతులున్నాయి. ఇవి పఠానులు, బెలూచీలు, సింధీ, పడమటి పంజాబీ, సిక్కు జాతి, హిందూస్తానీ జాతి, రాజపుతానా, బీహారీ, బెంగాలీ, అస్సామీ, ఓఢ్ర, ఆంధ్ర, తమిళ, మళయాల, కర్ణాటక, మహారాష్ట్ర, గుజరాతీ.. జాతులు. వేర్వేరు స్వతంత్ర రాజ్యాంగ పరిషత్తులే ఈ వివిధ జాతులు. భవిష్యత్తు రాజ్యాంగాన్ని నిర్ణయించడానికి హక్కు కలిగి ఉంటాయి.'

'భారతదేశంలోని వివిధ స్వతంత్ర జాతులు తమంతట తాము స్వేచ్ఛగా భారత సమాఖ్యలో చేరడానికి నిర్ణయించుకున్నప్పుడే ఐక్య భారతదేశ రాజ్యాంగం ఏర్పడుతుంది. అంతేగాని జాతుల స్వాతంత్ర్య హక్కును, వాటి స్వయం నిర్ణయాధికార హక్కులనూ నిరాకరించడం వల్ల ఐక్య భారత దేశ రాజ్యాంగం ఏర్పడజాలదు.'

'మీరు మన భవిష్యత్తును మనం నిర్ణయించుకునే హక్కుగల స్వతంత్ర ఆంధ్ర జాతిగా, స్వేచ్ఛగా స్వతంత్ర భారత సమాఖ్యలు చేరాలని కోరుతున్నారు గదా! మరీవిధంగా తెలుగు జాతిని గురించి ఆలోచిస్తున్నప్పుడు పఠాను, సింధీ, పశ్చిమ పంజాబీ, బెంగాలీ జాతులకు కూడా ఈ హక్కు ఉందని ఎందుకు గుర్తించరు? కమ్యూనిస్టు పార్టీ ఈ 17 వివిధ జాతులు, భారత సమాఖ్యలో చేరడానికి పనిచేస్తుంది. అయితే అవి చేరేదీ లేనిదీ నిర్ణయించేది ఆ జాతి ప్రజలు కాని మనం కాదు.' (పేజీ 83)

నూతన ప్రజాస్వామిక రాజ్యసూత్రాలలో (పేజీ 57) '18 సంవత్సరాలు దాటిన ప్రతి పురుషుడు, స్త్రీ ఎన్నుకొనిన ప్రతినిధులతో తెలుగు ప్రజల రాజ్యాంగ ప్రజా పరిషత్ సమావేశం కావాలి. ఆ ప్రజా పరిషత్తే తెలుగుదేశపు రాజ్యాంగ చట్టాన్ని నిర్ణయిస్తుంది.'

'ఈ ప్రజా పరిషత్తు మొదట ఇంగ్లిష్ ప్రభుత్వం కింద ఉన్న తెలుగు జిల్లాల ప్రజా ప్రతినిధులతో పని ఆరంభిస్తుంది. తెలంగాణలోని మన సోదర దేశీయులు, నైజాం నిరంకుశ ప్రభుత్వాల నుండి బయట పడినపుడు మనతో కలుస్తారు. స్వతంత్ర భారతదేశంలో ఐక్య విశాలాంధ్రను తెలంగాణ ప్రతినిధులు, కోస్తా, రాయలసీమ ప్రజలు

# ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు

పౌర హక్కుల నేత, న్యాయవాది ప్రత్తిపాటి వెంకటేశ్వర్లు జూన్ 11న హైదరాబాద్‌లో మరణించారు. ఊపిరి తిత్తులకు ఇన్ఫెక్షన్ కారణంగా అనారోగ్యానికి గురై నిమ్స్‌లో చేరి చికిత్స పొందుతూ అక్కడే మరణించారు. ఆయన 1934, జూలై 1న ప్రకాశం జిల్లా టంగుటూరులో జన్మించారు. చాలా కాలం న్యాయవాదిగా హైకోర్టులో ప్రాక్టీసు చేసారు. అనేక ప్రజా ఉద్యమాల్లో పాల్గొన్నారు. మొట్టమొదట పౌరహక్కుల సంఘాన్ని ఏర్పాటు చేసిన వారిలో వెంకటేశ్వర్లు ఒకరు. 1973లో ఏర్పడిన పౌరహక్కుల సంఘానికి తొలి అధ్యక్షులు శ్రీశ్రీ కాగా పత్తిపాటి వెంకటేశ్వర్లు తొలి కార్యదర్శిగా పనిచేశారు. 1974లో భూమయ్య – కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలను రద్దు చేయాలనే డిమాండ్‌తో జరిగిన పోరాటంలో క్రియాశీలంగా పనిచేశారు. ఈ డిమాండ్‌తో ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేసి అంతర్జాతీయ స్థాయిలో సంఘీభావాన్ని కూడగట్టారు. 1971లో 'మార్చ్', 'ఝంఝు' కవితా సంకలనాలు నిషేధించబడినప్పుడు రాష్ట్ర హైకోర్టులో ఆ నిషేధాన్ని సవాలు చేస్తూ ప్రత్తిపాటి వాదించారు. 1970 నుంచి ఎమెర్జెన్సీ దాకా హైదరాబాద్‌లో విప్లవ ప్రజా ఉద్యమాల కూడలిగా ఆయన ఉండేవారు. 1975 జూన్ 25 అర్ధరాత్రి ఎమర్జెన్సీ విధించినప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో అరెస్టయిన మొట్ట మొదటి రాజకీయ కార్యకర్త ఆయనే. పౌరహక్కుల సంఘం ప్రధాన కార్యదర్శిగా రాష్ట్రవ్యాప్తంగా ఎన్నో సభలలో పాల్గొని ఉత్తేజకరమైన ఉపన్యాసాలు చేశారు. ఎమర్జెన్సీ అనంతరం పౌరహక్కుల సంఘంలో క్రియాశీలంగా పనిచేయనప్పటికీ, మొత్తంగా ప్రజా ఉద్యమాలకు అండగా నిలిచారు. కమ్యూనిస్టులు అందరూ ఏకం కావాలని ఐక్య ఉద్యమం మాత్రమే ప్రజా ప్రయోజనాలను పరిరక్షిస్తుందని నమ్మేవారు. గత కొద్ది సంవత్సరాలుగా పని హక్కు వేదిక ప్రారంభించి పని హక్కు కల్పించడమే మిగిలిన అన్ని హక్కులకు హామీ ఇస్తుందని వాదించేవారు. ఒక కవితా సంపుటం, ఆత్మకథ అచ్చయ్యాయి.



కలిసి నెలకొల్పుదాం. దీనికి కావాల్సిన రాజ్యాంగాన్ని కలిసి ఏర్పాటు చేసుకుందాం' అంటూ రాజ్యాంగ చట్టం ఇచ్చే హక్కులను కూడా 'ఎన్నుకున్న ప్రజా ప్రతినిధులు, ఉద్యోగస్తులు సంతృప్తికరంగా పని చేయకపోతే ప్రజలు వారిని నియమిత కాలం పూర్తికాక మునుపే తొలగించి కొత్తవారిని ఎన్నుకొనే హక్కు ఉంటుంది' లాంటివి కూడా ఆ పత్రంలో ప్రకటించారు.

ఈ రోజున చాలామంది – కమ్యూనిస్టులనుకునే వారితో సహా – విశాలాంధ్రలో ప్రజారాజ్యం అంటే భాషా ప్రయుక్త రాష్ట్రమన్నట్టు మాట్లాడేస్తున్నారు. తెలియక అలా భావిస్తున్న వారిది అవగాహన లేమిగా పరిగణించినా, తెలిసి కూడా అలాగే పోట్లాడే వారికి దురుద్దేశాలున్నాయని చెప్పక తప్పదు. ఈ పత్రాన్ని నాటికీ, నేటికీ పనికిరానిదిగా, నేటికి మాత్రమే ఆచరణ సాధ్యం కానిదిగా, తిరస్కరించదగినదిగా, ఆమోద యోగ్యం కానిదిగా– ఎన్ని రకాలుగానైనా భావించవచ్చును గానీ, స్వంత రాజ్యాంగ నిర్మాణంతో, స్వయం నిర్ణయాధికారం గల తెలుగు జాతీయ ప్రజాస్వామిక రాజ్యాన్ని విశాల భారతదేశంలో భాగంగా నిర్మించ దానికి, ఆచరించడానికి రూపొందించిన పత్రంగా కాకుండా పరిగణించ దానికి చరిత్ర అనుమతించదు. ఈ పత్రరచన తర్వాత కోస్తా, రాయలసీమ జిల్లాలలో జమీందారీ, భూస్వామ్య శక్తులకు, హైదరాబాద్ రాష్ట్రంలో ఫ్యూడల్ నిరంకుశ శక్తుల నిజాం రాజ్యానికి వ్యతిరేకంగా దున్నేవారికే భూమి నినాదంతో సాగించిన చారిత్రక పోరాటమే దానికి రుజువు.

ఈ పత్రం విడుదలానంతరం జరిగిన ఎన్నికలలో అందరికీ ముఖ్యంగా నిరక్షరాస్యులకు, భూమిలేని పేదలకు ఓటు హక్కులేదు. అలాగే హైదరాబాద్ – మైసూరు – బరోడా లాంటి సంస్థానాలలో అప్పటికి ఎన్నికలనే ప్రసక్తే లేదు. అయినా సంస్థానాధీశుల నుండి ఎంపిక చేయబడిన ప్రతినిధులను భారత రాజ్యాంగ నిర్ణాయక సభలో (కాన్‌స్టిట్యూయెట్ అసెంబ్లీ) భాగం చేశారు. పరిమిత ఓటింగ్‌తో నెగ్గిన 'ప్రజా' ప్రతినిధుల నుండి సభ్యులను ఎన్నిక చేసుకున్నారు. దేశ విభజన జరిగిపోయింది. బ్రిటిష్ – నిజాం దొరల చెప్పుల్లో కాళ్లు దూర్చి పరిపాలన సాగిస్తున్న స్వతంత్ర పాలకులు తిరిగి దేశాన్ని సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థల విచ్చలవిడి బందిపోటుతనానికీ తలుపులు బార్లా తెరిచారు. ఇది నేటి చరిత్ర.

*(రచయిత సాహిత్యోద్యమ నాయకులు)*

వీ

## అసహజ మరణాలు నమోదు చేద్దాం!

ఆగస్ట్ 2006 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి ప్రారంభించాం. మన చుట్టూ అసహజంగా చనిపోతున్న రైతులు, చేనేత కార్మికులు, వరకట్న మరణాలు, రకరకాల ప్రమాదాలలో చనిపోతున్నవారు, వైద్యం అందక, ప్రకృతి వైపరీత్యాలతో మరణిస్తున్నవారు, హత్యలు ఇలా అనేక సామాజిక రంగాలనుంచి మరణిస్తున్నవారి సంఖ్యను నమోదు చేయడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం. ఏయే సామాజిక, రాజకీయార్థిక కారణాలతో చనిపోతున్నారో పరిశోధన చేయాల్సి ఉంది. ఇప్పటికే 20 జిల్లాల నుంచి మాకు ఈ సమాచారం అందుతోంది. ఇంకా **విశాఖపట్నం, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, కృష్ణా** జిల్లాల నుంచి అసహజంగా చనిపోతున్న వారి సమాచారం అందాల్సి ఉంది. మేము చేస్తున్న ఈ ప్రయత్నంలో మీరూ పాలుపంచుకోవచ్చు. దీనికి పారితోషికంగా వీక్షణం ప్రతిని పంపిస్తాం.

ఆసక్తి గలవారు వివరాలకై సంప్రదించండి : **వై. రామచంద్రం** (సర్క్యులేషన్ మేనేజర్) ఫోన్ నెం. 9949391028

**– సంపాదకులు**

*ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా ఛత్తీస్‌ఘడ్‌లో ఆదివాసీ ప్రజలపైన అమలవుతున్న నిర్బంధ దమనకాండలపై క్షేత్రస్థాయి నివేదికను అందిస్తున్నారు* **అమన్**

# రెండో దశకు చేరిన 'ప్రజలపై యుద్ధం'

ఛత్తీస్‌గఢ్‌లోని దక్షిణ బస్తర్ (దంతెవాడ జిల్లా), కొంట తాలూకాలోని చింతల్‌నార్ ప్రాంతంలో 2011 మార్చ్ 11 నుండి 16 తేదీల మధ్య ఆదివాసులపై ప్రభుత్వ సాయుధ బలగాలు ఒక వినాశకర దాడికి పాల్పడ్డాయి. గత ఏడాదిన్నర కాలంగా దేశంలోని పలు ప్రాంతాల్లో కొనసాగుతున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగమే ఇది. కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా రచించిన పథకమే ఇది. బస్తర్ ప్రాంతంలో ప్రభుత్వ సాయుధ బలగాలు గ్రామాలను కాల్చివెయ్యడం, ప్రజలను విచ్చలవిడిగా చంపడం, దోచుకోవడం, మహిళలపై సామూహిక అత్యాచారాలకు పాల్పడడం కొత్త విషయమేమీ కానప్పటికీ ప్రత్యేకించి ఈ దాడి తీవ్రత, దీని మూలంగా జరిగిన నష్టం చాలా ఎక్కువ.

ఈ ప్రాంతంలో సిఆర్‌పిఎఫ్‌కు చెందిన కోబ్రా బలగాలు, ఎస్‌టిఎఫ్, కోయ కమెండోలు, ఎస్‌పిఒలు భారీవిధ్వంసానికి పాల్పడ్డారు. వరుసగా ఆరు రోజుల పాటు బీభత్సకాండను కొనసాగించారు. ఈ బర్బర దాడికి లక్ష్యంగా చింతల్‌నార్ పోలీసు క్యాంపుకు 15 కిలోమీటర్ల పరిధిలోని నాలుగు గ్రామాలను - మోర్‌పల్లి (మొర్రం), పులాన్‌పాడు (పుల్లుం), తిమ్మాపురం (తింపురం), తాడిమెట్ల గ్రామాలను ఎంచుకున్నారు. చట్టాన్ని రక్షించేవాళ్లమని చెప్పుకునే ఈ బలగాలు మోర్‌పల్లిలో 37, తిమ్మాపురంలో 56, తాడిమెట్లలో 207 - మొత్తం దాదాపు 300 ఇండ్లను కాలబెట్టాయి. మొత్తం ముగ్గురు వ్యక్తులను - మాడివి శూల, బాడ్సె భీమ, మాను యాదవ్‌లను హత్య చేశారు. మాడివి హంద, మాడివి ఆయిత అనే ఇద్దరు ఆదివాసులను మాయం చేశారు. ఆరుగురు మహిళలపై లైంగిక అత్యాచారానికి పాల్పడ్డారు. పోలీసులు కొట్టిన దెబ్బల మూలంగా గాయపడిన మహిళల సంఖ్య 31, పురుషుల సంఖ్య 10. వందలాది కోళ్లను, మేకలను, ఇతర పెంపుడు జంతువుల్ని ఎత్తుకెళ్లారు, కోసుకొని తిన్నారు. ఈ నాలుగు గ్రామాల్లో జరిగిన దోపిడీ, దహనకాండల వల్ల జరిగిన నష్టం ఒక అంచనా ప్రకారం నాలుగు కోట్ల రూపాయలకు పైగా ఉంటుంది.

ఈ దాడిలో వేలాది క్వింటాళ్ల ధాన్యం కాలిబూడిదైంది. దంతెవాడ, బీజాపూర్ జిల్లాల్లో ప్రజలు, ముఖ్యంగా 2005 నుండి ఇలాంటి దాడుల నుండి తమను తాము కాపాడుకోవడం కోసం ఎంతో రక్తతర్పణ చేశారు. తమ గ్రామాల్ని, ఇండ్లను, పంటపొలాల్ని, ధాన్యాన్ని కాపాడుకోవడం వాళ్లకు ఒక గెరిల్లా పోరాటంగా మారిందంటే అతిశయోక్తి కాదు. చుట్టూ సెంట్రీలు పెట్టుకొని, పెట్రోలింగ్స్ నిర్వహిస్తూ నాట్లు, కలుపులు, కోతలు, నూర్పిళ్లు చేయాల్సిన పరిస్థితి. కానీ ఈసారి కోయ కమెండో/కోబ్రా దుండగులు పంటల కోతలు, నూర్పిళ్లు పూర్తయ్యి ధాన్యం ఇళ్లకు చేరిన సమయం చూసి ఒక పథకం ప్రకారమే ఈ తరహా దాడికి పాల్పడ్డారు. ప్రభుత్వ ఉద్దేశ్యం స్పష్టమే - తిండి ధాన్యాల్ని కాలబెట్టి ప్రజల్ని ఆకలికి మాడిపోయేలా చేయడం, వలసపోయేలా లేదా సరెండర్ అయ్యి నిర్బంధ శిబిరాల్లోకి తరలిపోయేలా వత్తిడి చేయడం. ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికయ్యామని చెప్పుకునే ప్రభుత్వాలు ఆదివాసులను క్రూరంగా నిర్వాసితుల్ని చేస్తున్న అనేకానేక పద్ధతుల్లో ఇదొకటి.

ఈ బీభత్సకాండ మార్చ్ 16 వరకే పరిమితం కాలేదు. అది అనేక రూపాల్లో నిరంతరాయంగా కొనసాగింది. ఈ బర్బరత్వానికి సంబంధించిన నిజానిజాల్ని తెలుసుకోవడం కోసం, విచారణ జరపడం కోసం లేదా పీడితులకు సహాయం అందించడం కోసం ఈ ప్రాంతంలో పర్యటించడానికి ప్రయత్నించిన ప్రభుత్వ, ప్రభుత్వేతర వ్యక్తులు కూడా ఈ బీభత్సాన్ని చవిచూడాల్సి వచ్చింది. చాలా పథకం ప్రకారం 'సల్వాజుడుం' పేరుతో లేదా 'ఆక్రోశితులైన ఆ ప్రాంత ఆదివాసుల' పేరుతో వాళ్లపై దాడులు జరిపించారు. పత్రికా విలేకరులతో దురుసుగా వ్యవహరించడమే కాకుండా వాళ్లపై అబద్ధపు కేసుల్ని కూడా బనాయించారు. దంతెవాడ కలెక్టర్ ఆర్. ప్రసన్న, బస్తర్ డివిజనల్ కమిషనర్ శ్రీనివాసులులను కూడా ఇక్కడికి రాకుండా ఆపేశారు. స్వామి అగ్నివేష్ తదితర సామాజిక కార్యకర్తలపై కోడిగుడ్లు, రాళ్లు విసిరారు. వాహనాల అద్దాల్ని పగులగొట్టారు. ప్రతిపక్ష కాంగ్రెస్‌కు చెందిన ఎంఎల్‌ఎల బృందం కూడా ఈ 'నిరసన' కారణంగా వెనక్కి పోవల్సి వచ్చింది.

ఒక్క రమన్‌సింగ్‌కు మాత్రమే ఈ ప్రాంతంలోకి అడుగుపెట్టే 'అనుమతి' ఉండింది! ఆయనతో పాటు గవర్నర్ శేఖర్ దత్, డిజిపి విశ్వరంజన్ వగైరాలంతా ఏ 'అడ్డంకీ' లేకుండా రాగలిగారు. తాడిమెట్ల గ్రామానికి చెందిన 'పీడితులుగా చెప్పబడుతున్న వాళ్ల'ను కలవడానికి ఏప్రిల్ 2న వచ్చిన ముఖ్యమంత్రి, గవర్నర్‌లు టీవీ కెమెరాల సమక్షంలో ప్రజల ఫిర్యాదులు విన్న తర్వాత దోషులపై చర్యలు తీసుకుంటామని హామీ ఇచ్చారు. అయితే సరిగ్గా వాళ్లు ఈ హామీ ఇస్తున్న సమయంలో అదే గ్రామానికి చెందిన మరో గూడెం (టోల)లో దృశ్యం మరో విధంగా ఉండింది. రమన్‌సింగ్‌కు 'రక్షణ'గా వచ్చిన ఎస్‌టిఎఫ్, కోయ కమెండో, ఎస్‌పిఒ బలగాలకు చెందిన వందలాది సాయుధ గుంపుల్లో ఒకటి ఈ గూడెంలో దాదాపు 20 ఇళ్లలోకి జొరబడి కోళ్లు, మేకలు, నగలు మొదలైన విలువైన సామాన్లను దోచుకోవడమే కాకుండా చాలా మందిని విపరీతంగా కొట్టారు. ఒక మహిళపై సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు. ఈ గ్రూడెం ఎంత దగ్గరంటే రమన్‌సింగ్ మైక్‌లో ఇస్తున్న ఉపన్యాసాన్ని వినగలిగేంత. ఆ తర్వాత రమన్‌సింగ్ బైల్దేరాడు. అతనితో పాటే ఎస్‌టీఎఫ్, కోయ కమెండో మూకలూ వెళ్లాయి. బైల్దేరే ముందు తాడిమెట్ల ప్రజలకు మరోసారి 'బుద్ధి' చెప్పి మరీ వెళ్లారు!

### మొదటి టార్గెట్ మొర్‌పల్లి

ఈ ఆరు రోజుల తాజా ఆపరేషన్‌లో మొదటి టార్గెట్‌గా మొర్‌పల్లి గ్రామాన్ని ఎంచుకున్నారు. మార్చ్ 11న తెల్లవారక ముందే నాలుగు గంటలకు చింతల్‌నార్ నుండి మొర్‌పల్లికి బైల్దేరాయి సాయుధ బలగాలు. వీళ్లలో 200 మంది కోయ కమెండోలు, 150 మంది కోబ్రా బలగాలకు చెందిన వారున్నారు. పొద్దున ఆరున్నర గంటల సమయంలో వీళ్లు గ్రామాన్ని నాలుగు వైపుల నుండీ చుట్టుముట్టారు. గ్రామంలోకి ప్రవేశిస్తూనే గాలిలోకి కాల్పులు జరిపారు. ప్రజలంతా ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకొని చెల్లాచెదురుగా పరుగులు తీశారు. వేగంగా పరుగెత్తలేని వాళ్లు ప్రభుత్వ బలగాల పాశవికతకు గురయ్యారు. చాలా వరకు ముసలి వాళ్లు, మహిళలు వాళ్ల చేతికి చిక్కారు. దాదాపు 35 ఏళ్ల వయసున్న ఏమ్లు మూడె అనే మహిళ తన చెలకలో తునికాకు తెంపుతుండగా సాయుధ మూకలు ఆమెను కింద పడేసి బట్టలూడదీశాయి. తన ఇద్దరు కూతుళ్ల కళ్లెదుటే ఆమెపై అత్యాచారానికి పాల్పడ్డారు. ఆమె తన నడుంకు కట్టుకున్న పది వేల రూపాయల్ని గుంజుకున్నారు. గంగ అనే మరో మహిళపై కూడా ఈ 'భద్రతా' బలగాలు బలాత్కారానికి పాల్పడ్డాయి. అంతే కాకుండా వీళ్లు ఆమె ఒంటి మీద ఉన్న నగలనూ, ఇంట్లోని విలువైన సామాన్లనూ దోచుకున్నారు. మాడివి భీమె అనే 80 ఏళ్ల వృద్ధురాలిపై కూడా తమ పాశవికతను ప్రదర్శిస్తూ విపరీతంగా కొట్టారు. మరో ముగ్గురు వృద్ధుల్ని కూడా లాఠీలతో విపరీతంగా బాదారు. ఈ గ్రామంలో కనీసం 37 ఇండ్లకు నిప్పు పెట్టారు. ఇళ్లలో వున్న ధాన్యం, బట్టలు, వంట పాత్రలు వగైరా అన్నీ కాలి బూడిదైపోయాయి. ఈ పాశవిక దాడి మొదలైన సమయంలో మాడివి శూల అనే 28 ఏళ్ల గ్రామస్తుడు చింతచెట్టు ఎక్కి చింతకాయలు తెంపుతూ ఉండినాడు. ప్రభుత్వ బలగాలు అతన్ని చూస్తూనే చెట్టు పైకి గుళ్ల వర్షం కురిపించాయి. అతన్ని చంపవద్దని అతని భార్య ఉంగె ఎంత మొత్తుకున్నా ఆమె రోదనకు కరిగిపోయేందుకు అక్కడున్నది మనిషితనం ఉన్నవాళ్లయితే కదా! పైగా ఆ మృగాలు ఆమెపై పడి బట్టలు చింపేసి చంపేస్తామని బెదిరించడంతో ఆమె అక్కడి నుండి పారిపోయింది. శూల చెట్టుపైనే వేలాడుతూ రక్తమోడుతూ శవంగా మారిపోయాడు. శూల తండ్రి పేరు మాడివి సోమ, తల్లి పేరు పాలి.

ఇలా మొర్‌పల్లి గ్రామం దాదాపు పూర్తిగా ధ్వంసమయ్యింది. కాలబెట్టడానికి ముందు ఈ మూకలు ఇండ్లలోకి జొరబడి డబ్బులు, నగలు, విలువైన సామాన్లు ఏవి దొరికితే అవి దోచుకున్నారు. కోళ్లు, మేకల గురించి విడిగా చెప్పాల్సిన పనే లేదు. ఈ బీభత్సకాండ ఉదయం పది గంటల దాకా సాగింది. పోతూ పోతూ వాళ్లు మాడివి గంగాల్ (45), అతని కొడుకు భీమ, కూతురు మాడివి లక్మెలను పట్టుకొని చింతల్‌నార్‌కు తీసుకెళ్లారు. అక్కడ తండ్రీకొడుకుల్ని విడిగా బంధించి వాళ్లను రాత్రంతా కొట్టారు. లక్మె ఒంటిపై ఉన్న బట్టల్ని లాక్కుని విడి సెల్‌లో బంధించారు. ఆమెపై సామూహిక అత్యాచారానికి పాల్పడ్డారు. మరుసటి రోజు మొర్‌పల్లి మహిళలు చింతల్‌నార్ వెళ్లి పోలీసులతో కొట్లాడి ఈ ముగ్గురినీ విడిపించుకున్నారు. కానీ మానవత్వం మరిచిన ఖాకీ మూకలు లక్మె బట్టల్ని తిరిగి ఇవ్వలేదు.

### పులాన్‌పాడులో హింసాకాండ

మళ్లీ 13వ తేదీన ప్రభుత్వ సాయుధ మూకలు ఉదయమే చింతల్‌నార్ నుండి బయలుదేరాయి. మొట్టమొదట వాళ్లు మధ్యాహ్నం రెండు గంటల సమయంలో పులాన్‌పాడు గ్రామంపై దాడి చేశారు. వాళ్లను గమనించి చాలా మంది ముందే అడవి వైపు పరుగులు దీశారు. దొరికిన వాళ్లను కొట్టి, చాలా ఇండ్లను దోచుకున్నారు. చాలా మంది మహిళలు ఇళ్ల దగ్గరే ఉండిపోవడంతో వాళ్లే ఎక్కువగా పోలీసుల హింసకు గురయ్యారు. ఒక మహిళ అత్యాచారానికి గురైంది. ఈ మూకలు విచ్చలవిడిగా జరిపిన కాల్పుల్లో ఇద్దరు గ్రామస్తులు ముచాకి హడ్మ (23), మడ్కం సోమిడి (28) గాయపడ్డారు. గ్రామం నుండి బయలుదేరే ముందు వాళ్లు బాడ్సె భీమ (29), మాను యాదవ్ (28)లను పట్టుకున్నారు. వాళ్లిద్దరినీ చేతులు వెనక్కి విరిచి కట్టేసి తమతో పాటు తీసుకొని తిమ్మాపురం వైపు బయలుదేరారు.

### తిమ్మాపురంలో విలయ తాండవం

పులాన్‌పాడు గ్రామంలో జరిగిన కాల్పుల శబ్దాల్ని విన్న తర్వాత తిమ్మాపురం గ్రామం ముందుగానే పూర్తిగా ఖాళీ అయ్యింది. రానున్న ప్రమాదాన్ని ఊహించి ప్రజలంతా ముందుగానే అడవుల్లోకి పారిపోయారు. ఈ గ్రామంలో ఉండిన దాదాపు 90 ఇండ్లు నిర్మానుష్య మయ్యాయి. దీంతో మరింత రెచ్చిపోయిన ప్రభుత్వ బలగాలు ఇండ్లల్లోకి జొరబడి సామాన్లు కొల్లగొట్టడం ప్రారంభించాయి. సైకిళ్లు, రేడియోలు, గడియారాలు, బట్టలు, నగలు మొదలైనవన్నీ దోచుకున్నారు. సాయంత్రం 5 గంటల దాకా ఈ దోపిడీకాండ కొనసాగింది. ఆ తర్వాత వాళ్లు అక్కడి నుండి బోడికెల్ గ్రామానికి బయలుదేరారు. కానీ తోవలో పిఎల్‌జిఎకు చెందిన మరో చిన్న దళం వాళ్లపై మాటు గాచి దాడి చేసింది. అరగంట సేపు జరిగిన కాల్పుల తర్వాత వాళ్ల అడుగులు ముందుకు పడలేదు. ధైర్యం చాలక తిరిగి తిమ్మాపురంకే వచ్చేశారు. రాత్రి అక్కడే పడుకున్నారు. నిర్మానుష్యంగా ఉన్న ఆ గ్రామంలో దొరికిన కాడికి కోళ్లు, మేకలు కోసుకొని విందులు చేసుకున్నారు.

మరుసటి రోజు, అంటే 14న పొద్దున ఐదు గంటల నుండే వాళ్లు గ్రామాన్ని కాలబెట్టడం మొదలుపెట్టారు. ఉదయం 9 గంటల దాకా ఈ దహనకాండ కొనసాగింది. ధాన్యం, బట్టలు, వంటపాత్రలు, డబ్బు అన్నీ ఇళ్లల్లో కాలి బూడిదైపోయాయి. చెమటనెత్తురుల్ని చిందించి పైసా పైసా కూడబెట్టి ఇండ్లల్లో దాచిపెట్టుకున్న గ్రామస్తులందరి మొత్తం నగదు దాదాపు ఐదు లక్షల రూపాయలు కాలిపోయాయి. వందలాది క్వింటాళ్ల ఆహారధాన్యాలు మాడి మసైపోయాయి. ఇదంతా సాగుతుంటే దాదాపు 200 మంది గ్రామస్తులు - మహిళలు, పిల్లలు సహా పక్కనే ఉన్న అడవుల్లో తలదాచుకున్నారు. గ్రామం నుండి పైకెగుస్తున్న పొగ వాళ్లకు స్పష్టంగానే కనిపిస్తూ ఉండింది. గ్రామాన్ని కాలబెట్టిన తర్వాత ప్రభుత్వ బలగాలు దాదాపు పదిన్నర గంటల సమయంలో బయలుదేరాయి. వాళ్ల మొత్తం సంఖ్య దాదాపు 350 కావడంతో వాళ్ల ఫార్మేషన్ దాదాపు ఒక కిలోమీటర్ పొడవు వ్యాపించింది.

అవకాశం దొరకగానే మావోయిస్టు పిఎల్‌జిఎ సైనికులు కోబ్రా/ కోయ కమెండోల ఫార్మేషన్‌లో ముందర నడుస్తున్న వాళ్లపై దాడి చేసారు. ఇందులో ముగ్గురు కోయ కమెండోలు చనిపోగా, మరో తొమ్మిది మంది గాయపడ్డారు. ఆ తర్వాత వీళ్లలో ఒకరు ఆసుపత్రిలో చనిపోవడంతో మొత్తం చనిపోయిన వాళ్ల సంఖ్య నాలుగుకు చేరింది. ఈ దాడిలో పిఎల్‌జిఎ మూడు ఎస్‌ఎల్‌ఆర్‌లు, 270 తూటాలు, మరి కొంత సైనిక సామగ్రిని స్వాధీనం చేసుకుంది. గమనించాల్సిన విషయం ఏంటంటే, ఈ క్రమంలో గ్రామస్తుల నుండి దోచుకెళ్తున్న చాలా సామాన్లు వదిలేశారు. వీటిలో నగదు, బ్యాగులు, బంగారం, వెండి నగలు వగైరా విలువైన సామాన్లు ఎన్నో ఉన్నాయి. ఈ ఆస్తులన్నీ మళ్లీ ప్రజల

వశమయ్యాయి. ఈ పోరాటం గురించి మీడియా ఎంత చెత్తగా వార్తల్ని రాసిందంటే, అది కార్పొరేట్ వర్గాల ప్రచార సాధనమే తప్ప మరేమీ కాదనే వాస్తవం అందరికీ మరోసారి స్పష్టంగా అర్థమైంది. అనేక జాతీయ, రాష్ట్రీయ దిన, వార, పక్ష, మాస పత్రికలు, టీవీ ఛానళ్లు మావోయిస్టుల వైపు మృతుల సంఖ్యను 20 నుండి 40 వరకు వేర్వేరు విధాలుగా ప్రకటించి నవ్వుల పాలయ్యాయి.

ఇండ్లకు నిప్పు పెట్టడం, మహిళలనూ అశక్తులనూ కొట్టడం, కోళ్లూమేకలను దోచుకొని తినడం, మహిళలపై అత్యాచారాలకు పాల్పడడం, సామాన్లు దోచుకోవడం వంటి అకృత్యాలకు పాల్పడడంలో ఈ కమెండోలు ప్రదర్శించే 'పరాక్రమం' విచ్చలవిడిగా ఎదురుకాల్పులు జరుపుతూనే పారిపోయిన ఈ బలగాలు మళ్లీ ఊళ్లోకి (తిమ్మాపురంకు) వెళ్లిన తర్వాతే ఊపిరి పీల్చుకున్నాయి. పిఎల్‌జిఎ ప్రజా సైనికులు వీళ్లను దాదాపు ఒక కిలోమీటర్ దూరం దాకా తరిమారు. వాళ్లు ఊళ్లో కాలిపోకుండా మిగిలిపోయిన ఇండ్ల గోడల వెనుక కవర్లు తీసుకొని కాల్పులు సాగిస్తూ ఉండిపోయారు. అక్కడి నుండి వాళ్లు కొన్ని వేల తూటాల్ని కాల్చారు, డజన్ల కొద్దీ మోర్టార్ షెల్స్, గ్రెనేడ్స్ విసిరారు. కామ్రేడ్ ముచాకి గంగ శవాన్ని తీసుకొని గెరిల్లాలు వెనుదిరిగారు. మరుసటి రోజు, మార్చ్ 15న పెద్ద సంఖ్యలో హాజరైన ప్రజల సమక్షంలో విప్లవ సాంప్రదాయాలతో ఆ అమర వీరుడికి అంత్యక్రియలు జరిపారు.

14న రాత్రి ప్రభుత్వ బలగాలు మళ్లీ తిమ్మాపురంలోనే ఆగాయి. రాత్రంతా తూటాలు కాల్చుతూనే గడిపాయి. మరుసటి రోజు ఉదయం తాము పులాన్‌పాడు నుండి బందీలుగా పట్టుకొచ్చిన బాడ్సె భీమను కోబ్రా/కోయ కమెండోలు గొడ్డలితో నరికి హత్య చేశారు. భీమతో పాటే పట్టుకొచ్చిన మాను యాదవ్‌కు డ్రెస్ తొడిగించి తుపాకీతో కాల్చి చంపారు. భీమ శవాన్ని గ్రామంలోనే పడవేసి మాను యాదవ్ శవాన్ని తమతో తీసుకెళ్లి మావోయిస్టుల దాడిని ఎదిరించే క్రమంలో స్వాధీనం చేసుకున్న మావోయిస్టు శవంగా చూపించారు. బహుమతులు పొందడం కోసం తమ 'విజయానికి' నిదర్శనంగా ఏదైనా ఒక శవం చూపించడం తప్పనిసరైంది వాళ్లకు! బాడ్సె భీమకు భార్య, ఒక చిన్నారి కూతురు ఉన్నారు. ఆయన తండ్రిపేరు బాడ్సె దేవ, తల్లి పేరు అడ్మె. మాను యాదవ్‌కు కూడా వివాహితుడే. తల్లిదండ్రులు, భార్యతో పాటు ఆయనకు ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్లున్నారు. అదనపు బలగాల సహాయంతో 15న ఉదయం శత్రు బలగాలు పూర్తిగా వెనుదిరిగాయి. పోయే ముందర మరి కొన్ని ఇండ్లకు నిప్పు పెట్టిపోయారు. దాంతో ఈ గ్రామంలో కాలిపోయిన మొత్తం ఇండ్ల సంఖ్య 56 అయ్యింది.

## తాడిమెట్లలో ఖాకీ మూకల స్వైరవిహారం

16న తాడిమెట్ల గ్రామం పశు బలగాల అమానుషత్వానికి గురైంది. దాదాపు 300 ఇండ్లున్న ఈ గ్రామంలో 207 ఇండ్లను ప్రభుత్వ బలగాలు కాలబెట్టాయి. ఈ గ్రామంలో భారీ నష్టం జరిగింది. మాడివి జోగి అనే మహిళపై అత్యాచారానికి పాల్పడ్డారు. అంతేకాకుండా ఆమెను స్పృహ కోల్పోయే దాకా కొట్టారు. ఆమె స్పృహలోకి వచ్చిన తర్వాత చూస్తే 12 వేల రూపాయల విలువ చేసే నగదు, నగలు మాయమయ్యాయి. ఈ గ్రామంలో మొత్తం 27 మంది మహిళల్ని సర్కారీ సాయుధ బలగాలు తీవ్రంగా కొట్టాయి. దీంతో చాలా మంది మహిళలు తీవ్రంగా గాయపడ్డారు. 12 సంవత్సరాల ఒక బాలిక కూడా తీవ్రంగా గాయపడిందంటే ఈ బీభత్సకాండ ఏ స్థాయిలో కొనసాగిందో అర్థం చేసుకోవచ్చు. ముగ్గురు పురుషుల్ని కూడా తీవ్రంగా కొట్టారు. ఈ హింసాకాండ ఉదయం ఆరు గంటల నుండి ఎనిమిది గంటల దాకా సాగింది. పోతూ పోతూ ఈ గ్రామానికి చెందిన మాడివి హంద, మాడివి ఆయిత అనే ఇద్దరు గ్రామస్తుల్ని పట్టుకెళ్లారు. ఇది రాసేటప్పటికి వీళ్ల గురించి ఎలాంటి ఆచూకీ లేదు. వీళ్లిద్దరినీ చంపేసి ఉంటారని గ్రామ ప్రజలు అనుమానిస్తున్నారు.

ఈ పాశవిక దాడులకు పాల్పడ్డ వాళ్లలో కొందరిని ప్రజలు గుర్తించారు – మడ్కాం భీమ, తెల్లం అంద, వంజం దేవ, దసురు, మార, కిచ్చ నంద (కోయ కమెండో కమాండర్), కరటం దూల ఎలియాస్ సూర్య (కోయ కమెండో కమాండర్), మహిళా ఎస్‌పిఒ పాయికె. ఈ విధంగా ఆరు రోజుల పాటు ఈ అమానుష దాడి క్యాంపెయిన్ కొనసాగింది. అయితే ఇక్కడితోనే అంతా పూర్తవలేదు.

## దిగ్బంధంలో చింతల్‌నార్ ప్రాంతం

మరుసటి రోజు నుండి దోర్నపాల్, కేర్లపాల్, పోలంపల్లి, సుక్మ తదితర ప్రాంతాల్లో జమయిన సల్వాజుడుం నాయకులు, బస్తర్ ఐజీ టీ. జాన్ లాంగ్‌కుమేర్, ఎస్‌ఎస్‌పీ కల్లూరి సహా పోలీసు వున్నతాధికారులు ఈ ప్రాంతంపై దిగ్బంధం విధించే పథకం రూపొందించారు. ఎవరైనా మానవ హక్కుల కార్యకర్తలు గానీ, ప్రజాపక్షం వహించే విలేకరులు గానీ ఈ ప్రాంతానికి వెళ్లి నిజాల్ని బైటపెడతారని, దాంతో ప్రభుత్వం అనేక చిక్కుల నెదుర్కోవల్సి వస్తుందని వాళ్ల భయం. అందుకే మరుసటి రోజు నుండి మీడియా వాళ్లను ఆ ప్రాంతంలోకి అడుగు పెట్టనివ్వకుండా ఆపడం మొదలుపెట్టారు. రాయపూర్ నుండి ముఖ్యమంత్రి రమన్‌సింగ్, గవర్నర్ శేఖర్ దత్, డిజిపి విశ్వరంజన్‌ల త్రయపు కచ్చితమైన ఆదేశాలు లేకుండానే ఇది జరిగిందని ఊహించలేం. ఎందరో అమాయక ఆదివాసుల రక్తం పారించిన రక్తపిపాసి, ఎందరో మహిళలపై అత్యాచారాలకు పాల్పడ్డ రేపిస్టు ఎస్‌ఎస్‌పీ కల్లూరి సుక్మ ప్రాంతంలో తిష్ట వేసి 'సర్కారీ దిగ్బంధాన్ని' పకడ్బందీగా అమలు చేయించాడు. అందువల్లనే మార్చ్ 11 నుండి 16 వరకు సాగిన ఈ బీభత్సకాండ గురించి బైటి ప్రపంచానికి దాదాపు ఒక వారం రోజుల దాకా ఎలాంటి సమాచారం లేకుండా పోయింది. కొందరు విలేకరులు రిస్క్ తీసుకొని వేరే తోవల గుండా ప్రయాణించి ఈ గ్రామాలను పర్యటించి మార్చ్ 23న వాస్తవాల్ని వెల్లడించిన తర్వాతనే రాష్ట్రంలోని ప్రతిపక్ష కాంగ్రెస్ పార్టీ మేల్కొంది. ఆ తర్వాత విధానసభలో దీనిపై చర్చ జరిగింది. దేశవ్యాప్తంగా ఈ అమానుష దాడికి వ్యతిరేకంగా స్పందనలు రావడం మొదలైంది. అనేక మంది ప్రజాస్వామికవాదులు, రచయితలు, విద్యార్థులు సహా ప్రజాస్వామిక సంస్థలు, మానవహక్కుల సంఘాలు దీన్ని ఖండించాయి.

## 'సహాయ' కార్యక్రమాల పేరుతో...

అనేక ఏళ్లుగా అభివృద్ధికి నోచుకోకుండా పోయిన ప్రాంతాల్లోనే మావోయిస్టు ఉద్యమం పెంపొందుతున్నదని చెబుతూనే, మావోయిస్టులు అడ్డుకోవడం వల్లనే ఆదివాసీ ప్రాంతాలు అభివృద్ధికి నోచుకోలేక పోతున్నాయని పాలకులు, వాళ్లకు వంతపాడేవాళ్లు ఆరోపించడం తెలిసిందే. ఈ నేపథ్యంలోనే ప్రస్తుత ఆపరేషన్ గ్రీన్ హంట్‌లో 'హోల్డ్, కంట్రోల్ అండ్ బిల్డ్' వ్యూహం అమలు చేస్తున్నారు. అంటే వాళ్లు చెప్పే ప్రకారం మావోయిస్టులను అణచివేసి, వాళ్ల ప్రాబల్యం ఉన్న ప్రాంతాలను అదుపులోకి తెచ్చి, వాటిని 'అభివృద్ధి' చెయ్యడం. లేదా దీన్నే 'ముందుగా మావోయిస్టులను అణిచేసి ఆ తర్వాత అభివృద్ధి

చెయ్యడం' అని చెబుతున్నారు. దీనిలో అణచివేత యంత్రాంగంలో భాగమైన పోలీసు/పారామిలిటరీ బలగాలతో పాటు పరిపాలనా శాఖది కూడా కీలక బాధ్యత. ముఖ్యంగా గత నవంబర్ 26న ప్రకటించిన 13,742 కోట్ల రూపాయల 'యూనిఫైడ్ యాక్షన్ ప్లాన్'లో ఒక్కో నక్సలైటు ప్రభావిత జిల్లాకు ఏటా 30 కోట్ల రూపాయల్ని 'అభివృద్ధి' పనుల కోసం ఖర్చు చేయాలనే ప్రభుత్వ నిర్ణయం నేపథ్యంలో 'సమర్థులైన' యువ పరిపాలనాధికారులు మరింత ప్రాధాన్యతను సంతరించుకున్నారు.

ఈ బీభత్సకాండ గురించి దినపత్రికలలో వార్తలు ప్రచురితమై అసెంబ్లీలో చర్చ జరిగిన తర్వాత దంతెవాడ కలెక్టర్, బస్తర్ డివిజనల్ కమిషనర్ మార్చ్ 24న 'సహాయ' సామగ్రిని తీసుకొని చింతల్‌నార్ ప్రాంతానికి బైల్దేరారు. అంటే రాజ్యానికి చెందిన ఒక విభాగం తన 'పని' పూర్తి చేసిన తర్వాత, మరో విభాగం ఈ 'సహాయ' పనిలోకి దిగిందన్నమాట! అయితే ఈ ప్రయత్నాన్ని కేవలం 25 మంది ఎస్‌పిఒల గుంపు పోలెంపల్లి దగ్గర అడ్డుకుంది! చింతల్‌నార్ ప్రాంతంలో ప్రభుత్వ బలగాలు సాగించిన పాశవిక దాడులపై సర్వత్రా నిరసనలు, విమర్శలు వెల్లువెత్తుతున్న నేపథ్యంలో ప్రజల దృష్టిని మళ్లించడం తప్ప దంతెవాడ కలెక్టర్, బస్తర్ డివిజనల్ కమిషనర్‌లు చేపట్టిన ఈ సోకాల్డ్ సహాయ కార్యక్రమాలకు మరో ఉద్దేశ్యం ఏదైనా ఉందనుకుంటే అది అమాయకత్వమే అవుతుంది.

వీళ్లు ఈ బీభత్సకాండకు 'అగ్నికాండ' అని పేరు పెట్టి, చాలా జాగ్రత్తగా ఎంచుకున్న మాటలలో 'ఇండ్లకు నిప్పు పెట్టింది మావోయిస్టులా లేక పోలీసులా అనే విషయంపై మేం విచారణ జరిపిస్తాం' అని అన్నారు. ఒక వైపు స్థానిక ప్రజలు, విలేకరులు, ఆఖరుకు ప్రజా ప్రతినిధులమని చెప్పుకునే వాళ్లు కూడా సర్కారీ సాయుధ బలగాలే ఈ గ్రామాల్లో ఇండ్లకు నిప్పు పెట్టాయని గొంతు చించుకుని అరుస్తున్నా, 'నిజాయితీపరులూ', 'కర్తవ్యపరాయణులూ' అయిన ఈ పరిపాలనాధికారులు ఈ దహనకాండకు పాల్పడింది మావోయిస్టులా లేక ప్రభుత్వ బలగాలా అని తేల్చుకోలేకపోవడం ఎంత విచిత్రం! ఇంత దారుణమైన దాడి జరిగాక కూడా, ఒక విలేకరి 'పోలీసు బలగాలు పాల్పడుతున్న అకృత్యాలపై మీ స్పందన ఏమిటి' అని అడిగినపుడు కలెక్టర్ ప్రసన్న జవాబివ్వడానికి నిరాకరిస్తూ 'నా పని శాంతిభద్రతలకన్నా అభివృద్ధిపై కేంద్రీకరించడం' అని జవాబిచ్చాడన్నది గమనార్హం. ఇలాంటి వ్యక్తి మీడియా దృష్టిలో, పౌర సమాజంగా చెప్పుకునే కొందరి దృష్టిలో 'నిజాయితీపరుడూ', 'ప్రజల మనిషీ' అయ్యాడు. ఎందుకంటే ప్రజలకు 'సహాయ' సామగ్రి తీసుకెళ్లడానికి పూనుకున్నాడు కనుక. కానీ కళ్లున్న ప్రతి ఒక్కరికీ అగుపడేలా ప్రజలపై సాగిన పోలీసు జులుం గురించి ఈయన నోటి నుండి ఒక్క మాటైనా పెగలకపోవడం కేవలం అమాయకత్వం అనుకోవాలా? నేరం జరుగుతూ ఉంటే చూస్తూ ఊరుకున్న వాళ్లు, కళ్లుండీ చూడనట్టు నటించేవాళ్లు నేరంలో భాగస్వాములే అని నమ్మడం నేరమెలా అవుతుంది?

ఈ చర్చను అలా ఉంచితే... కలెక్టర్, డివిజనల్ కమిషనర్‌ల వెంట విలేకరులు, మీడియావాళ్లు కూడా ఉన్నారు. యూనిసెఫ్ వాళ్ల వాహనం కూడా ఉండింది. వీళ్ల కాన్వాయ్‌ను ఆపేసి 'మావోయిస్టులకూ, పోలీసులకూ మధ్య ఎదురుకాల్పులు జరుగుతున్నాయి, ముందుకు పోవడం ప్రమాదం' అని చెప్పి నిలిపివేశారు. సరిగ్గా అదే సమయంలో దూరం నుండి తూటాల శబ్దాలు, పేలుళ్ల శబ్దాలు వినిపించాయి కూడా! ఎస్ఎస్‌పి కల్లూరి ముందుగానే తన బలగాలకు ఆదేశాలిచ్చి ఈ 'ఎదురుకాల్పుల' ఏర్పాటు చేశాడన్నది అందరికీ తేటతెల్లమే. అయినప్పటికీ వీళ్లు ముందుకు సాగడానికి ప్రయత్నించగా ఎస్‌పిఒలు మొత్తం కాన్వాయ్‌ను నిలిపివేసి డ్రైవర్లను కొట్టారు. సహాయ సామగ్రిని దోచుకున్నారు. ఈ కాన్వాయ్‌తో ప్రయాణిస్తున్న విలేకరులతో దురుసుగా ప్రవర్తించారు. ప్రభుత్వం తన ఫాసిస్టు స్వభావాన్ని నగ్నంగా ప్రదర్శిస్తూ తన మరో అంగం ద్వారా తన స్వంత పరిపాలనాధికారులనూ, వాళ్లు తీసుకెళ్తున్న సహాయ సామగ్రినీ కూడా ఆపేసింది. ఇదేదో స్థానిక ఎస్‌పిఒల లేదా పోలీసు అధికారుల దుందుడుకుతనం వల్లనో, దురుసుతనం వల్లనో జరిగింది కాదు. రాజ్యం ఇక్కడ తన రెండు ముఖాలనూ చూపాలనుకున్నది. ఒకవైపు ప్రజలను ఆదుకోవడానికి నిజాయితీగా పని చేస్తున్నట్టు కనిపించే పరిపాలనా శాఖ రూపంలో 'మానవీయ' ముఖం, మరోవైపు 'మావోయిస్టులపై కోపంతో వున్న ఆదివాసుల' రూపంలో ఫాసిస్టు దమనకాండను అమలు చేసే సల్వాజుడుం ముఖం. ఇది దాని 'హోల్డ్, కంట్రోల్, బిల్డ్' వ్యూహంలో భాగమే. సందర్భాన్ని, సమయాన్ని, అవసరాన్ని బట్టి అది ఏ ముఖంతోనైనా ముందుకొస్తుంది. ప్రస్తుత సందర్భంలో దానికి రెండూ అవసరమయ్యాయి. ప్రజల్ని చంపి, ఇండ్లు కాలబెట్టి, దోచుకొని ప్రజల్ని భీతావహ పరిస్థితుల్లోకి నెట్టెయ్యడమూ అవసరమే. మళ్లీ అదే ప్రజల్ని లొంగదీసుకొని పూర్తిగా తన అదుపాజ్ఞలలో సాగే 'సహాయ' కార్యక్రమాల చట్రంలోకి తేవడమూ అవసరమే. దీంతో పాటు 'పౌర సమాజం' అని చెప్పుకునే వాళ్లను, మీడియాను పక్కదారి పట్టిస్తూ ఇదంతా మావోయిస్టులకూ, సల్వాజుడుం వాళ్లకూ మధ్య ఘర్షణగా చూపించే ప్రయత్నం చెయ్యడమూ అవసరమే. ఇదంతా చేసి 'ఆదివాసులపై రాజ్యం ఇంతటి అమానుష దాడికి ఎందుకు పాల్పడింది' అని నిలదీయాల్సిన గొంతుల్ని బలహీనపర్చడమూ దానికవసరం. ఇలా అనేక దాడుల పరంపర ద్వారా ప్రజల్ని చంపీ, లొంగదీసుకొనీ క్రమంగా మావోయిస్టు వుద్యమాన్ని బలహీనపరుస్తూ నిర్మూలించడం, తాము అమలు చేయదల్చుకొన్న రాజకీయార్థిక 'అభివృద్ధి' నమూనాను ప్రజలపై నిర్దాక్షిణ్యంగా రుద్దడం – ఇదే సామ్రాజ్యవాదుల ఎల్ఐసి (తక్కువ తీవ్రత గల ఘర్షణ) వ్యూహం. ఇలా చూసినపుడు మాత్రమే ఛత్తీస్‌గఢ్‌లోని చింతల్‌నార్ ప్రాంతంలో పరిపాలనా శాఖ అధికారులు చేపట్టిన 'సహాయ' కార్యక్రమాలను గానీ, ఈ క్రమంలో చట్టం, పరిపాలన అని చెప్పుకునే రెండు విభాగాల మధ్య తలెత్తిన 'ఘర్షణ'ను గానీ అర్థం చేసుకోగలం.

## ప్రశ్నించే ప్రతి ఒక్కరినీ అడ్డుకోవడమే ఇక్కడ 'రూల్ ఆఫ్ లా'!

మావోయిస్టు ప్రభావిత ప్రాంతాల్లో 'రూల్ ఆఫ్ లా' (చట్టబద్ధ పాలన) ను నెలకొల్పడం తమ లక్ష్యమని హోంమంత్రి చిదంబరం తదితర నాయకులు తరచుగా అనడం మనం వింటుంటాం. ఎందుకంటే వాళ్లు చెప్పే ప్రకారం మావోయిస్టుల కారణంగా పరిపాలనా యంత్రాంగం నిష్క్రియమై పోయింది కనుక. 'చట్టం తన పని తాను చేస్తుంది' అని కూడా ప్రధానమంత్రి నుండి ముఖ్యమంత్రుల దాకా అందరూ వల్లిస్తుంటారు! చింతల్‌నార్ బీభత్సకాండ, ఆ తర్వాత నెల రోజుల పాటు జరిగిన పరిణామాల్ని పరిశీలిస్తే వీళ్లు చెప్పే 'రూల్ ఆఫ్ లా' ఎలాంటిదో స్పష్టంగా అర్థమవుతుంది.

మార్చ్ 26న సామాజిక కార్యకర్త స్వామి అగ్నివేశ్, ఆర్ట్ ఆఫ్ లివింగ్‌కు చెందిన రవిశంకర్ తదితరులు ఈ గ్రామాల్ని పర్యటించాలని ప్రయత్నించగా వాళ్లను దోర్నపాల్ దాటి పోనివ్వకుండా అడ్డుకున్నారు. వాళ్లపై కోడిగుడ్లు విసిరారు. అగ్నివేశ్ ప్రయాణిస్తున్న ఒక పోలీసు అధికారి వాహనంపై రాళ్లు రువ్వారు. అద్దాలు పగులగొట్టారు.

అగ్నివేశ్‌ను కారు నుండి బైటికి లాగారు. తలపై రాయి తగలడంతో ఆయన కిందపడ్డాడు. ఆయన తలపాగాను లాగేశారు. అడ్డువచ్చిన మీడియా వాళ్లను కొట్టారు. రాయపూర్ నుండి ప్రభుత్వ అనుమతి తీసుకొని, ముఖ్యమంత్రితో చర్చించి వచ్చినప్పటికీ స్వామి అగ్నివేశ్‌ను రెండు సార్లు ఇలా అడ్డుకొని కొట్టి అవమానపర్చారు. (1993లో మావులీభాట్ అనే గ్రామంలో ఒక కార్పొరేట్ కంపెనీ నిర్మించ తలపెట్టిన స్టీలు కార్ఖానా కోసం ఆదివాసుల భూముల్ని బలవంతంగా ఆక్రమించడానికి వ్యతిరేకంగా మాట్లాడడానికి బి.డి. శర్మ బస్తర్‌కు వచ్చినపుడు వచ్చినపుడు ఆయన మెడలో చెప్పుల దండ వేసి అవమానించి జగ్దల్‌పూర్ వీథుల్లో ఊరేగించిన సంఘటనను ఈ సందర్భంగా గుర్తు చేసుకుంటే అప్పటికీ, ఇప్పటికీ కార్పొరేట్ కంపెనీలకూ, ఆదివాసుల భూముల బలవంతపు స్వాధీనానికీ, రాజ్య ప్రాయోజిత ఫాసిస్టు మూకలకూ మధ్య ఉన్న అవిభాజ్య సంబంధాన్ని అర్థం చేసుకోవచ్చు.) ఫిబ్రవరి 11న నారాయణపూర్ జిల్లాలో మావోయిస్టు గెరిల్లాలు పట్టుకున్న ఐదుగురు పోలీసుల విడుదల సందర్భంగా రమన్‌సింగ్ ఇదే స్వామి అగ్నివేశ్‌కు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ఆయన చేసిన ప్రయత్నాలను ప్రశంసించాడు. కానీ ఆయన పోలీసుల పాశవికతను ప్రత్యక్షంగా చూడడానికి ప్రయత్నించడం మాత్రం ప్రభుత్వానికి ఏ మాత్రం నచ్చలేదు. పైగా, ఈ ఫాసిస్టు చర్యలన్నిటినీ కప్పిపెట్టడం కోసం ఛత్తీస్‌గఢ్ హోంమంత్రి నన్‌కీరాం కంవర్, స్వామి అగ్నివేశ్‌ను 'మావోయిస్టు'గా ప్రకటించి ఆయనపై తలా తోకా లేని ఆరోపణలు చేశాడు.

మార్చ్ 28న జిల్లా కలెక్టర్ ఆదేశంపై దోర్నపాల్ డిప్యూటీ తహసీల్దార్ విజేంద్ర పాటిల్ ఈ మూడు గ్రామాలకు సహాయ సామగ్రిని తీసుకెళ్లడానికి ప్రయత్నించగా ఆయన్ని కూడా పోలెంపల్లి దగ్గర ఆపేశారు. మార్చ్ 29న కాంగ్రెస్‌కు చెందిన 10 మంది ఎం.ఎల్.ఎ.ల బృందం ఈ గ్రామాల్ని పర్యటించే ప్రయత్నం చేయగా వాళ్లను కూడా ఈ గుంపులే అడ్డుకున్నాయి. వాళ్లతో పాటు ప్రయాణిస్తున్న ఐజీ లాంగ్‌కుమేర్ ఈ గూండాల్ని చెదరగొట్టడానికి ప్రయత్నించకుండా ఎం.ఎల్.ఎ.లనే ముందుకు వెళ్లవద్దని ఆపేశాడు. తాను స్వయంగా శిక్షణ ఇప్పించి, వేతనాలిచ్చి, పెంచి పోషించి, ఇనాములిచ్చిన గూండాలను ఈ ఐజీ కనీసం తోవకు అడ్డం రావద్దని కూడా ఆదేశించలేకపోయాడు! దీనిలోని అంతరార్థమేమిటో స్పష్టమే!

ఈ విధంగా మొత్తం ఐదు సార్లు బైటి నుండి రావడానికి ప్రయత్నించిన వేర్వేరు బృందాలను చింతల్‌నార్ ప్రాంతంలో అడుగుపెట్టనివ్వకుండా ఆపేశారు. ఇదంతా ముందే పన్నిన పథకం ప్రకారం జరిగిందని స్వామి అగ్నివేశ్ సహా చాలా మంది మీడియావాళ్లు స్పష్టంగానే పేర్కొన్నారు. ఛత్తీస్‌గఢ్‌లో, ప్రత్యేకించి బస్తర్ ప్రాంతంలో 'ప్రజాస్వామ్యం', 'పౌరహక్కులు' అనే మాటలు ఎంత అర్థరహితంగా మారాయో అర్థం చేసుకోవడానికి ఇంతకంటే వేరే ఉదాహరణలు అవసరం లేదు.

ఏప్రిల్ 2న గవర్నర్ శేఖర్‌దత్, డిజిపి విశ్వరంజన్‌లతో కలిసి రమన్‌సింగ్ ఈ ప్రాంత పర్యటనకు వచ్చాడు. ఆయన వెంట వందలాది కోయ కమెండోలు, ఎస్‌పిఒలు, కోబ్రా కమెండోలు కూడా వచ్చారు. ఎవరి పైనైతే ఈ అమానుష హింసాకాండకు పాల్పడ్డారన్న ఆరోపణ లున్నాయో సరిగ్గా వాళ్లు మాత్రమే రాగలుతారన్న మాట! ఎవరైతే రాయపూర్‌లో కూర్చుని ఈ బీభత్సకాండను అమలు చేయించారో సరిగ్గా వాళ్లకే ఈ ప్రాంతంలో అడుగు పెట్టే 'అనుమతి' ఉంటుందన్న మాట! ఏ సామాజిక కార్యకర్తకూ ఉండదు, మరే మానవహక్కుల నేతకూ ఉండదు! ఒక వైపు రమన్‌సింగ్ తన పనిలో ఉండగా మరో వైపు 'రక్షక' భటులు తాడిమెట్ల గ్రామానికే చెందిన మరో గూడెంలో ముందుగా నిర్ణయించుకున్న ప్రకారమే 20 ఇళ్లను దోచుకొని, ఒక మహిళపై అత్యాచారానికి పాల్పడి తమ 'పని' తాము పూర్తి చేసుకున్నారు. దీన్ని బట్టి ఎస్‌పిఒ, సల్వాజుడుం లేదా 'ఆదివాసుల' పేరుతో ఇక్కడ చేపట్టిన 'నిరసన' కార్యక్రమాలకు గానీ, ప్రజాస్వామికవాదులపైనా, ప్రజా శ్రేయస్సును కోరే పత్రికా విలేకరులపై పాల్పడ్డ దాడులకు గానీ 'స్క్రీన్ ప్లే' రచించింది ఎవరనేది మరింత బాగా అర్థం చేసుకోవచ్చు.

ప్రజల నుండి, ప్రజాస్వామికవాదుల నుండి వచ్చిన తీవ్ర నిరసన, కల్లూరిని శిక్షించాలంటూ వస్తున్న డిమాండ్‌ను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం దంతెవాడ ఎస్ఎస్‌పి కల్లూరిని ట్రాన్స్‌ఫర్ చేస్తూ డిఐజిగా ప్రమోషన్ ఇచ్చింది! నిజానికి కల్లూరి ఈ బీభత్సకాండకు పాల్పడడం వెనుక 2011 ఏప్రిల్ 6 వరకు ఎలాగైనా డిఐజి పదవిని మళ్లీ చేజిక్కించుకోవాలనే దురాశ కూడా ఒకటుంది. (గత సంవత్సరం ఏప్రిల్ 6న 76 మంది సీఆర్‌పీఎఫ్ బలగాల మరణానికి దారి తీసిన ఆంబుష్ జరిగిన తర్వాత కల్లూరిని డిఐజి పదవి నుండి తొలగించి ఎస్ఎస్‌పిగా నియమించారు.) కల్లూరితో పాటుగా కలెక్టర్ ఆర్. ప్రసన్నను కూడా ట్రాన్స్‌ఫర్ చేశారు. ఎందుకంటే చింతల్‌నార్ ప్రాంతంలో సహాయ సామగ్రి తీసుకెళ్లడానికి ప్రయత్నించి, విచారణకు ఆదేశించడం ద్వారా ప్రభుత్వానికి ఆయన ఏదో మేరకు 'అసౌకర్యం' కలిగించాడు కాబట్టి. ఈ పాశవిక చర్యలకు పాల్పడ్డ ఏ ఒక్క నేరస్తుడినీ అరెస్టు చేయడం గానీ, వాళ్లపై కేసులు నమోదు చేయడం గానీ చెయ్యలేదు.

కోయ కమెండోలంటే సల్వాజుడుం మొదలైన సమయం నుండి, అంటే 2005 నుండి ఎస్‌పీవో (ప్రత్యేక పోలీసు అధికారి) పేరుతో ప్రభుత్వ సాయుధ బలగాలలో భర్తీ అవుతున్న వాళ్ల నుండే ఎంపిక చేసిన వాళ్లతో ఏర్పాటు చేసిన ఒక ప్రత్యేక బలగం. రమన్‌సింగ్, విశ్వరంజన్, లాంగ్‌కుమేర్ తదితరులు వీళ్లపై అనేక సార్లు పొగడ్తల జల్లులు కురిపించడమే కాకుండా వీళ్లంటే తమకెంతో గర్వమని కూడా చెప్పుకున్నారు. మరోవైపు సర్వోన్నత న్యాయస్థానమేమో అసలు ఎస్‌పిఒ, కోయ కమెండోల నియామకం, శిక్షణల పైననే అభ్యంతరం చెప్పింది. వాస్తవానికి వీళ్లకు జమ్మూ-కాశ్మీర్‌లో రాష్ట్రీయ రైఫిల్స్, అంటే భారత సైన్యంతో, ఆంధ్రప్రదేశ్‌లో గ్రేహౌండ్స్‌తో శిక్షణ ఇప్పించారు. (ఆధారం – హిందీ పత్రిక ఇండియా టుడే, ఏప్రిల్ 6, 2011). ఈ బీభత్సకాండలో పాల్గొన్న కిచ్చ నంద, సూర్య, మర్కాం భీమ, తెల్లం అంద, మార, వంజం దేవ మొదలైన కోయ కమెండోలకు వ్యతిరేకంగా ఎంతో మంది ప్రజలు వాంగ్మూలాలిచ్చారు. వాళ్లను అరెస్టు చేయాలని డిమాండ్ చేశారు. కానీ దాన్ని పట్టించుకునే వాళ్లెవ్వరు? వాస్తవానికి ఇప్పటికే చాలా మంది కోయ కమెండోలపై అనేక కేసుల్లో అరెస్టు వారంటులు జారీ కాగా, వాళ్లు 'పరారీ'లో వున్న వాళ్లుగా ప్రభుత్వమే ప్రకటిస్తూ, వాళ్లకు ప్రతి నెలా క్రమం తప్పకుండా వేతనాలు కూడా చెల్లిస్తున్నది. వీళ్లే బస్తర్ గ్రామాల్లో ప్రతి నిత్యం బీభత్సకరమైన దాడుల్లో ఎలాంటి అడ్డూ లేకుండా పాల్గొంటున్నారు. ఇదే చిదంబరం, రమన్‌సింగ్, విశ్వరంజన్‌లు చెవులు చిల్లులు పడేలా అరిచే 'రూల్ ఆఫ్ లా'!

*(ఇంకా ఉంది)*

*(రచయిత దండకారణ్య ఉద్యమ నాయకులు)* వీ

*ఆదివాసులు చేస్తున్న కాఫీ తోటల స్వాధీన పోరాటానికీ, మొత్తంగా అడవిపై హక్కుల కోసం చేస్తున్న పోరాటానికీ ప్రజలంతా అండగా నిలబడాలని అంటున్నారు* **ఎం. నాగమణి**

# కాఫీ ప్లాంటేషన్ - ఆదివాసుల ఆందోళన

విశాఖ ఏజెన్సీ మన్యం సహజసిద్ధమైన వనరులకు, అటవీ సంపదలకు నిలయం. ఇక్కడి ఆదివాసులు తరతరాలుగా అడవినీ, భూమినీ, అటవీ సంపదలనూ నమ్ముకుని జీవనం సాగిస్తున్నారు. వారి ఆర్థిక, సామాజిక వ్యవస్థ, సాంస్కృతిక ఆచార సాంప్రదాయాలు అడవితో పెనవేసుకుని ఉన్నాయి. తల్లి బిడ్డల అనుబంధం ఎంత సహజమైనదో, అడవితో ఆదివాసులకున్న అనుబంధం కూడా అంతే సహజమైనది.

బ్రిటిష్ వలసవాదులు మన్య ప్రాంతంపై తమ పాలనను సుస్థిర పరచుకోవడానికి, తమ దారుణమైన దోపిడీని కొనసాగించడానికి, అడవిపై కఠినమైన చట్టాలు చేసి అత్యంత దారుణమైన అణచివేతకూ, నిర్బంధానికీ గురిచేసి ఆదివాసులను కట్టడి చేశారు. వారి భూమినీ, ఇతర సాంప్రదాయిక జీవనాధారాన్నీ లాగేసుకున్నారు. సాంప్రదాయికంగా వారి స్వాధీనంలో ఉన్న అటవీ సంపదను, ఖనిజాలను వారి నుండి సామ్రాజ్యవాదులు, దళారీ పెట్టుబడిదారులు, భూస్వామ్య వర్గాలు, వడ్డీ వ్యాపారులు, కాంట్రాక్టర్లూ, ప్రభుత్వాధికారులూ ఇతర దోపిడీదారులు (వీరంతా ప్రధానంగా బయటి నుంచి వచ్చిన వారే) బలప్రయోగంతో బయటకు తరలించారు. దాని ఫలితంగా ఆదివాసుల సాంప్రదాయిక ఆర్థిక వ్యవస్థ విచ్ఛిన్నమయింది. గనుల తవ్వకం, క్వారీల తవ్వకం, ప్లాంటేషన్లు, భారీ ప్రాజెక్టుల నిర్మాణం, ఇవి ఆదివాసుల జీవితాలను, జీవన ఉపాధులను ఘోరంగా దెబ్బతీసాయి. పైపెచ్చు వారిని సామాజికంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా నిర్లక్ష్యం చేశారు.

ఈ క్రమంలోనే వలసవాదుల దోపిడీ కొనసాగింపుగా భారత పాలకవర్గపు నూతన అటవీ చట్టాలను రూపొందించి ప్రవేశపెట్టారు. అడవిపై ఆదివాసులకున్న సాంప్రదాయక హక్కులను హరించివేశారు. అడవిపై ప్రభుత్వ గుత్తాధిపత్యం నెలకొల్పబడింది. మరోవైపు విశాల మన్యం ఆదివాసీ పేద ప్రజానీకానికి ఇప్పటికీ భూమి, అడవి దక్కలేదు. అడవిని అభివృద్ధి చేసే పేరుతో సామ్రాజ్యవాదుల అవసరాలకు పథకాలకు అనుగుణంగా వివిధ పేర్లతో రకరకాలుగా ప్లాంటేషన్లను ఏర్పర్చారు. అలాంటి ప్లాంటేషన్లలో చెప్పుకోదగ్గది కాఫీ ప్లాంటేషన్.

తమదైన అడవి, భూమి నుండి ఆదివాసులను దూరం చేసి సుమారు పదివేల ఎకరాల్లో కాఫీ ప్లాంటేషన్లు నెలకొల్పారు. ఫలితంగా వేలాదిమంది ఆదివాసులు, భూమి, అడవిని కోల్పోయి నిరాశ్రయులయ్యారు. కాఫీ తోటల్లో కూలీలుగా బతుకులు వెళ్లదీస్తున్నారు. నాలుగు దశాబ్దాలుగా స్థానిక ఆదివాసీలతో బాటు శ్రీలంక నుండి వచ్చిన తమిళ కాందిశీకులు కాఫీ తోటల్లో ఆరుగాలం కష్టించి, శ్రమ చేసి కాఫీ పంటలను ఉత్పత్తి చేస్తున్నారు. ఫలితంగా వారికి కూలీ డబ్బులు మాత్రమే చెల్లిస్తున్నారు. ప్రభుత్వం మాత్రం కోట్లాది రూపాయల లాభాలు ఆర్జిస్తున్నది. కూలీ డబ్బుల కోసం ఆదివాసులు, తమిళ కాందిశీకులు అనేకమార్లు ఆందోళనలు చేపడుతున్న పరిస్థితి కొనసాగుతోంది. ఈ నేపథ్యంలో అడవిపై హక్కు ఆదివాసీలదేననే నినాదంతో సంఘటితమై మర్రిపాకలు, బలపం, కుంకుంపూడి, కాఫీ ఎస్టేట్లను స్వాధీనపర్చుకుని, ఇక ఎంతమాత్రం కాఫీ తోటలలో కూలీలుగా కొనసాగమనీ, తమదైన అడవి భూమిపై హక్కు తమదేననీ గొంతెత్తి నినదిస్తున్నారు. వారి న్యాయమైన, ప్రజాస్వామికమైన డిమాండ్‌ను పరిష్కరించడంపోయి, వారిపై నిర్బంధం ప్రయోగించి, తప్పుడు కేసులు బనాయించి, జైళ్లలో బంధించడానికి రాష్ట్ర అటవీ అభివృద్ధి సంస్థ (ఎ.పి.ఎఫ్.డి.సి.), పోలీసులు కుమ్మక్కయ్యారు.

దీంట్లో భాగంగానే మర్రిపాకలు, బలపం, కుంకుంపూడి ఎస్టేట్ల పరిధిలో ప్రజలపై పోలీసుదాడులు, అక్రమ అరెస్టులు, తప్పుడు కేసులు బనాయించడాలు, అడ్డు అదుపు లేకుండా కొనసాగుతున్నాయి. తమ శ్రమను వెచ్చించి, ఉత్పత్తి చేసిన కాఫీ పంట వారికి దక్కనియకుండా చేయడం అన్యాయం. ప్రజల సంక్షేమమే ధ్యేయంగా చెప్పుకుంటున్న పోలీసు యంత్రాంగం ప్రజల ప్రయోజనాలకు విఘాతం కలిగించడం న్యాయమా? ప్రభుత్వాలు ఆదివాసులు పోరాడి సాధించుకున్న 5, 6 షెడ్యూల్డ్ చట్టాలను కూడా ఏమాత్రం దృష్టిలోకి తీసుకోకుండా ఆదివాసులను భూముల నుండి బేదఖల్ చేస్తున్నారు. ఆదివాసీ ప్రజానీకానికి కొద్దో గొప్పో మేలు చేసే నీతిమంత శాసనాలకు చట్టబద్ధంగా తల కొరివిపెట్టి, మంచిని తుంచి, మందిని ముంచి ఊరేగుతున్న ప్రభుత్వం ఆదివాసులను చట్టవ్యతిరేకులుగా చిత్రీకరించడం అప్రజాస్వామికం. తమకు న్యాయంగా దక్కాల్సిన కాఫీ తోటలకై ఉద్యమిస్తున్న ఆదివాసులంతా చట్ట వ్యతిరేకులనే ముద్రవేసి, లేగ దూడలపై ఎగబడ్డ తోడేళ్ల గుంపులాగా, ఆదివాసులను అక్రమ అరెస్టులకు గురిచేసి, తప్పుడు కేసులు బనాయించి, జైళ్లలో నిర్బంధించడాన్ని, వారి జీవన విధానానికి, భంగం కలిస్తున్న పోలీసుల పాశవిక దాడుల్ని అడ్డుకునేందుకు ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, విద్యార్థులు, మేధావులు క్రియాశీలంగా కదలాలి.

ఆదివాసులను కాఫీ తోటల దురాక్రమణదారులుగా ఎ.పి.ఎఫ్.డి.సి., పోలీసులు చేస్తున్న దుష్ప్రచారాన్ని నమ్మవద్దు. ఆదివాసులంటే ఈ నేలతల్లి ముద్దుబిడ్డలే. ప్రభుత్వం – ఎ.పి.ఎఫ్.డి.సి.ల కబంధ హస్తాల నుండి ఈ కాఫీ తోటల చెర విడిపించుకునేందుకు

*ఇటీవలి చర్చల నేపథ్యంలో సమాజ చలనంలో మనిషి పాత్ర, చరిత్ర క్రమంలో సమానత కోసం మనిషి చేసిన పోరాటాలను వివరిస్తున్నారు* **వీర బ్రహ్మాచారి**

# సోషలిజం భ్రమా? అవినీతి వాస్తవమా!

మధ్య ఆసియా అరబ్ దేశాల అగ్రరాజ్య అనుంగు నియంతల ఆధిపత్యాల మీద సామాన్య ప్రజల తిరుగుబాట్లు, అంతకుముందు నుంచే అగ్రరాజ్య అంతర్గత ఆర్థిక నిరుద్యోగ సామాజిక సంక్షోభాల సందర్భం. ఇక భారతానికి వస్తే పశ్చిమ బెంగాల్, ఆంధ్రప్రదేశ్‌లలో సెజ్‌లకు, పారిశ్రామిక కారిడార్‌లకు వ్యతిరేకంగా ప్రజలు ప్రాణాలను సైతం పణంగా పెట్టి పోరాడుతున్న సందర్భం. ఇంకా ఇరవయ్యవ శతాబ్దపు ఉత్తరార్థంలో బెంగాల్ రాష్ట్రంలో మార్క్సిస్ట్–లెనినిస్ట్–మావోయిస్ట్ తాత్విక భూమికతో రాజుకున్న నగ్జల్బరీ రాజకీయ ఉద్యమం. మధ్య భారతంలో మావోయిస్టు ఉద్యమంగా పరిణామం చెంది సామ్రాజ్య వాదుల స్వార్థ, విధ్వంసకర, ప్రతీఘాతుక అభివృద్ధిని అడ్డుకుంటూ, సామ్రాజ్యవాదుల అధినాయక అగ్రరాజ్యాధినేత చేతనే అభివృద్ధి 'చెందుతున్న' దేశం కాదు 'చెందిన' దేశం అని కితాబు ధృవీకరణ పత్రాన్ని అందుకున్నారు భారత దళారీ పాలకులు. దళారీతనాన్ని నెరపడానికి వశపడని స్థితిని కల్పిస్తూ భారతీయ సాంప్రదాయ, ఆధ్యాత్మిక చింతనాపరుల సానుభూతినీ ప్రశంసలనూ పొందుతున్న తరుణంలో...

పెటీ ప్రజాస్వామ్యవాదులు, పెటీ సామ్యవాదులు, పెటీ కమ్యూనిస్టులు, పెటీ శ్రామిక జనపక్షపాతులూ పుట్టుకొచ్చారు. సమాజోద్ధరణకు బయల్దేరారు. వాళ్లు తమ ప్రజ్ఞాపాటవాలతో పెటీ సామ్యవాద, శ్రామికజన పక్షపాత పత్రికల ద్వారా, సంస్థల ద్వారా ప్రైవేట్ పెట్టుబడిదారీ శ్రమదోపిడీ వ్యవస్థను నిలిపి ఉంచడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. ఇందుకుగాను కొందరు అపరిమిత నియంత్రణా ధికారం లేని ప్రభుత్వ పాలనా వ్యవస్థను ప్రతిపాదిస్తున్నారు. ఇప్పుడున్న ప్రభుత్వ 'అపరిమిత' నియంత్రణా ధికారం వాళ్లను కలవరపెడుతున్నది పన్నుల విషయంలోనే. పన్నులను కూడా ఎగవేసి

---

సంఘటితంగా, సమైక్యంగా కదులుతున్న ఆదివాసులకు మద్దతుగా, తోడుగా ఆదివాసుల పక్షం నిలబడాలి.

గత మూడు నాలుగు దశాబ్దాలుగా మన్యంలో కాందిశీకులుగా సిలోన్ ప్రజలు స్థిరపడి, స్థానిక ఆదివాసీ ప్రజానీకంతో కలిసి సహజీవనం చేస్తున్నారు. రెక్కాడితే గానీ డొక్కాడని స్థితిలో కాఫీ తోటల్లో కార్మికులుగా పని చేస్తూ, చాలీ చాలని వేతనాలతో జీవనం గడుపుతున్నారు. ఇక్కడి ఆదివాసీ ప్రజానీకంతో కలిసి కాఫీ తోటలు నాటడంలో, మొక్కలు పెంచి పోషించడంలో, వాటిని కాపాడడంలో, పంటను ఉత్పత్తి చేయడంలో మీ పాత్ర విస్మరించరానిది. ఫలితం పొందడంలో ఆదివాసులతో పాటు మీరు కూడా తీవ్రమైన శ్రమ దోపిడీకి గురవుతున్నారనే విషయం సుస్పష్టమే. శ్రమకు తగ్గ ప్రతిఫలం కోసం ఆదివాసీ ప్రజానీకంతో మమేకమయి, ఉద్యమించిన వీరు – ఆదివాసులతో పాటు రాజ్యయంత్రాంగం హింసకు, అణచివేతకు గురైనవారే. కనుక కాఫీ తోటలు వెలియడంలో, పంటను ఉత్పత్తి చేయడంలో సిలోన్ ప్రజల శ్రమ, కష్టం ఉంది. కనుకనే ఆదివాసులతో పాటు సిలోన్ ప్రజలకూ తోటల మీద హక్కు ఉంటుంది. ఉండి తీరాల్సిందే. కనుక కాఫీ తోటల స్వాధీనంకై పోరాడుతున్న ఆదివాసీ ప్రజానీకంతో చేయి చేయి కలిపి సిలోన్ ప్రజలు సాగాలి.

అయితే కాఫీ తోటలు ఆదివాసులు స్వాధీనపర్చుకుంటే మీరు ఉపాధి కోల్పోతారనీ, మీ బతుకులు దుర్భరమవుతాయనీ ఎ.పి.ఎఫ్.డి.సి., పోలీసులు చేస్తున్న దుష్ప్రచారాన్ని నమ్మక్కరలేదు. ఆదివాసుల విశ్వాసాన్ని చూరగొన్న మీకు వారిపట్ల అపనమ్మకం కలిగించే యాజమాన్య మోసపు ఎత్తుగడలను, కుట్రలను వమ్ముచేయాలి. కాఫీ తోటల మీద హక్కుకై జరుగుతున్న ఉద్యమంలో కలసి రావాలి.

మన్యం ప్రాంతంలోని అమూల్యమైన ఖనిజ సంపదలను, అటవీ సంపదలను, భూములను సామ్రాజ్యవాద బహుళజాతి కంపెనీలకు, భారత దళారీ నిరంకుశ బూర్జువా, భూస్వామ్య వర్గాలకు కట్టబెట్టే కుట్రలో భాగంగా అందుకు అడ్డువస్తున్న ప్రజలను తొలగించుకోవడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కొనసాగిస్తున్న గ్రీన్‌హంట్ ఆపరేషన్ ప్రజలపై యుద్ధం తప్ప మరొకటి కాదు. ఈ అన్యాయమైన యుద్ధాన్ని ఓడించాలి. బాక్సైటుకు వ్యతిరేకంగా కాఫీ తోటల స్వాధీనంకై పోరాడుతున్న ఆదివాసీ ప్రజానీకానికి మద్దతునీయాలి. భూమి, అధికారం, ప్రజాస్వామ్యం, స్వావలంబన నినాదాలతో దేశంలో నేడు అనేక ప్రాంతాలలో ఉవ్వెత్తున సాగుతున్న ప్రజా ఉద్యమాలను చూసి మేల్కొనాలి. వారితో చేతులు కలపాలి. మన్యం ఆదివాసీలు చేపట్టిన కాఫీ తోటల స్వాధీన పోరాటంలో భుజం కలపాలి. ఎ.పి.ఎఫ్.డి.సి.ని తరిమికొట్టకుండా కాఫీ తోటలు ప్రజలచేతికి రావు. ప్రజా ఐక్యతను దెబ్బతీసే కుట్రలో భాగంగా యాజమాన్యం, పోలీసులు చేపట్టే సంస్కరణలను తిప్పికొట్టి, కాఫీ తోటలను ఆదివాసులు సంపూర్ణంగా స్వాధీనం చేసుకోవాలి. ఆ ఆదివాసుల ఆకాంక్షనూ, పోరాటాన్నీ సమర్థించడం బయటి సమాజంలోని ప్రజల, ప్రజాస్వామిక వాదుల బాధ్యత.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

సంపదను స్విస్‌బ్యాంక్‌లోనో, స్వచ్ఛంద సంస్థలలోనో దాచుకునే అవకాశాలు కల్పిస్తున్నంతటి 'నిరంకుశ అపరిమిత నియంత్రణాధికారం' గల ఈ ప్రభుత్వ వైఖరులూ ఆయాసంగానే ఉన్నాయి.

అదట్లుంచి 19వ శతాబ్దపు చివరార్ధంలో, 20వ శతాబ్దారంభాల్లో వలస పాలనలకు వ్యతిరేకంగా మూడో ప్రపంచ దేశాలు – జాతీయ స్వాతంత్ర్యోద్యమాలకు నాయకత్వం వహించిన విశ్రాంత స్థానిక భూస్వామ్యవర్గాలు – అంతకు కొద్దిముందే వచ్చిన సోషలిస్టు సిద్ధాంత ఆధారిత ప్యారిస్ కమ్యూన్, రష్యా (చైనా) విప్లవాలకు భయపడి ముందుచూపుతో స్వాతంత్ర్యానంతరం ప్రజాస్వామ్య, సంక్షేమ రాజ్యాలను ప్రకటించుకున్నాయి. ప్రైవేట్ పెట్టుబడిదారీ వ్యవస్థను నిలిపి ఉంచే ఈ రాజ్యాలు పెట్టుబడిదారీ వ్యవస్థ మూలసూత్రమైన శ్రమదోపిడీని నిరాటంకంగా కొనసాగించడానికి ప్రజలకు అనేక సంక్షేమ పథకాలను ప్రకటించాయి. కాల క్రమంలో పెట్టుబడిదారీ ఆధిపత్య వ్యవస్థలోని సహజమైన 'అవినీతి'కి ఆ పథకాలు విఫలమవుతుంటే ప్రజలలో అసహనం, నిరసన పెరుగుతుంటే దేశీయ, అంతర్జాతీయ పెట్టుబడిదారీ పాలకవర్గాల నమ్మినబంట్లయిన ఆర్థికరంగ మేధావులు ఎప్పటికప్పుడు 'ఆహఁ హాఁ అట్లాకాదు ఇట్లా. అదీ కాదు ఇదీ' అని కొంగొత్త పథకాలను సవరణలను ప్రతిపాదిస్తున్నారు. ఇందుకుదాహరణ, ప్రజా పంపిణీ వ్యవస్థ (పి.డి.ఎస్.) విఫలమయ్యిందనీ, పబ్లిక్‌రంగంలో విద్యా వైద్య సేవలు విఫలమయ్యాయనీ 'షరతులకు లోబడిన' నగదు బదిలీ పథకాల్ని (కండిషనల్ కాష్ ట్రాన్స్‌ఫర్) ప్రతిపాదిస్తున్నారు మాంటెక్ సింగ్ అహ్లువాలియా. ఆరోగ్యశ్రీ, విద్యాశ్రీ వంటి పథకాలను ప్రవేశపెట్టారు రాజశేఖరరెడ్డి, కపిల్ సిబాల్‌లు.

దోపిడీ దళారీ ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక విధానాలపై ప్రజలు తిరగబడుతున్నారు. ఆ వైఖరి క్రమంగా దెబ్బకు దెబ్బ, హింసకు ప్రతిహింసల రూపం తీసుకొని ఇదివరకే కొన్ని ప్రాంతాల్లో ఉద్యమాలు ఊపందుకున్నాయి. ఆ ఉద్యమాలు విస్తరించి మొత్తం దేశీయ సమాజం యుద్ధభూమియై, ఎంత మానవ హననం జరుగుతుందోననే ఆందోళనతో కొందరు నిజాయితీగా, మరికొందరు దోపిడీ మూలాధారిత పెట్టుబడి శ్రేణుల ఉనికికి రక్షణ కవాటంగా ఉద్యమ సంస్థలను స్థాపిస్తున్నారు. ఉద్యమాలను చేపడుతున్నారు.

పైన పేర్కొన్న మొదటి తరహా నిజమైన అవినీతి వ్యతిరేక సంస్థలను స్థాపిస్తున్న వాళ్లకు, ఉద్యమాలను చేపడుతున్న వాళ్లకు మనిషి సామాజికాభివృద్ధికి చెందిన చారిత్రక పరిణామ క్రమం తెలియదనో ఆ 'సోదంతా' ఎందుకని తెలుసుకో నిరాకరిస్తున్నారనో అనుకోవలసి వస్తోంది. అది తెలిస్తే తప్ప అసలు అవినీతి మూలాలు ఏమి? అవినీతి నిర్వచనం ఏమి? మానవజాతి అభివృద్ధి చారిత్రక పరిణామాన్ని చర్విత చర్వణమే అయినా క్లుప్తంగానయినా ప్రస్తావించాలి.

ప్రకృతిలోని జీవరాసులన్నీ, ఒకే భౌగోళిక భౌతిక పరిస్థితులలో జన్మించినప్పటికీ ఒకే జాతికి చెందినవి కూడా స్వల్పంగానయినా భిన్న ఆకృతి పరిణామాలతో ప్రజ్ఞా సామర్థ్యాలతో పుట్టి పెరిగి నశిస్తున్నాయి. అది భౌతికవాదమయినా భావవాద ప్రకారమయినా ఇది సత్యం. అట్లే భూమ్మీద మనుగడలోనున్న జీవరాసులన్నిటిలో మనిషి మాత్రమే అత్యంత అభివృద్ధి దశకు చేరుకున్నాడు. ఇక్కడ అభివృద్ధి అంటే సృష్టిలోని అన్ని జీవరాసులను తన నియంత్రణలోకి, తనకుపయోగపడే విధంగా మలుచుకోగలిగిన మనిషికి సంబంధించినది.

అయితే కదిలేజీవులు మనిషి అయినా, పులుగు పక్షి, జంతువులైనా ప్రకృతి నుండి, ఇతర జీవుల నుండి రక్షణకోసం, భద్రమయిన, సుఖమైన జీవనం కోసం సమూహాలు కట్టడం, జీవించడం నేర్చుకున్నాయి. మనిషి ఆ సమిష్టి జీవనంలో కూడా సాటి వారికంటే తనకూ, 'తనవారికీ', తన భవిష్యత్తరాలకూ కూడా మరింత సుఖమైన, భద్రమైన జీవనం కోసం అర్రులుచాచే విచిత్రమైన, అతితెలివి జీవి అయ్యాడు. జంతువులలో లేని ఇదొక చిత్రమైన వంకర అభివృద్ధి పరిణామం.

ఈ అభివృద్ధి క్రమంలో సమిష్టి జీవనంలో ఇతర జీవజాతుల తోనే గాక స్వజాతిలో కూడా ఐక్యత, ఘర్షణలను కలిగి ఉన్నాడు మనిషి. పరిణామ క్రమంలో ఐక్యత కంటే ఘర్షణే ఎక్కువయి బయటికి ఐక్యత, అంతరంగంలో ఘర్షణ గల వంకర బౌద్ధిక స్థితికి మనిషి చేరుకున్నాడు. ఆ ఘర్షణను నివారించడానికి ప్రభుత్వాలను పాలక వ్యవస్థలను ఏర్పర్చుకున్నాడు. ఈ నడుమ బలవంతుడిదే రాజ్యం సర్వస్వం, 'రాజ్యం వీరభోజ్యం' అనే రాచరిక ఫ్యూడల్ వ్యవస్థలు వచ్చిపోయాయి. ఆ ప్రభుత్వాలకు సమిష్టి సామాజిక పాలనకు సంబంధించిన నియమాలను, చట్టాలను, వాటిని అమలుపరచడానికి పాలనా యంత్రాంగాలను ఏర్పాటు చేసుకొని, ప్రభుత్వాలకు నియంత్రణ అమలు అధికారాలను కట్టబెట్టాడు.

ఇక ఇప్పుడు ఒక మేధావి మేధో మధనం ప్రకారం ప్రభుత్వ నియంత్రణలేని స్వేచ్ఛా ప్రైవేట్ పెట్టుబడిదారీ వ్యవస్థ అంటే – ప్రకృతి సిద్ధ, జన్మతాసిద్ధించిన (భిన్న) మానసిక భౌతిక శక్తుల ప్రకారం ఎవరికి చేతనైనంత శ్రమచేసి, సమిష్టి శ్రమ క్రమంలో సాటి మనుషుల మీద చేతనైనంత నియంత్రణ పెత్తనం చేసి అదరగొడుతూ, తాత్కాలిక అవసరానికి మించి ఉత్పత్తి అయిన మిగులును స్వంతం చేసుకోవడం, నిలువ చేసుకోవడం 'అనుభవించడం'. అదే మేధావి ఉటంకించిన ఏరు ఇసుక ఉదాహరణ! 'ఎవరయినా ఎక్కువ ఇసుక ఎందుకు తీసుకుపోతారు' అని 'అమాయకంగా' అడుగుతారు. సదరు మేధావి కాంక్షించే దోపిడీ స్వేచ్ఛగల వ్యవస్థలో తప్పకుండా తీసుకపోతారు. అట్లా తీసుకెళ్లి పోగు చేసుకొని కృత్రిమ కొరత సృష్టిస్తారు. డిమాండ్ పెంచుతారు. ఎక్కువ ధరకు అమ్ముకుంటారు. తద్వారా తనకూ, తనవారికీ, భవిష్యత్ తరాలకూ సాటి వారికంటే సుఖప్రదమైన భద్రతతో కూడిన జీవనం ఇవ్వాలనుకుంటారు.

అవసరమున్నప్పుడు, అవసరమున్నంత మాత్రమే తీసుకోవడం నిలువ ఉంచుకోకపోవడం అనేది జంతులక్షణం. అవసరం కంటే ఎక్కువ ఉత్పత్తి చేయకపోవడం కూడా జంతులక్షణం. కాని మనిషి అభివృద్ధి అట్లా కాదు. జంతువులు ప్రకృతిని జయించలేవు. ప్రకృతికి అనుగుణంగా ఒదిగి జీవిస్తాయి. మనిషి చాలావరకు జయించాడు. ప్రకృతిని, ఇతర జీవరాసులను ధ్వంసం చేసయినా తాత్కాలిక అవసరానికి మించి అదనపు ఉత్పత్తినీ, మిగులునూ సాధించాడు. నిలువ చేసే పద్ధతులనూ నేర్చుకున్నాడు. ఈ 'విజయాన్నే' అభివృద్ధి అంటున్నాం.

జంతువులతో పోల్చి చూసుకొని మనిషి జీవులలోకెల్లా అభివృద్ధి చెందిన ప్రాణే అనుకుంటే, ఈ అభివృద్ధి జంతువులకంటే ప్రశాంతంగా, ఆందోళనరహితంగా, ఘర్షణారహితంగా ఉండాలి. అసలు అభివృద్ధి అంటేనే, జంతువులతో పోల్చుకోకుండానే, క్రితం కంటే మరింత

ఆందోళనారహిత, ప్రశాంత, భద్రమైన స్థితివైపు ప్రయాణం. కాని జరిగింది, జరుగుతున్నది అందుకు పూర్తిగా భిన్నం. రోజురోజుకీ భద్రతారాహిత్యమూ, ఆందోళనే ఎక్కువ అవుతున్నాయి. ఈ అభద్రత మనిషేతర ప్రాణుల నుండి కాదు. మనిషి నుండే.

మనిషి ఈ స్థితిని సుమారు రెండున్నర సహస్రాబ్దాల క్రితమే చూసి కలతచెంది బుద్ధుడు మానవాళి అనుభవిస్తున్న ఈ భద్రతా రాహిత్యం, వైషమ్యం – దుఃఖాలకు మూలం ఆశ, కోరికలేననిన ఈ దుఃఖ విముక్తి కోసం కోరికలను జయించాలనీ, కనీసం నియంత్రిం చాలనీ, పరిమితం చేయాలనీ అన్నాడు. 'ఇది స్వచ్ఛందంగా జరగాలని' అన్నాడు. ఈ కోరికలను జయించగలిగిన స్థితినే 'నిర్యాణం' అని ఉంటాడు. ఇక్కడ జయించడం, నియంత్రించడం అంటే మనిషి తను నివసిస్తున్న పర్యావరణ జీవావరణ స్థితిని భంగపరచకుండా, వీలైనంత తక్కువ, అవసరమున్నంత వరకే (మీగర్ అండ్ ఫ్రూగల్ విత్ రెస్పెక్ట్ టు నేచర్) ఉపయోగించుకుంటూ సమతుల్యాన్ని కాపాడుతూ, సాటి మనుషుల ఈర్ష్యాద్వేషాలకు తావివ్వని సాధారణ సమానత్వ జీవనమే.

మార్క్స్ మనిషికి అటువంటి ప్రకృతి పర్యావరణ స్పృహతో కూడిన సమతుల్య జీవన విధానం సూటిగా చెప్పిండో లేదోగాని, మానవజనిత అసమానతలు తద్వారా ఈర్ష్యా ద్వేషాలు, ఘర్షణలు లేని సమసమాజాన్ని – అంతిమంగా కమ్యూనిజంను ప్రతిపాదించాడు. అటువంటి సామాజిక వ్యవస్థ కేవలం ఉత్పత్తికి మూలమయిన శ్రమజీవుల నియంతృత్వంతోనే సాధ్యమవుతుందని అన్నాడు. ఇందులో కోరికలను నియంత్రించు కోవాలనే ప్రస్తావన సూటిగా లేకపోవచ్చుగానీ అటువంటి సర్వేజనా 'సుఖినోభవంతు సమసమాజం' సాధ్యం కావడానికి సమిష్టి జీవనంలో, కమ్యూన్‌లో కోరికలను నియంత్రించుకోవలసి ఉంటుందనే సూచనను అన్వయించుకోవచ్చు. అయితే కోరికలను స్వచ్ఛందంగా నియంత్రించు కోవడం, అష్టాంగ మార్గం అనేది అదివరకే 2500 ఏండ్ల క్రితం బుద్ధుడు చెప్పినది అసాధ్యమని చరిత్ర సూచించింది కనుక ఆ నియంత్రణ నియంతృత్వం ద్వారానే సాధ్యం అన్నాడు. స్వచ్ఛంద నియంత్రణలో కూడా మనిషికి తన మీద తనకు నియంతృత్వమే కావాలి మరి.

బుద్ధుడు చెప్పిన నాటికే గాదు మార్క్స్ చెప్పిన నాటికి జనాభా సమస్య లేదు. (1921 జనాభా విస్ఫోటక సంవత్సరం.) స్వచ్ఛందంగా నయినా, నియంతృత్వంగా నయినా సంతాన నియంత్రణ ఉండాలని రెండు వాదాల ద్వారా అన్వయించుకోవచ్చు. సోషలిస్టు విప్లవం విజయవంతం చేసుకొన్న దేశాల్లో అన్వయించుకున్నారు కూడా.

సమిష్టి జీవనంలో వ్యక్తి అపరిమిత స్వేచ్ఛకు అవకాశం లేదు. నడవదు. ఎంతో కొంత వ్యక్తి 'స్వేచ్ఛ' హరించబడు తుంది. అట్లే సోషలిజం అంటే మనుషుల మధ్య ఆర్థిక సమానత్వమే గాదు, మానవ జాతిని పర్యవేక్షించి ఉన్న మనుగడకవసరమైన జీవావరణ పర్యావరణంలో కలిసి ఉన్న సమగ్ర సమతుల్యత.

వ్యక్తి స్వేచ్ఛా ప్రైవేట్ పెట్టుబడిదారీ 'ప్రజాస్వామ్య' దోపిడీ వ్యవస్థ నయినా, సామ్యవాద వ్యవస్థయినా నిలిపి ఉంచాలంటే అపరిమిత అధికారాలుగల జోక్యం గల ప్రభుత్వ పాలనా యంత్రాంగం ఉండాలి. అది నియంతృత్వంగానే ఉండవలసి వస్తుంది. సోకాల్డ్ ప్రజాస్వామ్య వ్యవస్థలు నియంతృత్వంగానే ఉన్నాయి కూడా.

సహస్రాబ్దాల క్రితం బుద్ధుడు చెప్పింది, శతాబ్దంన్నర క్రితం మార్క్స్ చెప్పింది నేటికీ సాధ్యం కాలేదు. మార్క్స్ చెప్పిన వర్గ పోరాటం కొనసాగు తూనే ఉంటుంది. వర్గపోరాటమంటే కేవలం అదనపు మిగులు ఉత్పత్తిని స్వంతం చేసుకొని శారీరక శ్రమచేయకుండా ఉన్నవాళ్లకు, సామాజిక ఉత్పత్తికోసం నిరంతరం శారీరక శ్రమచేస్తూ ఏమీ మిగుల్చుకోని శ్రామికు లకు మధ్యన జరిగే భౌతిక సాయుధ సంఘర్షణ మాత్రమే కాదు.

ఆర్థిక అసమానతలున్న వ్యవస్థలో స్నేహితుడు, బంధువు – పాలివాడు, శత్రువు; స్వపక్షం – విపక్షం; దొరలు, దాతలు – దొంగలు, గూండాలు నాణానికి ఇరు పార్శ్వాల లాగ ఉంటారు. ఇక్కడో సుమతి శతక పద్యం గుర్తు చేసుకోవాలి. 'ఎప్పుడు సంపద కలిగిన అప్పుడు బంధువు వత్తు...' బంధువులే గాదు దొంగలూ, శత్రువులూ వస్తారు. తీవ్రవాదులు, ఉగ్రవాదులు సృష్టించబడుతారు. అంతేగాదు, ప్రకృతిలో సహజ సిద్ధమైన ఆహార లభ్యత కొరవడినపుడు కుక్కలు, కోతులు చాటుమాటుగానో దౌర్జన్యంగానో వస్తాయి. అట్లా వర్గపోరాటం అంటే సంపద జీవితావసరాల అసమాన పంపిణీ నిల్వలు గల ముఖ్యంగా మనుషుల నడుమ ఉండే విజ్ఞాపన, సత్య–ఆగ్రహం, ధర్నా, ర్యాలీ, సమ్మె బహిష్కరణలు – దొంగతనం, గూండాయిజం, దౌర్జన్యం, అవినీతి, ఇతరుల కోసం వేతనానికి చేసే పనిలో అలసత్వం వంటివన్నీ స్థాయీ భేదాలతో ఉండే వర్గపోరాట రూపాలే. వర్గపోరాటమనే నాణానికి రెండు పార్శ్వాలే.

నైపుణ్యంగల, నైపుణ్యంలేని శ్రమల పేరుతో శ్రమను విభజించి, నైపుణ్యం గల శ్రమకు ఆధారం 'నైపుణ్యం లేని' శ్రమనే అనేది మరిచి – మసిపూసి మాయ జేసి మరిపించి ఉత్పత్తి సేవల అసమ పంపిణీలోని అన్యాయాన్ని ప్రస్తావించకుండా, అవినీతికి అసలు నిర్వచనం చెప్పు కోకుండా, ఘర్షణ కారకాలను నిరాకరిస్తూ అవినీతి వ్యతిరేక సంస్థలను, ఉద్యమాలను నిర్మించడం. 'పేద ప్రజల' సంక్షేమం కోసం సబ్సిడీలు, నగదు బదిలీలు, దాన ధర్మాలు, ధార్మిక స్వచ్ఛంద సంస్థలు, సంక్షేమ రాజ్యాలు వెరసి మొదలైనవన్నీ నొప్పి నివారణా మార్గాలే కాగలవు గాని నొప్పి నిర్మూలనా కార్యక్రమాలు కాజాలవు.

ఇవన్నీ తెలిసి చేసినా, తెలియక చేసినా అసలు సామాజిక చలనాన్ని కప్పి ఉంచే, వాస్తవ అభివృద్ధి జ్ఞానాన్ని వాయిదా వేసే అజ్ఞాన మూర్ఖత్వాలే. అంతిమంగా, అభివృద్ధి అంటే సమానత్వం. సమానత్వమే అభివృద్ధి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

*సామ్రాజ్యవాద దేశాలకు సింహస్వప్నంగా పరిణమించిన ఒసామా బిన్ లాడెన్ జీవితం, జీహాద్‌ల నేపథ్యం వివరిస్తున్నారు* **పి. ప్రసాద్**

# లాడెన్‌పై సామ్రాజ్యవాదుల నిందా ప్రచారాలు

*(గత సంచిక తరువాయి)*

దురాక్రమణ సేనలు గెరిల్లా పోరాటం ముందు నిలబడలేక పారిపోతున్న సమయమది. అప్పుడు క్రమానుగత ఉపసంహరణ ఒప్పందం ఎందుకని లాడెన్, అతన్ని అనుసరిస్తున్న ఆఫ్ఘన్ ముజాహిదీన్లు ప్రశ్నించారు. ఇంతకాలం జీవన్మరణ పోరాటం చేస్తున్న ఆఫ్ఘన్ విమోచనా శక్తులతో సంప్రదించకుండా ఏకపక్ష ఒప్పందాలు ఎందుకు చేశారని నిలదీశారు. ఆఫ్ఘన్ ప్రజల ప్రమేయం లేకుండా సోవియట్ యూనియన్‌తో ఒప్పందం చేసుకునే అధికారం అమెరికాకి ఎవరిచ్చారని నిరసించారు. సోవియట్ కీలుబొమ్మ ప్రభుత్వ స్థానంలో అమెరికా కీలుబొమ్మ ప్రభుత్వ ఏర్పాటును తాము ఆమోదించబోమని హెచ్చరించారు. నజీబుల్లా ప్రభుత్వం మీద గెరిల్లా పోరాటాన్ని ఉపసంహరించాలన్న రబ్బానీ, మసూద్, దోస్తుం తదితర పాతతరం ఆఫ్ఘన్ నేతలిచ్చిన పిలుపును ఖాతరు చేయబోమని స్పష్టం చేశారు. ఫలితంగా ఆఫ్ఘన్ ముజాహిదీన్లలో చీలిక వచ్చింది. పాతతరం అమెరికా, పాకిస్తాన్‌లను అనుసరించింది. యువతరం లాడెన్ అనుసరించింది. (ఈ యువతరమే మరో నాలుగైదు ఏండ్ల తరువాత తాలిబన్ల పేరుతో కొత్త సంస్థను నిర్మించుకోవడం గమనార్హం.)

పైన పేర్కొన్న 'క్రమానుగత సేనల ఉపసంహరణ ఒప్పందానికి' ఒక రాజకీయ నేపథ్యం ఉంది. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ (సి.పి.ఎస్.యు.) 25వ మహాసభలు (1975) విదేశాంగ విధానంలో దూకుడు (అగ్రెసివ్ ఫారెన్ పాలిసీ) విధానాన్ని ఆమోదించింది. అఫ్ఘనిస్తాన్ దురాక్రమణకి ఈ తీర్మానంలో పునాది ఉంది. 26వ మహాసభలు (1980) కూడా ఈ దూకుడు విధానాన్నే ధృవీకరించాయి. కానీ ఐదేండ్ల ఆఫ్ఘన్ గెరిల్లా ప్రతిఘటనకే సోవియట్ యూనియన్ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సైనిక రంగాలు అస్థిరతకు గురయ్యాయి. అందుకే 27వ సి.పి.ఎస్.యు. మహాసభలు (1985) తన పూర్వ దూకుడు విధానాన్ని సమీక్షించింది. పునరాలోచనలో పడింది. (ఇది మరింత దిగజారి, తర్వాత గోర్బచెవ్ చే పెరిస్త్రోయికా, గ్లాస్‌నాస్ట్‌లకు దారితీసింది.) ఈ 27వ మహాసభల తీర్మానాల స్ఫూర్తితో అఫ్ఘనిస్తాన్‌కొక పరిష్కారాన్ని వెదికింది. ఆఫ్ఘన్ నుంచి గెరిల్లాల చేత తమ సేనలు తరిమి వేయబడితే, నాటి యు.ఎస్.ఎస్.ఆర్. లోని మధ్యాసియా ముస్లిం రిపబ్లిక్కులు కూడా చేజారి పోతాయని అంచనా వేసింది. అందువల్ల అఫ్ఘనిస్తాన్‌ను శాంతియుతంగా క్రమపద్ధతిలో అమెరికాకు అప్పగిస్తే తమ దేశానికి తక్షణ ముప్పు ఉండబోదని యు.ఎస్.ఎస్.ఆర్. అంచనా వేసింది. ఈ నేపథ్యంలో ఆనాటి రెండు అగ్రరాజ్యాల మధ్య లాలూచీ ఒప్పందం కుదిరింది. సోవియట్ యూనియన్ తొలుత అఫ్ఘనిస్తాన్‌ను భక్షించజూసింది. తానే విచ్ఛిన్నమయే పరిస్థితి వచ్చింది. తన చేతులతోనే అఫ్ఘనిస్తాన్‌ను అమెరికా పళ్లెంలో పాయసంగా పెట్టజూసింది. అందుకు పరిష్కారంగా తమ దేశ సమగ్రతను కాపాడుకోజూసింది.

ఆఫ్ఘన్ జాతికి విద్రోహం చేసే ఈ ఒప్పందాన్ని జాతీయవాద స్ఫూర్తితో ఆఫ్ఘన్ యువ ముజాహిదీన్లు వ్యతిరేకించారు. జాతులు విముక్తినీ, ప్రజల విప్లవాన్నీ దేశాలు స్వాతంత్ర్యాన్నీ కోరడం విప్లవకర మైనదన్న మావో సిద్ధాంతీకరణకి ఇది అనుగుణ్యమైనదే. దీనిని ప్రపంచ విప్లవ ప్రజాతంత్ర శక్తులన్నీ స్వాగతించి, బలపరచాలి. ఒక అగ్రరాజ్యం (అమెరికా) అండతో మరో అగ్రరాజ్య (సోవియట్ యూనియన్) దురాక్రమణ మీద జీహాద్ పతాకం కిందనే ఆఫ్ఘన్ ముజాహిదీన్లు పోరాడారు. దానిని ప్రపంచ విప్లవ శక్తులు నిండు హృదయంతో బలపరిచాయి. కానీ అంతవరకూ ప్రచ్ఛన్న యుద్ధం సాగించిన రెండు అగ్రరాజ్యాలు కుమ్మక్కై ఒక నెత్తురోడుతున్న బడుగు జాతిపై ఉమ్మడి కుట్రకు దిగాయి. ప్రపంచ విప్లవ శక్తులు గతం కంటే రెట్టింపు మద్దతివ్వాలి. దురదృష్టకరమైన విషయమేమిటంటే ప్రపంచ ప్రగతిశీల శక్తులు కూడా ఈ పరిణామాన్ని గతితార్కిక దృష్టితో విశ్లేషించలేక పోవడం. అఫ్ఘనిస్తాన్ జాతి జనుల గుండె చప్పుళ్లను అర్థం చేసుకోలేకపోయాయి.

### ఇస్లాం రాజ్యానికి ఖలీఫా అయ్యేందుకే ఆల్‌ఖైదాను స్థాపించాడా?

ఆల్‌ఖైదాను స్థాపించడానికి లాడెన్‌కు పెద్ద పదవీ వ్యామోహం ఉందంటూ అమెరికా మీడియా ప్రచారం సాగించింది. ఇస్లాం దేశాలన్నింటినీ ఒకే సామ్రాజ్యంగా మార్చే లక్ష్యం లాడెన్‌కు ఉండేదట. దానికి తాను ఖలీఫా (ప్రభువు) కావాలన్న కోర్కె ఉండేదట. అట్టి లక్ష్య సాధనకే ఆల్‌ఖైదాను స్థాపించాడట. తద్వారా ప్రస్తుతం తన ఉప్పు, పప్పులు తిని చెప్పినట్లు నడుస్తున్న ఇస్లాం దేశాల అమీర్లు, షేకులు, సుల్తాన్లు, నవాబులను లాడెన్ మీద బాగా రెచ్చగొట్టారు.

అమెరికా – యు.ఎస్.ఎస్.ఆర్. విద్రోహ ఒప్పందాన్ని వ్యతిరేకిస్తూ లాడెన్ దర్శకత్వంలో ఆఫ్ఘన్ యువ ముజాహిదీన్లు గెరిల్లా పోరాట కొనసాగింపుకు సిద్ధమయ్యారు. అక్కడే లాడెన్ ఉండాలని యువ ముజాహిదీన్లు కోరుకున్నారు. కానీ లాడెన్ దృష్టి అఫ్ఘనిస్తాన్‌కే పరిమితం కాలేదు. ఒక చిన్న ఇస్లాం దేశానికే ప్రతిఘటనను పరిమితం చేయడం

వల్ల అమెరికా ఆధిపత్యాన్ని దెబ్బతీయలేమని భావించాడు. గెరిల్లా పోరాటం కొనసాగింపుకు సిద్ధపడ్డ ఆఫ్ఘన్ ముజాహిద్దీన్ యువ నాయకత్వంతో సంప్రదించాడు. వారిని ఒప్పించాడు. తాను అఫ్ఘనిస్తాన్ నుంచి కదిలి ముందు తగు ఏర్పాట్లు చేశాడు.

అరబ్ దేశాల నుంచి వచ్చిన గెరిల్లా యోధుల్లో అత్యధిక శాతం మంది అప్పటికే తమ స్వంత దేశాలకి వెళ్లిపోయారు. అమెరికా, పాకిస్తాన్ దేశాలు గెరిల్లా పోరాట విరమణకి పిలుపునిచ్చిన నేపథ్యంలో ఈ పరిణామం జరిగింది. అమెరికా అనుకూల అరబ్ ప్రభుత్వాలన్నీ తమ వాళ్లను పాక్, అమెరికాల సాయంతో వెనక్కి రప్పించుకున్నాయి. వెనక్కి వెళ్లిపోయిన వేలాది మందిలో సగం మంది తమ ప్రభుత్వాల ప్రభావంతో వెళ్లారు. రెండు అగ్రరాజ్యాల కుమ్మక్కు ఒప్పందం పట్ల పెదవి విరుస్తూనే, ఇంకెంత కాలం ఆఫ్ఘన్‌లో ఉండగలమనుకుంటూ మరో సగం మంది తమ మాతృదేశాలకు వెళ్లిపోయారు. అయితే కొద్దిశాతం మంది మెరికల వంటి అరబ్ యోధులు వెనక్కి వెళ్లడానికి ససేమిరా అన్నారు. ఒక్క అగ్రరాజ్యం మీద పోరాటానికె ఒకప్పుడు తాము సర్వస్వం వదిలేసి అఫ్ఘనిస్తాన్‌కి వచ్చామన్నారు. ఇప్పుడు రెండు అగ్రరాజ్యాలు ఉమ్మడిగా ఆధిపత్యం చెలాయిస్తుంటే ఎలా స్వంత దేశాలకి వెళ్లిపోగలమన్నారు. లాడెన్ ఇచ్చిన స్ఫూర్తితో వందలాది మంది అరబ్ యోధులు ఆఫ్ఘన్‌లోనే ఉండిపోయారు. 'మీ ప్రభుత్వాలు మిమ్మల్ని వెనక్కి రమ్మంటున్నాయి. మీ కుటుంబ సభ్యులు మిమ్మల్ని రమ్మంటూ మీకు రాసిన ఉత్తరాలివిగోండి' అంటూ పాకిస్తాన్ ఐ.ఎస్.ఐ. ఏజెంట్లు అఫ్ఘనిస్తాన్‌లోని అరబ్ యోధులను వెదికి బోధించసాగారు. వారు అమెరికా, పాకిస్తాన్, రబ్బానీల ఒత్తిళ్లన్నింటినీ తిరస్కరించారు. అప్పటికే ఏడెనిమిదేండ్లుగా గెరిల్లా పోరాటంలో పాల్గొన్న సైనిక అనుభవం ఉంది. తొలుత స్థానిక పష్టూన్ (పఠానీ) భాషలో అక్షరం ముక్క తెలియకుండా అరబ్ యువకులు అఫ్ఘనిస్తాన్‌కు వచ్చారు. కానీ చదవను, రాయను నేర్చుకున్నారు. ధారాళంగా స్థానిక భాషలో ప్రసగించగలిగే స్థాయికి అరబ్ యోధులు ఎదిగారు. స్థానిక ప్రజలతో మమేకమయ్యారు. వారిని స్థానిక ఆఫ్ఘన్ ముజాహిదీన్లకు తోడుగా ప్రాంతాల వారిగా పని బాధ్యతలు అప్పగించాడు. లాడెన్ ఒక విశాల రాజకీయ లక్ష్యం కోసం సౌదీ అరేబియాకు చేరుకున్నాడు.

సౌదీ అరేబియా చేరుకున్నాక తొలుత ఒక పనిమీద కేంద్రీకరించాడు. అఫ్ఘనిస్తాన్‌లో ఏడెనిమిదేండ్లు గెరిల్లా పోరాటంలో పాల్గొని వెనక్కి వచ్చిన యువకుల వేటలో మునిగాడు. మొత్తం అరబ్ దేశాలకు తన ప్రతినిధులను పంపించాడు. వారితో ఉత్తర ప్రత్యుత్తర సంబంధాలను పునరుద్ధరించాడు. రహస్య సాహిత్య ప్రచారం సాగించాడు. 1) అఫ్ఘనిస్తాన్‌లో అమెరికా ఆధిపత్య నీతి; 2) మధ్యప్రాచ్య ఆయిల్ వనరులపై పెత్తనం కోసం ఇరాన్ – ఇరాక్ యుద్ధాన్ని ప్రోత్సహించిన అమెరికా కుటిల నీతి; 3) పాలస్తీనా శరణార్థుల శిబిరాలపై ఇజ్రాయెల్ చేస్తున్న దాడులకి అండనిస్తున్న అమెరికా దుష్టనీతి; 4) లిబియాపై ఆంక్షలు, దాడులు చేస్తున్న అమెరికా దురాక్రమణ నీతి; 5) అమెరికాకి అండగా నిలబడ్డ కీలుబొమ్మ ముస్లిం ప్రభుత్వాల విద్రోహ నీతి అనే ఐదు అంశాల మీద అరబ్ యువతరాన్ని లాడెన్ చైతన్యపరిచాడు. ఈ క్రమంలోనే వివిధ అరబ్ దేశాలకి చెందిన అత్యంత నిబద్ధత, అంకితభావం, పోరాట సంకల్పబలం గల ఒక చిన్న సమూహాన్ని సమావేశపరిచాడు (1988). అందులోనే 'ఆల్‌ఖైదా' సంస్థను స్థాపించాడు.

అమెరికా, ఇజ్రాయెల్ దురాక్రమణల నుంచి ఇస్లాం దేశాలను విముక్తి చేయడం తన ప్రధాన లక్ష్యమని ఆల్‌ఖైదా ప్రణాళిక ప్రకటించింది. అందుకు 'శాంతి, సామరస్యాలు' చెల్లవని స్పష్టం చేసింది. సాయుధ పోరాటంతోనే దురాక్రమణ శక్తులను ఇస్లాం భూభాగల నుంచి తరిమివేయగలమని ఆల్‌ఖైదా ప్రణాళిక స్పష్టంగా ప్రకటించింది. సాయుధ పోరాటం చేపట్టకుండా ప్రజాస్వామ్య పద్ధతుల్లో అమెరికాను ఒప్పించవచ్చన్న ఉదార మేధావి వర్గాల హితోపదేశాలు వట్టి బూటకమని స్పష్టం చేసింది. అవి క్షతగాత్రులను, బాధితులను, పీడితులను ప్రతిఘటనకు వెళ్లనివ్వకుండా మోసపుచ్చే మాటలని చెప్పింది. తమ సాయుధ పోరాటానికి అల్లా అండదండలుంటాయన్నది. ఈ కాలపు సైతాన్‌ల మీద జీహాద్ చేయడం ప్రతి ముస్లిం కర్తవ్యం కావాలని పిలుపునిచ్చింది.

ఆల్‌ఖైదా తాత్విక, రాజకీయ దృక్పథాలలోని లోపాలను శాస్త్రీయ దృక్పథంతో విమర్శించాల్సిందే. అందులో ఎవరికీ విభేదం లేదు. కానీ ఇస్లాం ఖలీఫా పదవి కోసమే ఆల్‌ఖైదాను లాడెన్ స్థాపించాడనడం రాజకీయ వక్రీకరణ మాత్రమే. అమెరికా తొత్తు పాలకులే మధ్య ప్రాచ్యం, ఉత్తరాఫ్రికాలలో మినీ ఖలీఫాలుగా వెలగబెడుతున్నారు. కఠోరమైన త్యాగాలతో కూడిన సాయుధ రాజకీయాలను చేపట్టడాన్ని పదవీ వ్యామోహంగా చిత్రించడం దుర్మార్గమైనది. అమెరికా మీడియా ప్రపంచ ప్రజలను అపోహలకు గురిచేయగలిగింది.

### తాలిబన్లు ప్రపంచ ప్రజల ప్రథమ శత్రువులా?

ఆఫ్ఘన్‌లో తాలిబన్ల ఆవిర్భావాన్ని ప్రపంచ ప్రజలకూ, ప్రజాస్వామ్యానికీ గ్రహణం పట్టిన చీకటి రాజకీయ పరిణామంగా చిత్రించబడింది. నిజానికి ఏకధృవ ప్రపంచం ఏర్పడ్డాక ప్రపంచ ప్రజల శత్రువులందరినీ ఉమ్మడిగా సాయుధంగా ప్రతిఘటించబూనుకున్న ఓ సాహసిక మార్గాన్ని అఫ్ఘనిస్తాన్ అందించింది. ప్రపంచ సామ్రాజ్యవాద దేశాలందరికీ ఈ కొత్త శక్తి ఒక పెద్ద భూతంగా కనిపించింది. తమకి ఎదురైన భూతాన్ని ప్రపంచ ప్రజలకొక భూతంగా అవి చిత్రించాయి. అందుకు చారిత్రికాధారాలున్నాయి.

రెండు అగ్రరాజ్యాల మధ్య 'అధికార మార్పిడి' ఒప్పందం ప్రకారం సి.ఐ.ఎ. ఆదేశాలతో ఐ.ఎస్.ఐ. అధికారులు ఆఫ్ఘన్ సాయుధ గెరిల్లా దళాలను కలిశారు. ఆయుధాల స్వాధీనానికి హడావుడి ప్రయత్నాలు చేశారు. దీనికి ధీటుగా మరోవైపు లాడెన్ అనుచరులు ఆఘమేఘాల మీద గెరిల్లా దళాలను కలిసి ఆయుధాలను అప్పగించవద్దన్నారు. అత్యధిక గ్రామీణ ప్రాంతాల దళాలు లాడెన్ మార్గాన్ని అనుసరించాయి. ఇది మొదటి ముందడుగు.

వీరు వెంటనే పాకిస్తాన్‌లోని తీవ్రవాద ఇస్లామిక్ సంస్థలతో చర్చించారు. అమెరికా కుట్రలను వివరించారు. తమ రెండవ దశ గెరిల్లా పోరాటానికి కూడా పాక్ తీవ్రవాద సంస్థల అండదండలు కావాలని లాడెన్ వర్గీయులు కోరారు. ఇందులో కొంతవరకు జయప్రదమయ్యారు. ఇది రెండో ముందడుగు.

అఫ్ఘనిస్తాన్‌లోని గిరిజన తెగల పెద్దలను కలిశారు. ప్రజలు అసహ్యించుకుంటున్న నజీబుల్లా ప్రభుత్వంతో స్నేహ ఒప్పందాన్ని

వ్యతిరేకించాల్సిందిగా కోరారు. తొలుత గిరిజన తెగల పెద్దలందరూ అమెరికా పోరాట విరమణ పిలుపును అనుసరించిన వాళ్లే. కానీ లాడెన్ వర్గీయుల కృషివల్ల అందులో విభజన వచ్చింది. ఇది మూడో ముందడుగు.

ఉత్తరాది తజక్, ఉజ్జెక్, తుర్క్మనున్ వంటి మైనారిటీ జాతుల ప్రజలు అంతవరకూ ప్రధానంగా మసూద్, దోస్తుంలను అనుసరించారు. వీరు అమెరికాకు ఏజెంట్లు. కానీ లాడెన్ వర్గీయుల కృషి వల్ల మైనారిటీ జాతుల్లో కూడా విభజన వచ్చింది. ఇది నాల్గవ విజయం.

మొదటి దశ గెరిల్లా పోరాటం (1980-88) విరమించిన వెంటనే అరబ్ యోధులను తమ తమ అరబ్ దేశాలకి తిప్పిపంపించాలని అమెరికా ప్రయత్నించింది. కానీ కొన్ని వందల మందిని లాడెన్ వర్గీయులు ఒప్పించి ఆపించారు. ఇది ఐదవ విజయం.

అరబ్ దేశాలకు వెళ్లిపోయిన వేలాది మందిని పైన పేర్కొన్నట్లు లాడెన్ తిరిగి సమీకరించసాగాడు. 'అఫ్ఘనిస్తాన్‌కు తిరుగు ప్రయాణం' (రిటర్న్ టు ఆఫ్ఘన్) అనే పిలుపును ఆల్‌ఖైదా ఇచ్చింది. అరబ్ యోధులు రెండవ దశ గెరిల్లా పోరుకై మరోసారి ఆఫ్ఘన్‌కు వెల్లువెత్తారు. ఇది ఆరవ ముందడుగు.

ఇవన్నీ ఒక ఎత్తుకాగా, అఫ్ఘనిస్తాన్ మట్టి మనుషుల నుంచి నూతన గెరిల్లా పోరాట నాయకత్వం అనూహ్య స్థాయిలో ఎదగడం మరో ఎత్తు. అనేక మంది నిరుపేద రైతు కుటుంబాల నుంచి గెరిల్లా నేతలు రూపొందారు. అంతకు ముందు తెగల పెద్దలే నాయకత్వం వహించేవారు. అఫ్ఘనిస్తాన్ చరిత్రలో మొదటిసారి ఒక ప్రత్యేక రాజకీయ భావజాల ప్రాతిపదికతో గెరిల్లా సంస్థ నిర్మాణం జరిగింది. పూటగడవని నిరుపేద వ్యవసాయ కూలీ కుటుంబంలో పుట్టిన, ఉమర్ ముల్లాను లాడెన్ చేరదీశాడు. ఆయన్ని రెండవ దశ గెరిల్లా పోరాటానికి నాయకుడిగా తీర్చిదిద్దాడు. ఇది ఆఫ్ఘన్ ఫ్యూడల్, ఆదివాసీ సామాజిక పరిస్థితులతో పోల్చితే ఒక విప్లవాత్మక పరిణామం. ఈ విధంగా లాడెన్ దర్శకత్వంలో అరబ్ యోధుల అండతో, ముల్లా ఉమర్ నాయకత్వంలో రెండో దశ గెరిల్లా పోరాటం ప్రారంభమైంది. ఈ పోరాట శక్తులతో ఏర్పడినదే తాలిబన్ సంస్థ.

ఈ తాలిబన్ల సంస్థ ప్రపంచ ప్రజలకు మిత్రురాలే. ఇది అగ్రరాజ్యాలకు శత్రువు. అన్ని రకాల ఆదిపత్య రాజ్యానికి శత్రువు. ఇది ప్రపంచ ప్రజలకి అతి ప్రధాన, ప్రప్రథమ శత్రువుగా చిత్రించడంలో సామ్రాజ్యవాదులందరి ఉమ్మడి ప్రయోజనాలున్నాయి. ఈ రహస్యాన్ని ప్రపంచ ప్రగతిశీల శక్తులు గుర్తించాల్సి ఉంది.

## తాలిబన్ ప్రభుత్వం ఉగ్రవాదాన్ని ఎగుమతి చేసిందా?

1988 నుంచే సాగిన రెండో దశ గెరిల్లా పోరాటం అసాధారణ ఆటుపోట్లను ఎదుర్కొన్నది. ఆయుధాల కొరత, నిధుల కొరతలు ఎదురయ్యాయి. కరువు, క్షామాలు ఎదురయ్యాయి. ముఖ్యంగా అమెరికా, పాక్‌లు కల్పించిన కొత్త చిక్కులున్నాయి. అయినా గెరిల్లాల కొరత లేదు. ప్రజల అండదండలు పుష్కలంగా లభించాయి. 1992 నాటికి కొన్ని దక్షిణ సరిహద్దు కొండ ప్రాంతాల విముక్తి జరిగింది. ఆ తరువాత కాందహారు విముక్తి కావడం గుణాత్మక మలుపు. అంతిమంగా కాబుల్ స్వాధీనం (1996)తో తాలిబన్ ప్రభుత్వ స్థాపన జరిగింది.

అంతవరకు తాలిబన్ల గెరిల్లా పోరాటాన్ని అమెరికా వ్యతిరేకించింది. కానీ అమెరికా కల్పించిన అన్ని ఆటంకాలను అధిగమించి తాలిబన్లు అధికారానికి వచ్చారు. దీంతో అమెరికా నాటకీయ ఎత్తులకి దిగింది. ఐ.ఎస్.ఐ. సాయంతో తాలిబన్ ప్రభుత్వంతో దౌత్యాన్ని ప్రారంభించింది. తన కీలు బొమ్మ దేశాలైన సౌదీ, పాక్, కతార్, కువాయిత్‌ల చేత తాలిబన్ ప్రభుత్వాన్ని అర్జంటుగా గుర్తిస్తున్నట్లు ప్రకటింప జేసింది. వీరి మధ్యవర్తిత్వం ద్వారా తాలిబన్ ప్రభుత్వంలో చీలిక తేవాలని చూసింది. కానీ వారికి లాడెన్ మాట వేదవాక్కు. వారిలో చీలిక రాలేదు. ఇలాంటి ప్రలోభాలకై సుమారు రెండేండ్లు విఫల ప్రయత్నాలు చేసింది. ఆ తర్వాత తాలిబన్ ప్రభుత్వంపై ఒత్తిళ్లకి దిగింది.

ఈ సందర్భంగా ఒక ముఖ్య అంశాన్ని ప్రస్తావించాలి. 1991లో సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమైనది. మధ్యాసియాలోని 'ఫైవ్ స్థాన్స్' (కజకిస్థాన్, తజకిస్థాన్, కిర్ఘిస్థాన్, ఉజ్జెకిస్థాన్, టర్క్మెనిస్తాన్) దేశాలు సోవియట్ యూనియన్ నుంచి విడిపోయాయి. (ఇక రష్యా మాత్రమే ఒక దేశంగా మిగిలింది.) ఈ ఫైవ్ స్థాన్స్ అమెరికాకి దగ్గర కాసాగాయి. అక్కడ ఆయిలు, గ్యాసు వనరులు అపారంగా ఉన్నాయి. వీటిపై అమెరికా కన్ను పడింది. వాటిని అఫ్ఘనిస్తాన్ భూమార్గం గుండా పైప్‌లైన్ల ద్వారా అరేబియా సముద్ర రేవులకి తరలించాలనుకున్నది. ఈ పైప్‌లైన్ల నిర్మాణంకై తాలిబన్ ప్రభుత్వం మీద అమెరికా ఒత్తిడి తెచ్చింది. ఈ ప్రతిపాదనను తాలిబన్ ప్రభుత్వం పూర్తిగా తిరస్కరించలేదు. కానీ తమ సార్వభౌమాధికారాలకు లోబడి అనుమతిస్తానన్నది. తమ దేశ ప్రయోజనాలకి అమెరికా భంగం కలిగించినపుడు పైప్‌లైన్లను మూసి వేయడానికి తమకి అధికారం ఉండాలని వాదించింది. తమకి చెల్లించాల్సిన రాయల్టీలను కూడా డిమాండ్ చేసింది. అగ్రిమెంట్‌లో దీన్ని ఒక షరతు (క్లాజు)గా రాయాలని పట్టు పట్టింది. అప్పటికే ఇరాక్‌పై గల్ఫ్ యుద్ధం చేసి, ప్రపంచ పోలీసుగా కండకావరంతో చెలాయిస్తున్న ఏకధృవ అగ్రరాజ్యం తాలిబన్ల షరతును అవమానంగా భావించింది.

పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం వలె అఫ్ఘనిస్తాన్ మీద ఆంక్షలు విధించింది. అసలే అఫ్ఘనిస్తాన్ భూ వలయ దేశం (లాండ్ లాక్డ్ కంట్రీ). సరిహద్దుల్లో రాకపోకలకు ఆటంకం కలిగించింది. పాక్ సాయంతో కైబర్, బొలాన్ కనుమ మార్గాలను దిగ్బంధించింది. పష్తూన్ జాతికి వ్యతిరేకంగా హజారా, తజక్, ఉజ్జెక్ వంటి మైనారిటీ జాతులను రెచ్చగొట్టింది. తుదకు ఉగ్రవాదాన్ని ఎగుమతి చేస్తున్న దేశంగా నిందించి, ఐక్యరాజ్య సమితి చేత ఆంక్షలు విధింపజేసింది.

తమ మాతృదేశంలో ఆయిల్ పైప్‌లైన్ల నిర్మాణం తమ దేశ ప్రయోజనాలకి లోబడి ఉండాలన్నందుకు తాలిబన్ ప్రభుత్వం మీద అమెరికా కుట్రలు పన్నింది. ఆకలి, దారిద్ర్యం, నిరుద్యోగం, క్షామం కాటకాలతో తల్లడిల్లుతున్న ఒక అత్యంత నిరుపేద దేశం మీద ఆర్థిక యుద్ధాన్ని ప్రకటించింది. నిజానికి ఇదే అసలు ఉగ్రవాదం. కానీ అఫ్ఘనిస్తాన్‌ను ఉగ్రవాదాన్ని ఎగుమతి చేస్తున్న దేశంగా ప్రపంచం చేత నమ్మించింది. రెండున్నర కోట్ల మంది ప్రజల కడుపులు మాడ్చింది.

(ఇంకా వుంది)

*(రచయిత ఇండియన్ ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)*

వీ

*మనం ఉపయోగించే వివిధ రకాల ఇంధనాలు, అణువిద్యుత్ వినియోగ పూర్వాపరాలూ, మంచి చెడులూ వివరిస్తున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# అణుశక్తి అంటే ఏమిటి?

అణుశక్తిని గురించి అయిదారు దశాబ్దాలనుంచీ ప్రపంచానికి తెలుసు. మనదేశంలో పెరుగుతున్న విద్యుత్తు కొరతను తీర్చడానికి అణుశక్తిని వినియోగించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అణుశక్తిని గురించి అనేక వాస్తవిక, అవాస్తవిక భయాలుకూడా పెరగడం కనబడుతుంది. ఈ పరిస్థితిలో ఈ విషయాల గురించిన వివరాలు స్థూలంగానైనా తెలుసుకోవడం అందరికీ లాభిస్తుంది.



1942నాటి షికాగోలోని తొలి రియాక్టర్, మన దేశపు రియాక్టర్

అణుశక్తి న్యూక్లియర్ రియాక్టర్లద్వారా ఉత్పత్తి అవుతుంది. వీటిలో ప్రధానంగా యురేనియం ఇంధనంగా ఉపయోగపడుతుంది. దీన్ని చమురు, బొగ్గు మొదలైనవాటిలాగా కాకుండా ప్రత్యేక పద్ధతిలో వినియోగిస్తారు. ఇదంతా ఎలా జరుగుతుందో తొలిగా అమెరికాలో కనిపెట్టారు (పటం). 1942లో షికాగోలో తొలి న్యూక్లియర్ రియాక్టర్ విజయవంతంగా పనిచేసింది. అప్పటినుంచీ ఆ భౌతిక సూత్రాలమీదనే ఎన్నో రియాక్టర్లు ఈనాటికీ తయారై, ప్రపంచంలోని అనేకదేశాల్లో పనిచేస్తున్నాయి (పటం). పరిశోధకవ్యవస్థలుగా పనిచేసేవి కొన్ని తప్ప వీటన్నిటికీ ముఖ్యఉపయోగం విద్యుత్తును ఉత్పత్తిచెయ్యడమే. ఈనాడు ప్రపంచంలో పనిచేస్తున్న సుమారు 439 రియాక్టర్లలో 17 మనదేశంలో ఉన్నాయి (పటం).

విద్యుత్తు పవర్, లేదా సామర్థ్యాన్ని పాటవంగా కొలుస్తారు. ఇళ్లలో వాడే బల్బులు 40, లేక 60 వాట్ల పాటవం కలిగినవి. పదిలక్షల వాట్లను మెగావాట్ అనీ, పదిలక్షల మెగావాట్లను టెరావాట్లనీ అంటారు. ఆ లెక్కన 1965–2005 మధ్యకాలంలో ప్రపంచానికి అవసరమయే విద్యుత్తు టెరావాట్లలో ఎంతుందో పటంలో చూడవచ్చు. ఇందులో 37 శాతం చమురువల్ల ఉత్పత్తి అయింది. బొగ్గువల్ల 25శాతం, సహజ వాయువు వల్ల 23శాతం ఉత్పత్తి కాగా అణుశక్తి వల్ల 6.3శాతం తయారవుతోంది.



ప్రపంచవ్యాప్తంగా రియాక్టర్లు

విద్యుత్తును ఉత్పత్తి చేసేందుకు ఎక్కువగా ఉపయోగపడే బొగ్గు, చమురు, సహజవాయువు వగైరాలన్నీ భూమి లోపలి పొరల్లో నిక్షిప్తంగా ఉండే ఇంధనాలు. యురేనియంకూడా గనుల్లో దొరికే ఒక లోహం. ఇవేవీ ఎల్లకాలం లభించేవి కావు. ఖర్చు చేస్తూపోతే ఎంతో కొంతకాలానికి ఇవి ఖాళీ అవకమానవు.

ఇటువంటి ఖనిజ ఇంధనాలమీద ఆధారపడకుండా సౌరశక్తి, సముద్ర పుటలల శక్తి, బలంగా వీచే వాయువుల శక్తి వగైరాలన్నిటితోనూ కూడా విద్యుదుత్పాదన చెయ్యవచ్చునని రుజువయింది. ఇవి ఎల్లప్పుడూ ఉండేవే కనక ఖర్చయిపోయే సమస్య ఉండదు. అంతేకాక ఇంధనాలు మండినప్పుడు విడుదలై వాతావరణాన్ని కలుషితం చేసే పొగా, బూడిదలూ వగైరాలకు వీటి వినియోగంతో ప్రమేయం ఉండదు. ఎటొచ్చీ వీటి ఉపయోగానికి కొన్ని స్థలకాల పరిమితులుంటాయి. ఉదాహరణకు రాత్రిళుళ సౌరశక్తి లభ్యంకాదు. అలాగే వీస్తున్న గాలిలో హెచ్చుతగ్గులు సహజం. సముద్రతీరానికీ, జలపాతాలకూ దూరాన ఉన్న ప్రాంతాలకు వాటి శక్తి అంతగా ఉపయోగపడదు. జీవపదార్థాలతో తయారయే బయోఫ్యూఎల్ ఇంధనాలనుకూడా కొన్ని సందర్భాల్లో ఉపయోగిస్తున్నారు. వీటి వినియోగం ప్రస్తుతానికి పరిమితంగానే ఉంది. ఎన్ని సమస్యలున్నప్పటికీ భూమినుంచి వెలికి తీసే సంప్రదాయక ఇంధనాలమీద మనం ఎక్కువగా ఆధారపడదానికి కారణాలు ఇవే. పైగా వీటివల్ల కలిగే లాభనష్టాల గురించి పద్దెనిమిదో శతాబ్దపు పారిశ్రామిక విప్లవం నాటినుంచీ అందరికీ తెలుసు.

విద్యుత్తు ఉత్పత్తి కావాలంటే డైనమోలో జరిగినట్టుగా విద్యుత్తు



వివిధ దేశాల్లోని రియాక్టర్లు

కేంద్రకమే. మామూలుగా కేంద్రకాన్ని కలిపి ఉంచే బలమైన న్యూక్లియర్ శక్తులు ఏ కారణం వల్లనైనా విడుదల అయితే అదంతా చివరకు ఉష్ణంగానే వెలువడుతుంది. అందువల్లనే ఫిషన్ చెందగలిగిన పదార్థాలు అణుశక్తికి ఇంధనాలుగా పనికొస్తాయి.

ప్రవహించే ఒక లోహపు తీగచుట్ట ఒక అయస్కాంతక్షేత్రంలో గుండ్రంగా తిరుగుతూ ఉండాలి. ఏదైనా ఇంధనం దహనం అవుతున్నప్పుడు జనించే ఉష్ణంతో వాయువులను వేడెక్కించి టర్బైన్ యంత్రాలను గుండ్రంగా తిరిగేట్టు చేయిస్తారు. ఇటువంటి చలనం విద్యుత్తు తయారయేందుకు ఉపయోగపడుతుంది. స్థూలంగా విద్యుత్తు ఉత్పత్తి ఎక్కువ సందర్భాల్లో ఈ పద్ధతిలోనే జరుగుతుంది. ఇంధనాలు ఎలా పనిచేస్తాయి? ఇంధనాలతో సహా పదార్థాలన్నీ అణువులతో కూడుకుని ఉంటాయి. కొన్ని పదార్థాలు కొన్ని పరమాణువుల కలయికవల్ల రూపొందిన బృహదణువులుగా కనిపిస్తాయి. సూక్ష్మరూపంలో ఉండే ఈ నిర్మితులన్నీ అంతకన్నా సూక్ష్మమైన కణాలు ఒకటవడంవల్ల ఏర్పడినవే. కట్టకట్టినట్టుగా ఉన్న ఈ కణాలను విడదీసినప్పుడు వాటిని బంధించి ఉంచే శక్తి ఉష్ణంగా విడుదల అవుతుంది. బొగ్గుగాని, కార్బన్ అణువులుండే చమురువంటి హైడ్రోకార్బన్లుగాని మండుతున్నప్పుడు కార్బన్ అణువులు గాలిలోని ఆక్సిజన్ అణువులతో కలిసి కార్బన్ డయాక్సైడ్ వాయువుగా రూపొందుతాయి. నీటి బృహదణువులుకూడా తయారవుతాయి. ఈ ప్రక్రియలో శక్తి కాంతి, ఉష్ణరూపాల్లో విడుదల అవుతుంది. ఈ ఉష్ణంతో గాలినో, వాయువులనో వేడెక్కించవచ్చు. కారు, లేదా రైలు ఇంజిన్లలో ఈ వేడెక్కిన వాయువులు పిస్టన్ అనబడే ముసలకాన్ని ముందుకీ, వెనక్కీ కదిలించి దానికి తగిలించిన చక్రాలను తిప్పగలుగుతాయి. మొత్తంమీద పదార్థాల్లో అంతర్గతంగా ఉన్న శక్తిని విడుదల చెయ్యడమే ఇంధనాల ఉపయోగంలో జరిగే ముఖ్యప్రక్రియ.

బొగ్గు తదితర ఇంధనాల విషయంలో పరమాణువుల నిర్మాణానికి భంగమేమీ కలగదు. వాటి మధ్యనున్న బంధాలే భగ్నం అవుతూ ఉంటాయి. అణుశక్తి విషయంలో మాత్రం ఇలా జరగదు. ఈ ఒక్క విషయంలో అణుఇంధనాలు ప్రత్యేకంగా అనిపిస్తాయి. పరమాణువుల నిర్మాణంలో వాటి నడిబొడ్డున న్యూక్లియస్ అనే కేంద్రకం, వాటిచుట్టూ పరిభ్రమించే ఎలక్ట్రాన్లూ ఉంటాయి. కేంద్రకంలో విద్యుదావేశం లేని న్యూట్రాన్లూ, ధనవిద్యుత్తు కలిగిన కొన్ని ప్రోటాన్లూ ఉంటాయి. ప్రోటాన్లకు సమానమైన సంఖ్యలో రుణవిద్యుత్తు కలిగిన ఎలక్ట్రాన్లు కేంద్రకం వెలపల ఉంటాయి కనక మొత్తం అణువుకు విద్యుదావేశమేమీ ఉండదు. అణుశక్తి విడుదల అయే అణువిచ్ఛిత్తి (ఫిషన్) జరిగేటప్పుడు విచ్ఛిన్నమయేది

అణువుల గురించి ఇరవయ్యో శతాబ్ద ప్రారంభంనుంచీ ఎన్నో పరిశోధనలు జరుగుతున్నాయి. కంటికి కనబడనంత సూక్ష్మమైన అణువులను కొన్ని ప్రత్యేక పద్ధతుల్లో విడగొట్టినప్పుడు వాటినుంచి మన శరీరాలకు హాని కలిగించగల కణాలూ, వికిరణమూ (రేడియేషన్) ప్రసారమవుతాయని తెలిసింది. ఇలా విడుదల అయేవేవీ మనకు కనబడకపోయినప్పటికీ వాటివల్ల కేన్సర్ తదితర వ్యాధులు కలుగుతాయని తెలిశాక అణుశక్తిని గురించిన భయాందోళనలు పెరిగాయి. వీటికి తోడుగా అణుశక్తిని పెద్దపెట్టున విడుదల చేసే



టెరావాట్లలో విద్యుదుత్పత్తి – 1. చమురు, 2. బొగ్గు, 3. సహజవాయువు, 4. అణువిద్యుత్తు, 5. జలవిద్యుత్తు

అణుబాంబుల ఉత్పాతం ఎటువంటిదో 1945లో జపాన్‌మీద అమెరికా ప్రయోగించిన రెండు బాంబులవల్ల అందరికీ తెలిసింది. ఇదంతా రియాక్టర్ల గురించిన ఎన్నో భయాలకు కారణమయింది.

అణుశక్తిని గురించిన అనుమానాలు సహేతుకమైనవేనా, అణురియాక్టర్ల నిర్మాణం, వాటి పనితీరూ ఎలా ఉంటుంది, వాటి విషయంలో తీసుకోవలసిన జాగ్రత్తలెటువంటివి, వాటిని నిర్మించి ఉపయోగించడంవల్ల కలిగే లాభనష్టాలెటువంటివి మొదలైన విషయాల గురించి ప్రాథమిక స్థాయిలోనైనా అందరూ తెలుసుకోవడం అవసరం.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

## ఆకలి కేకలు

లండన్‌కు చెందిన ఆక్స్‌ఫామ్ అనే స్వచ్ఛంద సంస్థ ఆకలి బాధితులపై భారత దేశంలో ఒక సర్వే జరిపింది. ఆక్స్‌ఫామ్ సేకరించిన సమాచారం ప్రకారం భారత దేశంలో దాదాపు ఆరున్నర కోట్ల మంది ఆకలికి అలమటిస్తున్నారని తేలింది. ఆర్థికంగా భారత దేశం 1990 నుంచి 2005లోగా రెండింతలు వృద్ధి చెందింది. కానీ, ఆకలి బాధితుల సంఖ్య కూడా అదే స్థాయిలో పెరిగింది. భూమి పై ఏడింట ఒకవంతు ప్రజలు ఏ రోజుకారోజు తిండి కోసం ఎదురు చూస్తున్నారు. ప్రపంచ ఆహారవ్యవస్థలో మార్పులు తీసుకురావాలని ఆక్స్‌ఫామ్ చీఫ్ ఎక్స్‌క్యూటివ్ బార్బరా స్టాకింగ్ అన్నారు.

## సెల్‌ఫోన్‌తో ముప్పు

ప్రపంచ ఆరోగ్య సంస్థకు అనుబంధ సంస్థ అయిన ఇంటర్ నేషనల్ ఏజెన్సీ ఫర్ రీసెర్చ్ ఆన్ క్యాన్సర్ (ఐఎఆర్‌సి) అనే సంస్థ ఆధ్వర్యంలో, మే చివరిలో వారం రోజులు ఫ్రాన్స్‌లోని లయోన్‌లో సమావేశమై మనుషులపై సెల్‌ఫోన్ ప్రభావం అంశం చర్చించింది. 14 దేశాలకు చెందిన 31 మంది నిపుణులు మొబైల్ పరికరాల నుండి వెలువడే విద్యుదయస్కాంత తరంగాలు మనుషులకు కేన్సర్ కారాకాలుగా మారే ముప్పు పొంచి ఉందని అభిప్రాయపడ్డారు. గత దశాబ్ద కాలంలో ఈ అంశంపై జరిగిన అధ్యయనాల్లో ఫోన్ల అధిక వాడకంవల్ల కేన్సర్ ముప్పు పొంచి ఉందని తేలింది.

## 11వ ప్రణాళికలో అణు ప్రకంపనలు

పదకొండవ పంచవర్ష ప్రణాళికలో అణు విద్యుత్‌కు అధిక ప్రాధాన్యం ఇచ్చారు. 2032 నాటికి 64 వేల మెగావాట్ల అణువిద్యుత్‌ను ఉత్పత్తి చేయాలని కేంద్రం నిర్ణయించింది. దేశ వ్యాప్తంగా ఉన్న ఆరు అణు ప్లాంట్లలో 2010 నాటికి 20 అణు రియాక్టర్లు పనిచేస్తున్నాయి. ఇవి ఉత్పత్తి చేసే అణు విద్యుత్ 4780 మెగావాట్లు. మరో ఐదు ప్లాంట్లు నిర్మాణంలో ఉన్నాయి. వీటి సామర్థ్యం 2720 మెగావాట్లు.

## ఎం.ఎఫ్. హుస్సేన్ మరణం

భారత చిత్రకళకు అంతర్జాతీయ గుర్తింపు తెచ్చిన కళాకారుడు ఎం. ఎఫ్. హుస్సేన్ (95) జూన్ 9న లండన్‌లో మరణించారు. హుస్సేన్ మొదట హిందీ సినిమా పోస్టర్లకు రంగులు వేసే దశ నుంచి, అంతర్జాతీయ కళాకారుడి స్థాయికి ఎదిగారు. హిందూ దేవతల చిత్రీకరణలో జరిగిన వివాదం వల్ల హుస్సేన్ 2006లో దేశాన్ని వదిలివెళ్లారు. 2010లో ఆయన భారత పౌరసత్వాన్ని వదులుకొని, ఖతార్ దేశ పౌరసత్వాన్ని స్వీకరించారు. మహారాష్ట్రలోని పండర్‌పూర్‌లో 17 సెప్టెంబర్ 1915న జన్మించారు. 1966లో భారత ప్రభుత్వం ఆయనకు పద్మశ్రీ, 1991లో పద్మ విభూషణ్ అవార్డులతో పాటు కేంద్రం రాజ్యసభ సభ్యత్వాన్ని ఇచ్చింది.

## పాత్రికేయుడి హత్య

ముంబైలోని 'మిడ్ డే' దిన పత్రిక పరిశోధనా విభాగం ఎడిటర్ జ్యోతిర్మయ్ డే(56)ను జూన్ 11న పట్టపగలు ముంబై శివార్లలోని పొవాయ్‌లో ఆయన ఇంట్లోనే మాఫియా గ్యాంగ్ కాల్చిచంపింది. రెండు దశాబ్దాలుగా అండర్‌వరల్డ్ నేరాలను బయటపెడుతున్న డేను ముంబై మాఫియా చంపింది.డే గత 22 ఏళ్లుగా మాఫియా గ్యాంగులపై కథనాలు రాస్తున్నారు. డేను హత్య చేసింది మాఫియాను నడుపుతున్న చోటారాజన్ అనుచరుడు రోహిత్ తంగప్పన్ అని జాయింట్ కమిషనర్ (క్రైం) హిమాన్షురాయ్ తెలిపారు. ఈ కేసులో ఏడుగురిని అరెస్ట్ చేశారు.

## ఐజికి జీవిత ఖైదు

నలభై ఏళ్లనాటి బూటకపు ఎన్‌కౌంటర్ ఘటనపై సిబిఐ కోర్టు ఇచ్చిన తీర్పును కేరళ హైకోర్టు జూన్ 14న సమర్థించింది. తనకు విధించిన జీవిత ఖైదు శిక్ష నుంచి విముక్తి కలిగించాలని కేరళ హైకోర్టును లక్ష్మణ ఆశ్రయించగా కేరళ హైకోర్టు న్యాయమూర్తులు తిరస్కరించారు. 1970 ఫిబ్రవరి 18న జరిగిన వర్గీస్ బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో లక్ష్మణ ప్రధాన నిందితుడు. ఈ కేసుపై సిబిఐ కోర్టు మళ్లీ 1998లో విచారణ ప్రారంభించింది. లక్ష్మణ ఆదేశాల మేరకే వర్గీస్‌ను చంపినట్టు రామచంద్రన్ నాయర్ అనే సిఆర్‌పిఎఫ్ కానిస్టేబుల్ సాక్ష్యం ఇచ్చారు. లక్ష్మణకు అక్టోబర్ 18, 2010న జీవిత ఖైదు విధిస్తూ సిబిఐ కోర్టు తీర్పు వెలువరించింది.

## గోర్ఖాలాండ్‌కు ప్రత్యేక ప్రతిపత్తి

గోర్ఖాలాండ్ ప్రత్యేక రాష్ట్ర డిమాండ్‌ను పరిశీలించేందుకు నాగాలాండ్ ప్రభుత్వం కేబినెట్ సబ్‌కమిటీని ఏర్పాటు చేసింది. బెంగాల్‌లోని డార్జిలింగ్ ప్రాంతాన్ని గోర్ఖాలాండ్ పేరుతో ప్రత్యేక రాష్ట్రంగా ప్రకటించాలని గోర్ఖా జనముక్తి మోర్చా, ఈస్ట్రన్ నాగా పీపుల్స్ ఆర్గనైజేషన్‌ల ఆధ్వర్యంలో పోరాడుతున్నారు. ఆ ప్రాంతానికి బెంగాల్ ప్రభుత్వం 'ప్రత్యేక ప్రతిపత్తి'ని కల్పిస్తూ నిర్ణయం తీసుకుంది. తమకు ప్రత్యేక రాష్ట్రం ఇవ్వడం లేదా కేంద్ర పాలిత ప్రాంతంగా ప్రకటించాలని గోర్ఖా జనముక్తి మోర్చా ప్రకటించింది.

## మావోయిస్టులకు ఉరి శిక్ష

2007లో చిల్కారీ గ్రామంపై దాడి చేసి 20 మందిని చంపిన కేసులో నలుగురు మావోయిస్టులకు జూన్ 23న జిల్లాకోర్టు ఉరిశిక్ష విధించింది. ఈ తీర్పును జిల్లా అదనపు కోర్టు జడ్జి ఐ.డి మిశ్రా వెలువరించారు. ఉరిశిక్ష పడిన వారిలో ఛత్రపతి మండల్, మనోజ్ రజ్వార్, జితేన్ మరాండీ, అనిల్ రామ్ ఉన్నారు. నక్సల్స్ దాడిలో మరణించిన వారిలో జార్ఖండ్ మాజీ ముఖ్యమంత్రి బాబూలాల్ మరాండీ కుమారుడు అనూప్ ఉన్నారు.

## కొనసాగుతున్న పోస్కో వ్యతిరేక పోరు

ఒడిసా రాష్ట్ర ప్రభుత్వం పోస్కో ఉక్కు ఫ్యాక్టరీకోసం చేపట్టిన భూసేకరణను వ్యతిరేకిస్తూ పోస్కో ప్రతిరోధ్ సంగ్రామ్ సమితి, వివిధ రాజకీయ పార్టీలు, హక్కుల సంఘాలు, సామాజిక కార్యకర్తలు ఆందోళన చేస్తున్నారు. 2005లో ఒడిసా ప్రభుత్వానికి దక్షిణ కొరియాకు చెందిన పోస్కో కంపెనీకి మధ్య ఒప్పందం కుదిరింది. ప్రభుత్వం పోస్కో కంపెనీ నిర్మాణం కోసం 4004 ఎకరాల భూమిని ఇవ్వనుంది. పోస్కో కంపెనీ నిర్మాణం వల్ల 471 కుటుంబాలు, నాలుగు వేల మంది ప్రజలు నిరాశ్రయులవుతారని ప్రభుత్వ లెక్కలు చెబుతున్నాయి. భూసేకరణను వ్యతిరేకిస్తూ జూన్ 24న వందలాది మంది చిన్నారులు, మహిళలు, వృద్ధులు, యువకులు గోవిందాపూర్‌లో ధర్నాను కొనసాగిస్తున్నారు. పోస్కో నిర్మాణ పనులను నిరసనకారులు రెండు రోజులుగా అడ్డుకుంటున్నారు. పోస్కో నిర్మాణాన్ని తప్పకుండా కొనసాగిస్తామని గోవిందాపూర్ వద్ద ధర్నా చేస్తున్న ప్రదేశం చుట్టూ ప్రభుత్వం పోలీసు బలగాలను మోహరించింది. వీ

## అమెరికాలో తుపాను

అమెరికాలో వచ్చిన భారీ తుపాను వల్ల ప్రజా జీవనం అతలాకుతలం అయింది. మిస్సోరీలోని జోప్లిన్ పట్టణంలో సంభవించిన ఈ భారీ తుపానులో ఎనభై తొమ్మిది మంది చనిపోయారు. ఆస్తి నష్టం భారీగా సంభవించింది. ఇళ్లు, హోటళ్లు, ఆస్పత్రులు, వాణిజ్య సముదాయాలు దెబ్బతిన్నాయి. సమాచార వ్యవస్థ, విద్యుత్ సరఫరా పూర్తిగా దెబ్బతిన్నది సహాయక చర్యల్లో తీవ్ర ఇబ్బందులు ఎదురయ్యాయి. మిస్సోరీ గవర్నర్ అత్యవసర పరిస్థితి ప్రకటించారు.

## నైజీరియాకు కొత్త అధ్యక్షుడు

నైజీరియా అధ్యక్షునిగా గుడ్‌లక్ జోనాథన్ మే 29న అధ్యక్ష పదవీ బాధ్యతలు చేపట్టారు. అబుజా నగరంలోని ఈగిల్ స్క్వేర్‌లో ప్రమాణస్వీకారం చేశారు. జోనాథన్ నాలుగేళ్ల పాటు అధ్యక్ష పదవీలో ఉంటారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ సరికొత్త నైజీరియా నిర్మాణానానికి ఐక్యంగా కృషి చేయాలని ప్రజలకు పిలుపునిచ్చారు.

## సమసిన రాజ్యాంగ సంక్షోభం

నేపాల్‌లో రాజ్యాంగ సంక్షోభానికి తాత్కాలిక తెరపడింది. రాజ్యాంగ అసెంబ్లీ గడువును మరో మూడు నెలలు పొడిగిస్తూ తాత్కాలిక రాజ్యాంగానికి సవరణను అసెంబ్లీ సభ్యులు మే 29న ఆమోదించారు. కొత్త రాజ్యాంగం ప్రకటించడానికి గడువు ముగియడంతో నేపాల్‌లోని మూడు ప్రధాన పార్టీలు పాలక మావోయిస్టు, నేపాల్ కమ్యూనిస్ట్ పార్టీ (యూనిఫైడ్ మార్క్సిస్ట్ లెనినిస్ట్), ప్రతిపక్ష నేపాలీ కాంగ్రెస్ మధ్య ఐదు అంశాలతో కూడిన ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం ప్రకారం రాజ్యాంగ అసెంబ్లీ గడువును మరో మూడు నెలలు పొడిగించడంతో పాటు రాజ్యాం ముసాయిదా రూపకల్పన పూర్తి చేయడం వంటి వాటిని కూడా ఇదే వ్యవధిలో పూర్తి చేశారు.

## లిబియాపై అమెరికా దాడులు

లిబియాపై నాటో దాడులు ఇంకా కొనసాగుతూనే ఉన్నాయి. లిబియా రాజధాని ట్రిపోలీపై భారీ బాంబింగ్‌కు పాల్పడుతోంది. దీంతో తీవ్ర ప్రాణ నష్టం, ఆస్తి నష్టం సంభవించింది. అధ్యక్షుడు మమ్మర్ గడాఫీ మద్దతుదారులకూ, తిరుగుబాటుదారులకూ మధ్య భీకర పోరు నడుస్తోంది.

## గ్రీస్‌లో ప్రజా విప్లవం

గ్రీస్‌లో ప్రభుత్వ పొదుపు చర్యలకు నిరసనగా ప్రజలు తీవ్రంగా నిరసిస్తున్నారు. జూన్ 5న రాజధాని ఏథెన్స్ నగరంలో సింటాగ్మా స్క్వేర్ వద్ద దాదాపు యాభై వేల మంది దాకా సంఘటితమై ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలిచ్చారు. ఐరోపా యూనియన్, అంతర్జాతీయ ద్రవ్య నిధి సంస్థ (ఐ.ఎం.ఎఫ్.) నుంచి పొందిన కొత్త ప్యాకేజీలను కాపాడేందుకు మాంద్యం, ఉద్యోగాల లే ఆఫ్‌ల నేపథ్యంలో ప్రభుత్వం పొదుపు చర్యలు, పన్నుల పెంపుదలకు పూనుకొంది. దీంతో ప్రజల ఆదాయాలు గణనీయంగా తగ్గిపోయాయి. ప్రభుత్వానికీ, ఐ.ఎం.ఎఫ్. పట్ల ప్రజలు తీవ్ర ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు. దేశ ప్రధాన రుణదాతలైన ఐరోపా యూనియన్, ఐ.ఎం.ఎఫ్., ఐరోపా కేంద్ర బ్యాంక్‌లు తమ దేశం నుంచి వెళ్లిపోవాలని పిలుపునిచ్చారు.

## పెరూకు నూతన అధ్యక్షుడు

పెరూలో అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికల్లో ఒలాంటా హుమాలా విజయం సాధించారు. ఆయన తన ప్రత్యర్థి మాజీ అధ్యక్షుడు అల్బెర్టో ఫుజిమోరీ కూతురు కీకో ఫుజిమోరీపై స్వల్ప ఆధిక్యంతో గెలుపొందారు. దేశంలోని ఖనిజ నుంచి వచ్చే అపారమైన లాభాలను అత్యధిక వాటా పేదలకు అందేలా చూస్తానని ఈ సందర్భంగా హుమాలా ప్రజలకు వాగ్దానం చేశాడు.

## స్పెయిన్‌లో జోరందుకున్న నిరసనలు

స్పెయిన్‌లో కొనసాగుతున్న ఆర్థిక సంక్షోభంపై ప్రజా నిరసనలు వెల్లువెత్తుతున్నాయి. దేశంలో ఆర్థిక సంక్షోభంతో కొట్టుమిట్టాడుతున్న ప్రజలు, పెరుగుతున్న నిరుద్యోగం, ప్రభుత్వ పొదుపు చర్యలతో ప్రజలు తీవ్ర సమస్యలు ఎదుర్కొంటున్నారు. దీంతో ప్రజలు స్పెయిన్‌లోని అన్ని నగరాల వీధుల్లోకి వచ్చి నిరసన ప్రదర్శనలు చేపట్టారు.

## యెమెన్‌లో భీకర పోరు

యెమెన్ రాజధాని సనాలో అధ్యక్షుడు అలి అబ్దుల్లా సలేహ్‌కు వ్యతిరేకంగా ప్రజల పోరు తీవ్రమైంది. సలేహ్ గద్దె దిగిపోవాలని గత కొన్ని మాసాలుగా జరుగుతున్న తిరుగుబాటు తీవ్ర స్థాయికి చేరుకుంది. ప్రభుత్వ దళాలు, గిరిజన తిరుగుబాటుదార్ల మధ్య జరిగిన ఘర్షణల్లో పెద్ద సంఖ్యలో ప్రాణ నష్టం సంభవిస్తోంది. జూన్ మొదటి వారంలో అధ్యక్ష భవనంపై జరిగిన బాంబు దాడి జరగడంతో అధ్యక్షుడు సలేహ్ దేశం విడిచి సౌదీ అరేబియాకి పారిపోయారు. ఈ దాడిలో సలేహ్ స్వల్పంగా గాయపడ్డారు. దీంతో తాత్కాలిక అధ్యక్షుడిగా ఉన్న ఉపాధ్యక్షునికి అధికారాలు బదిలీ చేశారు.

## గవర్నర్‌కు జైలు శిక్ష

2005లో ఇటాలియన్ బ్యాంక్ బ్యాంకా అంటోన్‌వెనెటా టేకోవర్ విషయంలో మార్కెట్ రిగ్గింగు పాల్పడిన ఆరోపణలపై ఇటలీ సెంట్రల్ బ్యాంక్ మాజీ గవర్నర్ ఆంటోనియో ఫాజియోకు ఆ దేశ కోర్టు నాలుగేళ్ల జైలు శిక్ష విధించింది. దీంతోపాటు డచ్ బ్యాంకు ఎబిఎన్ ఆమ్రో కొనుగోలు కోసం ఇటలీకి చెందిన బ్యాంకా పాపులర్ ఇటాలియానా (బిపిఐ)ను ప్రలోభ పెట్టిన ఆరోపణలపై మిలన్‌కు చెందిన ఒక కోర్టు ఆయనకు 21.4 లక్షల డాలర్ల జరిమానా విధించింది. 1993 నుండి 2005 వరకు ఇటలీ సెంట్రల్ బ్యాంక్ గవర్నర్‌గా ఉన్న ఫాజియో పై కోర్టులో అప్పీలు చేస్తానని చెప్పారు.

## సిరియా అధ్యక్షునిపై ఆంక్షలు

సిరియా అధ్యక్షుడు బషల్ అల్ అసద్‌పై ఐరోపా యూనియన్ ఆంక్షలను విధించింది. ఆస్తులను స్తంభింపజేయడం, ప్రయాణాలపై నిషేధం వంటి ఆంక్షలు విధించినట్లు దౌత్యవేత్తలు తెలిపారు. సిరియాలో నిరసనకారులపై జరుగుతున్న దుర్మార్గమైన అణచివేతల కారణంగా ఈ ఆంక్షలు విధించినట్లు చెప్పారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 మే 2011 నుండి 20 జూన్ 2011 వరకు జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1782)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 2 | 3 | – | 16 | 18 | 3 | 1 | 2 | 1 | 2 | 2 | 1 | 2 | 3 | 19 | 26 | – | – | – | 2 | 3 |
| హైదరాబాద్ | – | – | – | 11 | 12 | – | – | – | 2 | 4 | 6 | 2 | – | – | 23 | 18 | – | – | – | 6 | – |
| కరీంనగర్* | – | 5 | – | 22 | 23 | 10 | 7 | 2 | 1 | 6 | 1 | 1 | 1 | 3 | 16 | 17 | – | – | 3 | – | 11 |
| ఖమ్మం | – | 2 | 2 | 9 | 16 | – | 4 | 1 | – | 3 | 8 | 7 | 1 | 3 | 38 | 16 | – | – | – | – | 20 |
| మహబూబ్‌నగర్ | 1 | 7 | – | 14 | 14 | 4 | 9 | 2 | 2 | 3 | 6 | 17 | 29 | 19 | 26 | 2 | – | – | 1 | – | – |
| మెదక్ | – | 3 | – | 7 | 17 | 7 | 8 | 3 | 1 | 4 | 5 | 8 | 4 | 5 | 33 | 14 | – | – | – | – | 7 |
| నల్గొండ | – | 4 | – | 18 | 14 | 2 | – | – | 1 | 9 | 1 | 9 | 3 | 14 | 64 | 32 | – | – | – | 6 | 12 |
| నిజామాబాద్ | – | – | – | 7 | 21 | – | 5 | – | – | 2 | 2 | 4 | 12 | 3 | 11 | 26 | – | – | – | – | – |
| రంగారెడ్డి | 1 | 4 | – | 14 | 14 | 8 | 16 | 4 | 9 | 7 | 4 | 3 | 12 | 4 | 42 | 12 | – | – | – | – | – |
| వరంగల్ | 1 | 5 | – | 10 | 11 | 7 | 9 | 8 | 3 | 3 | – | – | 3 | 16 | 9 | 11 | – | – | – | – | 8 |
| అనంతపూర్ | – | 4 | 1 | 8 | 3 | 1 | 7 | – | 2 | 3 | 2 | 7 | 8 | 2 | 27 | 5 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 8 | 17 | 30 | 6 | – | 5 | 4 | 5 | 6 | 14 | 7 | 73 | – | – | – | – | – | 1 |
| గుంటూరు | – | – | – | 3 | 3 | 1 | – | – | – | 1 | 4 | 5 | 1 | 3 | 27 | 11 | – | – | – | 1 | – |
| ప్రకాశం | – | 9 | – | 12 | 8 | 15 | 13 | – | 3 | 2 | 3 | 14 | 6 | 8 | 35 | 10 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | – | 1 | – | 4 | 6 | 3 | 2 | 6 | – | – | 3 | 5 | 2 | 1 | 20 | 4 | – | – | – | – | – |
| **మొత్తం** | **5** | **47** | **3** | **163** | **167** | **91** | **87** | **28** | **30** | **53** | **52** | **89** | **98** | **91** | **463** | **204** | **–** | **–** | **1** | **18** | **62** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి;
మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – ఎస్. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్;
అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్;
గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్

* కరీంనగర్ జిల్లా నుంచి ఈ నెల పూర్తి సమాచారం అందలేదు.

